# ఆంధ్రగ్రంథమాల పుస్తకములపట్టిక

| | | |
|---|---|---|
| ఆంధ్రవిజ్ఞానసర్వస్వము (2 సంపుటములు) సంపు. 1 కి | | రు. 10-0-0 |
| శ్రీ మహాఋషినిఘంటిత యోగశాస్త్రము—కా. సూర్యనారాయణయోగిని | ... | 5-0-0 |
| భగవద్గీత (సంస్కృ.)—బె. రామారావుగారి వ్యాఖ్యానముతో 1, 2, 3 సంపుటములు మాత్రమేఉన్నవి. సంపు. 1 కి | ... | 1-8-0 |
| శతకకవులచరిత్ర—వం. సుబ్బారావుగారు | ... | 1-8-0 |
| పారిభాషికపదకోశము. (ఇంగ్లీషులోని శాస్త్రీయపదముల తెలుగుపదముల నిఘంటువు) | ... | 1-4-0 |
| ఆంధ్రవాఙ్మయసూచిక (ముద్రితాముద్రితగ్రంథములపట్టిక) | | 1-0-0 |
| శ్యామసుందరము—ఓరు. సత్యనాథముగారు | ... | 1-0-0 |
| జీవనప్రభాతము (న.)—కె. యన్., వెంకటరమణిగారు | ... | 1-0-0 |
| భీష్ముడు (నాటకము)—పొ. పిచ్చిరెడ్డిగారు | ... | 1-0-0 |
| అవిమారకము (నాటకము)—మానపల్లి రామకృష్ణకవిగారు | | 0-10-0 |
| కృషీవలవిజయము | ... | 0-8-0 |
| వివాహతత్వము—బం. మల్లయ్యశాస్త్రిగారు | ... | 0-8 0 |
| నిరుద్ధభారతము—మం. వెంకటశర్మగారు | ... | 0-8-0 |
| శ్రీరామవిజయము (నాటకము) | ... | 0-8-0 |
| ఆరోగ్యసాధనము— గాంధీమహాత్ముడు | ... | 0-8 0 |
| గీతాబోధ— | ... | 0-4-0 |
| ప్రార్థనగీతావళి | ... | 0-4-0 |
| హాలికోద్ధారము—(ప్ర) శేషాద్రిశర్మగారు | ... | రు. 0-4-0 |
| మానవస్వత్వములు—థామస్ పెయిన్ | ... | 0-4-0 |
| హిందీతెలుగు బాలశిక్ష—పం. ఆ. శాస్త్రిగారు | ... | 0-6-0 |
| ,, మొదటివాచకం | ... | 0.6-0 |

మేనేజరు, ఆంధ్రగ్రంథమాల,

7, తంబుశెట్టి వీధి - - - జి. టి., మద్రాసు,



# విషయానుక్రమ

## జూలై, 1945

## చిత్రములు




సంపుటము 22

జూలై, 1945
పార్థివ ఆషాఢము

సంచిక

# మాపటి యాతన



= శ్రీ కపిస్థలం శ్రీరంగాచారి =

పడమట పచ్చినెత్తురులు పారినదారిఁ బసిండి పంక, నె
ల్లెడ చదలేలు సీలిమల లీల కనుంగొన చుక్కచుక్కగా
నెఱనెఱ తొంగిచూచెనని–ఈముదినందియడెందమందు సం
దడిదడలాడ నార్చినవి తాపములో, మునిమాపు కాకులో!

పసుపును కుంకుమమ్ము కరవైన వితంతువు పైఁబడంగ వె
క్కసముగ నేగు సీయిరుల కావరపుందమి రాజు చూచెనా,
కసకస కోయునే యని దిగాలున కాలము తల్లడిల్ల, నా
కసమున గోడువంక నునుకత్తిమెరుంగుల యంచు మించెనే!

ఈ చలికారువెన్నెలల యింగితముం గనఁబోవు భావము
ల్లేచి, పదేపదే కరువలిం బడి క్రుంగెడి పూలచూపులై
తోఁచె; వెలుంగుచీఁకటుల త్రోవల కీవల చీకురింపరా
దా–చద లొంటికంటి పెనుదయ్యముగా వణఁకించకుండునే!

# గగనలక్ష్మి



శ్రీ కుమారరాఘవశాస్త్రి =

౧

కాళిదా సన్న యట్టు లాకాశ మిపుడు
మాఘకావ్యమువోలె నిర్మలమనోజ్ఞ
మై నినిచె నాయెడంద నవ్యమృదుభావ
సముదయంబు, ఆనందసాగరంబు.

౨

విశ్వసౌందర్యమును ప్రసవించినట్టి
పచ్చిబాలెంతరాలి చెల్వొందె నభము,
నీలివన్నియ క్రొంజీర మేలిముసుగు
కలిగి, దిక్చక్ర మను నడికట్టు వైచి.

ఈ విశాలనీలాకాశ మెల్ల ఒక్క
విపులజలనిధివోలె కన్పించె నిపుడు
తారకామౌక్తికవిరాజితము, సితజల
దశకలసికతాతలశోభితమ్ము నగుచు.

౪

ఈ చరాచరాఖిలజగత్సృష్టి కెల్ల
ఆదితత్త్వమై, ఈ సర్వ మావరించి
నట్టిదై, 'అస్తి నాస్తి'యన్ వాదమునకు
హేతువైన పరాశక్తియేమొ లేక!

౫

ఇరుల పొత్తిళ్లలో ఒడల్ మరచి, నిదుర
గనిన ప్రాణిలోకముల నీ గగనలక్ష్మి
అరయుచుండు నున్మిలితానంతనేత్ర
వతియు, మాతృవాత్సల్యరూపవతి యగుచు.

౬

అంత సౌందర్యఖని ఒక్కొకపు డదేమొ
కారుమేఘాలు క్రమ్మి, క్రొక్కారుమెరుగు
చురుకుచూపులు విదళించి, ఉరిమి, గంద్ర
గోళ మొనరించు; ఆ తీవ్రకోప మేమొ!

౭

అంత కోపంబు చల్లారి, అంతలోనె
జాలినిండిన గుండెయై, సకలజీవ
నదుల పొంగించు బాష్పాంబునిధులు గురిసి,
తెలతెలంబోవునట్టి యా తీర దేమొ!!

# పశుపతి నాగనాథకవి

(క్రీ. శ. 1369)

= శ్రీ నిడుదవోలు వెంకటరావు =

ఆంధ్రవాఙ్మయమున మనకు లభించిన విష్ణుపురాణములలో దొలియాంధ్రీకరణము నాగనాథకవిది. ఈతని గ్రంథము మనకు లభింపలేదు. అందుండి యొక పద్యము మాత్రము ప్రబంధరత్నావళిలో* నిట్లు ఉదాహృతమైనది :

నాగనాథుడు-పశుపతి (శ్రీ విష్ణుపురాణము)
"మాసరమయ్యె నంత మధు
మాసము పాంథవిలాసినీజన
త్రాసము పుష్పబాణనవ
రాజ్యవిలాసము వల్లరీవధూ
హాసము మత్తకోకిలస
మంచితపంచమనాదమంజిమ
వ్యాసము జీవలోకహృద
యంగమసౌఖ్యవికాస మెంతయున్."

(పుట ౫౭. పద్యము ౧౭౩)

* ప్రబంధరత్నావళి - బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి సంపాదితము. ఇందు పెదపాటి జగ్గన ప్రబంధరత్నాకరమునను, నాంధ్రసాహిత్య పరిషత్కార్యస్థానమున గల నుదాహరణపద్యములని పేర్కొనబడిన గ్రంథమున గల పద్యములును నేర్చి పరికూర్చబడినవి. నాగనాథుని పద్యము సాహిత్య పరిషత్తువారి యుదాహరణగ్రంథముననే కలదు. కాని ప్రబంధరత్నాకరమున లేదు. పైరెండుగ్రంథములును నముద్రితములే. ప్రబంధరత్నాకరము నెం ౧౫౯ రుగా తంజావూరి పుస్తకశాలలో గలదు.

నాగనాథుని గ్రంథము మనకు లభ్యము కాకపోయినను నాతని యుదంతము కొంత యెఱుగుట కవకాశము గలదు. ఈతడు సుప్రసిద్ధుడగు సర్వజ్ఞసింగమనాయని వారి తండ్రియగు ననపోతనాయని యాస్థాని; విశ్వేశ్వరకవీంద్రుని శిష్యుడు. ఈ విషయ మీతడు రచియించిన యయ్యనప్రోలు శాసనము తెలుపుచున్నది. ఈ శాసన మన పోతనాయనివారు మైలారదేవునికి అయ్యనప్రోలుగ్రామము సమర్పించినపుడు వ్రాయబడినది. ఈ శాసనము వెలుగోటివారి వంశ చరిత్రమున (అనుబంధము ౨౦-౨౨ పుటలలో) గలదు. అందు మధ్య కొన్ని పంక్తులు లేవు. తక్కిన భాగమంతయు బాగుగ నున్నది. ఈ శాసనమున సంస్కృతభాగమును, తెలుగుభాగమును గలవు. సంస్కృత భాగము చివఱ "ఏవ మనవద్యపద్యమౌక్తిక సప్తవింశతినక్షత్రమాలా దేశభాషాసూత్రేణ గ్రథ్యతే" అని కలదు. మఱియు సంస్కృత భాగమున నీ శాసనకాలము దెలుపు శ్లోకము (౧౮) కలదు.

"శాకాబ్దే శశినందభాస్కరమితే
సౌమాఖ్యసంవత్సరే
శ్రావణ్యాం గురుయోగభాసి విజయ
శ్రీ సింగభూపాత్మజః
నిత్యశ్రీ రనపోతభూపతి రయం
దేవాయ మైలారయే
మోదా వయ్యనప్రోలుసంజ్ఞ మదిత
గ్రామం సభోగ ప్రకమ్."

(శశి-౧, నంద-౯, భాస్కర - ౧౨. "అంకానాం వామతో గతిః" అనుసూత్రము చే ౧౨౯౧ శాకాబ్దము. క్రైస్తవశకాబ్దము ౧౨౯౧+౭౮=౧౩౬౯.)

తెలుగుభాగముకడను "ఇతి శ్రీ కౌశిక బ్రహ్మర్షి గోత్రజనునా పశుపతిపండితపుత్రేణ నాగనాథకవినా లిఖిత మిదం శాశ్వత్ప్రతిష్ఠ మస్తు మంగళమహా శ్రీ శ్రీ శ్రీ" అని కలదు.

పై యంశములవల్ల నీతడు కౌశిక గోత్రుడనియు, పశుపతిపండితపుత్రు డనియు, నసపోతనాయనివారి కాలమున, ననగా క్రీ. శ. ౧౩౭౯ లో నున్నవాడనుటయు నిశ్చితము.

ఈ శాసనము చారిత్రకముగ మిక్కిలి విలువగలది. ఇందు "శ్రీ సింగమనాయని అన పోతానాయనింగారు ఓరుగల్లు, భువనగిరి, రాజుకొండ, సింగపురము మొదలైన తెనుంగుదేశ మాచంద్రతారకము నుత్తరోత్తరాభివృద్ధిగాను ధర్మరాజ్యము చేయుచును" అని కలదు. కావుననే ప్రసిద్ధపరిశోధకులచే నీవఱకే యిది ప్రమాణీకరింపబడినది. *

సంస్కృతమున నాగనాథకవి మదనవిలాసభాణ మను నొక కృతిని రచించినాడు. ఆ భాణప్రస్తావననుండి యీక్రింది యుద్ధృతాంశమువలన నీతడు చమత్కారచంద్రకారు డగు విశ్వేశ్వరకవింద్రుని శిష్యు డని తెలియనగుచున్నది. ఇదియును నసపోతనాయనివారి కాలముననే రచియింపబడినది. ఇది యముద్రితము.

"రేచర్లవంశరత్నాకరేణ శ్రీసింగభూపాలపూర్వాచలప్రభాకరేణ కేసమాంబికాకల్పప్రసూనగుచ్ఛేన శ్రీయనపోతభూపాలేన సాత్రనర్దీకృతకల్యాణనారాయణస్య వసంతోత్సవభోగ్యాజానస్యయపరిపూర్ణరత్నాకరస్య గురువిశ్వేశ్వరకవిచంద్రస్య ప్రియశిష్యో నాగనాథకవిః"

మదనవిలాసభాణము శృంగారరసప్రధానమైనది. సంస్కృతకవిత్వమున నాగనాథుని శక్తి పైన పేర్కొనబడిన శాసనమునుబట్టి తెలియదగును.

ఆంధ్రకవులలో కొరవి గోపరాజు తన సింహాసనద్వాత్రింశికలో నాగనాథుని పేర్కొనియున్నాడు.

"అనఘు హుళక్కి భాస్కరు, మ
హామతి కిల్లలి శ్రీ గురా
జును, ఘను నాగరాజు, కవి
సోముని తిక్కసోమయాజి *"

---

* శృంగారశ్రీనాథము, వస్తుప్రకరణము, పుట ౨౦౬. బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు. (1928).

Intr ducti-n Page 11 to Veluzoti vari vamsavali by Dr N. Venkata Ramanayya M. A. Ph. D. (1939) University of Madras.

# పశుపతి నాగనాథకవి

తేనకవి రంగనాథు, నుచి
    తజ్ఞుని నెజ్జన, నాచిరాజుసో
మన నమరేశ్వరుం దలతు
    మత్కులచంద్రుల సత్కవీంద్రులన్."

ప్రథమభాగము, ౧౨ పద్యము, పుట ౨. (ఆంధ్రసాహిత్యపరిషన్ముద్రణ - ౧౯౩౬ పాఠము.)

పైని వివరించిన కవులలో 'నాగరాజు' అనునది నాగనాథునికి జెల్లునని చెప్పనగును. గోపరాజు 'నాగనాథు'డనియే వ్రాసియుండును. తరువాత లేఖకులు మార్చియుందురు. పై పద్యమునకు పాఠ భేదములు గలవు. అచ్చటనైన 'నాగ'శబ్దమున భేదములేదు కావున గోపరాజీతనినే పేర్కొనె ననుట పొసగును. గోపరాజీతని పేర్కొనుటకు వేఱొక కారణముకూడ కలదు. గోపరాజు పెదతండ్రులు బాచన సింగన యనువారిరువురు ననపోతనాయని కుమారులగు కుమార సింగభూపాలుని మంత్రులని యీ క్రింది పద్యమున దెలుపబడినది.

"ఘను లగ్రజులకు నీడై
వనములు గ్రతువులును కృపులు వడి నిల్పిరి బా
చనయును సింగనయును దగి
యనపోతకుమారసింగయకు మంత్రు లనన్."
(౧-౪౭)

అనపోతానాయని తండ్రి సింగభూపతి యగుటచే నీతని కుమారునికి కుమారసింగభూపతి యని పేరు కలిగెను. అనపోతనాయని కొమారుడీ సింగభూపతియే సర్వజ్ఞబిరుదాంకుడగు తొలిసింగభూపతి. ఈతనిని బొమ్మకంటి యప్పయాచార్యుడు కుమార సింగభూపతి యని పేర్కొన్నాడు. "కుమార సింగభూపేన లక్ష్యలక్షణవేదనా" అని అమర వ్యాఖ్యలో గలదు. ఈతడు క్రీ. శ. ౧౪౦౦ ప్రాంతమున విలసిల్లెను. తన పెదతండ్రులు సింగభూపతియొద్ద మంత్రులగుటచే గోపరాజకవి క్రీ. శ. ౧౩౬౯ లో సింగభూపతి తండ్రియనపోతనాయని కాలమున నున్నవాడగు నాగనాథుని స్తుతించుట సమంజసమే యగుచున్నది. మఱియు పెదతండ్రులు జీవించిన కాలమున గోపరాజు జీవించియుండుట* యసంభవము కాదుకావున గోపరాజు నాగనాథుని నొకవేళ యెఱిగియుండిన నుండవచ్చును. సమకాలికుడే యైనను పెద తండ్రుల సంబంధమును బట్టి పేర్కొనియుండవచ్చును. నాగనాథుడా కాలమున సుప్రసిద్ధాంధ్రకవియని యీ విషయ మెఱిగించుచున్నది.

* ఈ సట్టున సింహాసనద్వాత్రింశికపీఠిక (౭ పుట)లో చేయబడిన కాలనిర్ణయము, అనగా గోపరాజు క్రీ. శ. ౧౪౪౦ ప్రాంతముదాక నుండవచ్చును అను విషయము నిరాకరింపదగినది.

# దుష్యంతుడు ఆదర్శీకరణము కాదా?

శ్రీ నండూరి బంగారయ్య

తారణ వైశాఖపు భారతి సంచికయందు "శాకుంతలవిమర్శనము : పాత్రీకరణము" అను శీర్షిక క్రింద కాళిదాసుని పాత్రీకరణము ఆదర్శీకరణము (idealisation) అను జాతికి చెందునని సిద్ధాంతీకరించుచు దానికి దుష్యంతపాత్రచిత్రణమును ఒక యుదాహృతిగా జూపుచు నేను ఒక వ్యాసమును బ్రకటించితిని. ఈ పార్థివవైశాఖసంచికలో శ్రీ మొదలి వెంకటరామయ్యగారు నావ్యాసమును, నన్నును బేర్కొనకున్నను "శాకుంతలములోని దుష్యంతుడు" అను శీర్షికక్రింద నా యాదర్శీకరణసిద్ధాంతమును ఖండించుచు ఒక వ్యాసమును బ్రకటించిరి. ప్రతివిమర్శనలకు మరల సమాధానవిమర్శనములు వ్రాయుటకంటె యుక్తాయుక్తవిచారణము సహృదయులకే వదలి యూరకుండవలె నని అనుకొంటిని. కాని ఒక నూతనసిద్ధాంతమును చేసినపుడు దానిని కొంతవరకు విపులపఱుపవలసిన బాధ్యత నామీద నుండుట చేతను, జాతీయకవిచంద్రుడగు కాళిదాసుని ప్రతిభనుగూర్చి విమర్శించుటలో వ్యక్తిగతముగా నేయపోహములకు నవకాశము లేదను నిండు విశ్వాసముతోను సంగ్రహముగ నీసమాధానము నిచ్చుచున్నాను.

నేను తలపెట్టిన శాకుంతలవిమర్శనములో i. పాత్రీకరణము, ii. కాళిదాసుని శకుంతలాచిత్రణము, iii. కాళిదాసుని దుష్యంతుడు, iv. శాకుంతలము : శకుంతలోపాఖ్యానము అను నాలుగు వ్యాసములును కలిపి చదువదగినవి. మొదటి రెండువ్యాసములుమాత్రమే 'భారతి'ముఖమున వెలువడినవి. నాలుగవ వ్యాసము ఇప్పటి భండార్కర్ ఇన్‌స్టిట్యూటువారి భారతప్రతి ననుసరించి ఇంచుమించు ముప్పది పెద్దపుటలలో (Foolscape) మూలమునకును, నాటకమునకును గల తారతమ్యమునుగూర్చి నడచిన దీర్ఘచర్చ. "ఇప్పటికే భారతీసంపాదకుల దయకు నేను అతిమాత్రముగ పాత్రుడ నయితిని. ఇట్టి పెద్దవ్యాసములను బంపుట యుక్తము కాదు. పుస్తకరూపమున బ్రచురింపవచ్చు"నను నుద్దేశముతో పైనుదాహృతమగు వానిలో iii, iv వ్యాసములు ప్రకటనార్థము పంపలేదు. అవికూడ చదివినపుడు నాసిద్ధాంతము మరింత విస్పష్టమగునని నాయాశయము. ప్రకృతము శ్రీ వెంకటరామయ్యగారి వ్యాసములోని ప్రత్యంశమునకు నేను సమాధానమిచ్చుట ప్రారంభించినచో మిగుల దీర్ఘమైన వ్యాసము వ్రాయవలసివచ్చును. ఒకటి రెండు ముఖ్యాంశములకుమాత్రమే సమాధానమిచ్చెదను.

వీరి వ్యాసమునకు కీలకముగ "దూర్వాసుని శాపవృత్తాంతము, అంగుళీయకవృత్తాంతము ఎందు నిమిత్తము గల్పింపబడినవి?" అను ప్రశ్న మేర్పడుచున్నది. ఇవి దుష్యంతపాత్ర పాత్రపోషణమునిమిత్తము గల్పింపబడె నను నాసిద్ధాంతముతో వీ రేకీభవింపక ఈ క్రిందివిధమున వ్రాయుచున్నారు:

"దుర్వాసుని శాపము, అంగుళీయకవృత్తాంతము అనునవి కథావిస్తృతికొఱకును, శృంగారరసపుష్టికొరకును నాటకమున ననుసంధింపబడినవి. మూలము ననుసరింపనినాడు కవి నిరంకుశుడుగాన ఏమార్గమునైన త్రొక్కవచ్చును." (పుట ౨౬౦)

కవి నిరంకుశు డనుట నిర్వివాదమేగాని మూలమునందలి కథను మార్చుచున్నపుడుమాత్రము మూలము

నందలి యనౌచిత్యములను సంస్కరించుకొనవలెనని గాని, మూలమునకు వన్నెగూర్పవలెననికాని ఏదోఒక ఉత్తమకళాప్రయోజనము నాశించి మూలమునకు భిన్నముగ పోవుట షేక్స్పియరు, కాళిదాసు మున్నగు ఉత్తమనాటకకర్తల సంప్రదాయము. అంతేకాని "నేను నిరంకుశుడనుకావున నాయిష్టము వచ్చినట్లు వ్రాయుదును"అని ఏ మహాకవియు తనకంటె తక్కువ కాని ఒక మహాకవి వ్రాసిన మూలమును మార్చడు. అందుచే "ఈమార్పువలన కాళిదాసు ఆశించిన విశిష్ట ప్రయోజన మెద్ది?"యను ప్రశ్నకు సమాధాన మీయ వలసియున్నది.

కేవలము కథావిస్తృతికొరకే ఈ యుదంతములను చొప్పించినాడనుట కాళిదాసుప్రతిభకు గౌరవప్రదము కానేరదు. ముఖ్యముగ నాటకకళలో గ్రంథవిస్తరమునే ఆశించు మహాకవు లుండరు. కథానిర్వహణము, పాత్రపోషణము మున్నగు ఏయుత్తమ ప్రక్రియలకో పోషకముగ నున్ననేగాని సంస్కారము దలపెట్టరు. అదిగాక శాకుంతలము రసప్రధానమగు నాటకముగాని కథాప్రధానమగు నాటకము కానే కాదు.

ఇక శృంగారరసపుష్టి కను వాదము ఎంతవరకు సమీచీనము? ఈ వాదమును ౪౬౧ పేజీ మొదటి కాలం ౩-వ పేరాలో వీరు విపులీకరించియున్నారు. శృంగారరసము పుష్టివహింపవలె ననిన సంభోగవర్ణన మొక్కటియు చాలదనియు, విప్రలంభవర్ణనముకూడ ఉండితీరవలెననియు, అందుచే నారవయంకములోని విప్రలంభావకాశమునిమిత్త మీయుదంతములు కల్పితమైనవనియు వీరివాదము. శృంగారరసము ప్రధానముగ నున్న నాటకములో విప్రలంభము విధిగ నుండితీరవలెనా యనునది మొదటి ప్రశ్న. ఉండితీరవలె ననియే వాదమునిమిత్త మంగీకరించినను తృతీయాంకముచివర నొకటిరెండు పద్యములు దీసివైచినచో ద్వితీయతృతీయాంకములం దున్నదంతయు విప్రలంభమే గాదా?

"క్షామక్షామకపోల మాననమురః
కాఠిన్యముక్తస్తనం
మధ్యః క్లాన్తతరః ప్రకామవినతా
వంసౌ ఛవిః పాండురా
శోచ్యాచ ప్రియదర్శనాచ మదన
క్లిష్టేయ మాలక్ష్యతే
పత్రాణామివ శోషణేన మరుతా
స్పృష్టా లతా మాధవీ" (అం. ౩ శ్లో ౭)

అని నాయికాపరముగాను,

"ఇద మశిశిరై రన్తస్తాపా
ద్వివర్ణమణీకృతం
నిశినిశి భుజన్యస్తాపాఙ్గ
ప్రసర్పిభి రశ్రుభిః,
అనతిలులితజ్యాఘాతాఙ్కం
ముహు ర్మణిబన్ధనాత్
కనకవలయం స్రస్తం స్రస్తం
మయా ప్రతిసార్యతే"
(అం ౩-శ్లో. ౧౦)

అని నాయకపరముగాను చేసిన వర్ణనములన్నియు సంభోగవర్ణనములేనా?

తా ముద్దేశించిన కళాప్రయోజనమును మహాకవులు సాధారణముగా తమ కావ్యములందే సూచించుచుందురు. వాని ననుసరింపగల్గినపుడే విమర్శనము సారవంత మగును. శకుంతలను గాంధర్వవిధిని వివాహమయి వీడ్కొనిన పిమ్మట ఉపేక్షించుటలోను, తరువాత ప్రత్యాదేశించుటలోను దుష్యంతుడు నిర్దోషియని నిరూపించుటకు కాళిదాసు ప్రయత్నించినాడు. ఈ ప్రయత్నములోనే దుర్వాసుని శాపవృత్తాంతమునందలి ప్రయోజనము నిరూపిత మగుచున్నది. దుష్యంతుడు నిష్క్రమింపగనే అనసూయాప్రియంవదలు గాంధర్వ వివాహమును గూర్చి ముచ్చటించుకొనుచు-

"అనసూయా:—ఏత చ్చిన్తనీయమ్.

ప్రియంవదా:—కథమివ?

అన:—అద్య స రాజర్షి రిష్టిం పరిసమాప్య ఋషిభి ర్విసర్జిత ఆత్మనో నగరం ప్రవిశ్యాంతఃపుర సమాగత ఇతోగతం వృత్తాంతం స్మరతి వా న వేతి.

ప్రియం:—విస్రబ్ధా భవ. న తాదృశీ గుణవిరోధినీ ప్రకృతిః."

అని మున్ముందు ముచ్చటించుకొన్నారు. అప్పటికి శాపవృత్తాంతము జరుగలేదు. ఇక శాపవృత్తాంతము నడచిన వెనుక అనసూయ స్వగతములో—

అనసూయా:—(ప్రవిశ్య పటాక్షేపేణ) ఏవం నామ విషయపరాఙ్ముఖస్యాపి జనస్య నైతద్విదితమ్‌ యత్తథావిధేన రాజ్ఞా శకున్తలాయా మనార్యమాచరితమ్......యే నాసత్యసన్ధే జనే శూన్యహృదయా శకున్తలా పదం కారితా. అథవా దుర్వాసఃకోప ఏవం వికారయతి. అన్యథా కథం స రాజర్షి స్తాదృశాని మన్త్రయిత్వా ఏతావతః కాలస్య లేఖమాత్రమపి నవిసర్జయతి? తస్మా దిత అభిజ్ఞాన మంగులీయక మస్య విసర్జయామి (క్రింది గీతలు నావి.)

అని శాపవృత్తాంతము యొక్కయు, అంగులీయక వృత్తాంతము యొక్కయు ప్రయోజనము స్పష్టముగ నిరూపితమగుచుండగా ఇంకను సందేహమున కవకాశ మెక్కడ నున్నది? నిర్వహణమునగూడ ఈ యంశమే యెత్తుకొని—

మారీచః—వత్స! అలమాత్మాపచారశంకయా. సమ్మోహోపి త్వయ్యుపపన్నః.

రాజా:—అవహితోస్మి.

మారీచః—......దుర్వాసశ్శాపా దియం సహధర్మచారిణీ త్వయా ప్రత్యాదిష్టా, నాన్యథేతి. సచాయ మంగులీయకదర్శనావసానః.

రాజా:—(సోచ్ఛ్వాసం) ఏష వచనీయాన్ముక్తోస్మి.

శకుంతలా:—దిష్ట్యా అకారణ ప్రత్యాదేశీ నార్యపుత్రః.

మారీచః:—(శకుంతలాం విలోక్య) వత్సే! విదితార్థాసి. సహధర్మచారిణం ప్రతి నత్వయా మన్యుః కర్తవ్యః. (క్రింది గీతలు నావి.)

కాళిదాసుడు క్రొత్తగ గల్పించిన రెండు వృత్తాంతములయొక్క ప్రయోజనమును నిర్ధారణచేయుటకు పైనుదాహృతములగు వాక్యములు చాలు నను కొందును. వీనినిబట్టి చూచినచో శ్రీ వెంకటరామయ్యగారి వాదము సరియైనది కాదని తేలుచుండుట లేదా? ప్రధానాంశమగు దీనికి వ్యాఖ్యానము సరియైనది కాకపోయినప్రుడు తక్కిన వారి దృక్పథమంతయు అంగీకారార్హము గాకపోవుటలో నాశ్చర్య మేమున్నది?

ఆయా యుదంతములను గైకొని వారొనర్చిన పాత్రీకరణనిరూపణమును విమర్శించుటకు వీలున్నది. ఒకే యుదంతమునకు అనేక వ్యాఖ్యానములు చేయుట కవకాశ ముండును. కాని అందులో నేది స్వీకారార్హమో నిశ్చయించుకొనుటకు లోకానుభవము, వివేకము మున్నగు గుణములు విమర్శకునకు తోడ్పడవలసియున్నది. శ్రీరాముని హరధనుర్భంగమును గైకొనుడు. సీతకు వీర్యశుల్కము నిశ్చయింపబడినది గావున విధిలేక చేయవలసివచ్చిన దనియు జెప్పవచ్చును. శ్రీరాముడు కేవలము శివుని తిరస్కరించు నుద్దేశముతో దానిని చేసినాడనియు చెప్పవచ్చును. రెండవ దృక్పథము పరశురామునియంతటి సమకాలికునకు దోచినది. కావున ఆయా యుదంతముల నన్వయించుకొనుటలో భేదాభిప్రాయముల కవకాశమున్నది.

వీరి విమర్శనమును జాగరూకతతో బఠించిన వెనుకగూడ కాళిదాసుని పాత్రీకరణము ఆదర్శీకరణమేగాని యథార్థప్రదర్శనము గాదను నా యభిప్రాయము నాలో మరింత బలపడుచున్నది. ఒక్క మనవి. విమర్శనమున యుక్తివాదమే ప్రధానము గాదు. సహృదయుని రసానుభవమునకు వాగ్రూపకమగు ననువాదము విమర్శనము. దాని యుక్తాయుక్తతలను సహృదయలోకమునకే విడచి భిన్నమతములనుగూడ సగౌరవముగ నాహ్వానింతము. నా విమర్శనవ్యాసములను పూర్ణముగ బఠించిన వెనుక శ్రీ వెంకటరామయ్యగారి మతము మారవచ్చు నను నాశ నాకున్నది.

# లక్షణవినోదము : క్త్వార్థకము

శ్రీ దువ్వూరి వేంకటరమణశాస్త్రి =

మన భాషలో 'విని, చని' మున్నగు పదముల లోని 'ఇ'కారమును క్త్వార్థక మని వ్యవహ రింతుము. సంస్కృతమున 'శ్రుత్వా, గత్వా' మున్నగు వానిలోని 'క్త్వా' ప్రత్యయమునకు మాఱుగాఁ బ్రయుక్త మగుచుండుటంబట్టి యీ 'ఇ' ప్రత్యయమునకు క్త్వార్థక మను వ్యవహార మేర్పడినది.

ఈ 'ఇ'వర్ణకమునకు నాంధ్రలాక్షణికు లెట్టి యర్థము నిరూపించిరి? తదర్థనిరూపణము సమగ్ర మనఁదగునా? కానిచో లోకవ్యవహారరూఢిని బట్టియుఁ, గవిప్రయోగసరణినిబట్టియు మనము విశే షించి గ్రహింపఁదగిన యర్థాంతరము లెవ్వి? అను నంశములు పరిశీలించుట యీ వ్యాసమునకుఁ బ్రధాన లక్ష్యము.

"సమానకర్తృకయోః పూర్వకాలే" (అష్టాధ్యాయి ౩-౪-౨౧)అను సూత్రముచేఁ బాణిని క్త్వా ప్రత్యయమును విధించియుండెను. వాక్యమున సమాన కర్త గల క్రియలలో నెయ్యది పూర్వకాలప్రవృత్తమో తద్వాచకమగు ధాతువునకు 'క్త్వా' ప్రత్యయము వచ్చునని యీసూత్రమున కర్థము. 'భుక్త్వా యాతి' మున్నగునవి దీని కుదాహరణములు.

ప్రాకృతాంధ్రలాక్షణికులు పలువురు పాణినీయ సరణినే మూలముగఁ జేకొని తమతమ వ్యాకరణములు రచించినవారగుటచే 'క్త్వ ఊణః' (ప్రాకృతప్రకాశము ౪-౨౩), 'క్త్వస్తుమత్తూణతుఆణాః' (హైమచంద్రము ౮-౨-౧౪౬), 'తుమత్తుఆణతూణాః క్త్వః' (రూపావతారము ౧౪-౪,) 'క్త్వాభూతయోః క్రియాన్తస్యేత్' (ఆంధ్రశబ్దచింతామణి. క్రియా), 'క్త్వా భూ త యో రిదన్తస్య' (ఆంధ్రకౌముది, క్రియా) ఇత్యాదిగా క్త్వాప్రత్యయమును బేర్కొని దాని స్థానమునఁ బ్రాకృతాంధ్రప్రత్యయములను విధించియుండిరి. దీనిం బట్టి క్త్వాప్రత్యయార్థమే యీప్రత్యయముల కర్థ మని వీరు తలంచినట్లు విశదమగుచున్నది.

ఒక వాక్యమున, క్త్వాంతక్రియయుఁ, దదితర క్రియయు సమానకర్తృకములుగనే యుండవలయు నను నియమము సంస్కృతవ్యాకరణమున బంధింపఁబడి యున్నను దన్నియమవిరుద్ధములగు మహాకవిప్రయోగ ములు సంస్కృతగ్రంథములందు విరళముగాఁ గానం బడును:—

(౧) 'కిం కృత్వా సుకృతం భవేత్' (మహాభారతము, ఆది. ౧౨౦-౩౩.)

(౨) 'స్మర సంస్మృత్య నశాన్తి రస్తిమే.' (కుమారసంభవము, ౪-౧౪.)

మున్నగు వ్యాసకాళిదాసాదిప్రయోగములఁ బరికింపుఁడు. ఇట్టి ప్రయోగములందు సమానకర్తృకతా నియమమును సమర్థించుటకుఁ గొందఱు వ్యాఖ్యాత లతిక్లిష్టమార్గము లవలంబింతురు. కాని యిట్టి వెల్ల నర్థ విశేషము గల విలక్షణప్రయోగములుగ భావించుట సమంజసమేమో! పయి ప్రయోగములందలి క్త్వాప్రత్య యమునకు హేత్వర్థకత్వము సమ్మతించినచోఁ జక్కని సమన్వయము కుదురుపడునట్లు గోచరించును. అది యెట్టటు కానిండు. ప్రకృత మనుసరామః!

'క్త్వాభూతయోః క్రియాన్తస్యేత్' అని చింతామణికర్త క్త్వార్థమున 'ఇవర్ణము' వచ్చునని స్థూలదృష్టిని విధించియుండెను. ఇటులే—

"ఒక కర్త చేయు పనులకుఁ
బ్రకటితముగ మొదల నయిన పని యిత్వాంతం
బకృతంబైనను క్త్వాంతం
బకుటిలకర్తవ్యకార్య మన్వంతమగున్."

మున్నగురీతిని భూషణకారాదు లెల్లరును సంస్కృతానుసారముగ సమానకర్తృకతానియతి నుపపాదించినవారేగాని క్త్వాప్రత్యయమునకును,'ఇ' ప్రత్యయమునకును గల భేదమును నిరూపించినవారు పూర్వులలోఁ గానరారు. ఆంధ్రభాషలో సమానకర్తృకతా నియమము పెక్కుతావులందుఁ గానంబడదు. ఈ భేదమును సూక్ష్మదృష్టిని బరికించి చిన్నయసూరి పయి నియమమును గొంత సడలించి "సమానాశ్రయంబులం బూర్వకాలంబునం దివర్ణకం బగు. ఏకాశ్రయంబులగు క్రియలలోపల నెయ్యది పూర్వకాలికం బగుం దద్వాచియగు ధాతువున కివర్ణకం బగు. ఇదియె క్త్వార్థంబు నాఁబడు. వండి-పండి - విని-కని. సమానకర్తృకంబులనక సమానాశ్రయంబు లనుటం జేసి 'చైత్రునిచే మైత్రుండు కొట్టంబడి మడిసె' నిత్యాది సిద్ధంబయ్యె." అని వక్కాణించియున్నాఁడు. ఇట్టి తావులందు సంస్కృతాంధ్రముల తారతమ్యమును గుఱుతించి వివరించినవారిలో నీతఁడే ప్రథముఁడు. కాని సమానాశ్రయత్వమయినను సరిపడక యీ చిన్నయసూరిసూత్రమునకుసయితము లొంగని ప్రయోగములు లోకవ్యవహారరూఢములు, మహాకవిసమాదృతములు, లాక్షణిక సమ్మానపాత్రములు పెక్కులు నిలిచియున్నవి.

అట్టివానిని గొంతవఱకు గుర్తించి ప్రౌఢవ్యాకరణకర్త 'ఒక్కొకచో భూతార్థకాసమాపకక్రియ హేత్వర్థకంబు నగు.'(క్రి-౧౫)అను సూత్రముచే 'ఇ' ప్రత్యయమునకు హేత్వర్థమును నిరూపించి 'రాహు కంఠము దెగి దేహము ధరణిఁ బడియె.' (భార. ఆది. ౨-౧౯) 'బిట్టడలు మనంబులం గదిరి హా యనువారును' (భార. విరా. ౩-౫) ఇత్యాదులను నన్నయతిక్కనాదులప్రయోగములను బ్రదర్శించియుండెను. 'జ్వరము తగిలి నిన్న వాఁడు రాఁజాలకపోయెను.' ఇత్యాది వాక్యములలో తగిలి=తగులుటచే అను రీతిని హేత్వర్థము నేఁటి వ్యవహారమునసయితము మిక్కిలి ప్రసిద్ధమై యున్నది. ఈరీతిగ నన్నయనాఁటనుండి నేఁటిదాఁక నాటుకొనియున్న యర్థవిశేషము నుద్ఘాటించిన పయి సూత్రము ప్రశంసకుఁ బాత్రమనుటలో సందియము లేదుగాని యర్థవిశేషప్రదర్శనమున కుపక్రమించిన యీసూత్రకారుఁడు ప్రయోగమార్గమువంక మఱికొంత దవ్వు దృష్టి సారింపవలసినది. ఎందుల కందురేని—I. నిదానించినచో హేత్వర్థము 'ఇ'వర్ణకమునకేగాక తద్వ్యతిరేకమునఁ బ్రయుక్తమగు 'క'వర్ణకమునకును గానంబడును. II. మఱియు 'ఇ'వర్ణకమునకు హేత్వర్థమేగాక మఱికొన్ని యర్థవిశేషములును బొడఁగట్టును—

(I) ౧. వీలుండి నిన్న వచ్చితిని-వీలులేక నేఁడు రానయితిని.

౨. నిరుడు వానలు కురిసి పంటలు పండినవి.- ఈయేఁడు వానలు కురియక పంటలు పండలేదు.

౩. కుటుంబపోషణము జరుగక వారటనుండి వెడలిపోయిరి.

౪. కత్తికిఁ బదను చాలక కొమ్మ తెగలేదు.

ఇత్యాదులందెల్ల 'క'వర్ణకమునకు హేత్వర్థము సుస్పష్టము ; సకలానుభవసమ్మతము. దీని కీయర్థము ఈనాఁడు వచ్చినది కాదు. భారతకాలమునుండియుఁ బ్రసిద్ధము.

"అనఘ యిది యేటి తపమే
మనుపమదుఃఖితుల మగుట నాధారము లే
కను సంతానోచ్ఛేదం
బున వ్రేలెద మధమలోకముల తెరువు సనన్."
(భార. ఆది. ౨-౧౪౨.)

అను నన్నయపద్యమున 'ఆధారము లేకను=ఆధారము లేకపోవుటచే' అని హేత్వర్థమే స్ఫురించుచున్నదిగదా ! కావున నియ్యెడఁ బయి ప్రౌ. వ్యా. సూత్రమునందును, దదుదాహరణములందును 'ఇ' వర్ణకముతోపాటు 'క' వర్ణకమునుగూడ జోడింపవలసి

యున్నది. అటు లాతఁడు జోడింపక వ్యతిరేకక్త్వార్థకములను స్మరింపనియటు లగపడుచున్నను సూత్రస్థమగు 'భూతార్థకాసమాపకక్రియా' పదమును నుభయసాధారణముగ మనము భావించి వ్యతిరేకక్త్వార్థములు గూడ సూత్రమున సంగ్రహింపఁబడినటులే తలంచుట సౌమ్యమార్గము. 'భూతార్థకాసమాపకక్రియ' యను పదము నీతఁడు తన వ్యాకరణమున రెండుసూత్రము లందుమాత్రమే వాడియుండెను. రెండుతావులందును వ్యతిరేకక్త్వార్థము లాతని మనసునఁ బాఱినటులే గోచరింపదు. అయినను గవిప్రయోగానురూపముగఁ బయి రీతిని మనము వ్యాఖ్యానించుట యసంగతము కానేరదు. నాతిక్లిష్టమగు మార్గమున గ్రంథకారులను సమర్థించు నెర వున్నయపుడు త్రోసిపుచ్చి చులుకన సేయుట తగవుగాదు.

(II) ఇఁక నర్థాంతరములు : ౧. భావార్థము. ౨. ప్రభృత్యర్థము (మొదలుకొని) లేక, ఆనంతర్యార్థము. ౩. ఆనంతర్యము, లేక సముచ్చయము. ౪. తుమున్నర్థము. ౫. భావలక్షణము అనునర్థవిశేషములు పూర్వలాక్షణికులు గుర్తింపనియవి 'ఇ' ప్రత్యయమునకుఁ గానంబడుచున్నవి.

ఇందు భావార్థము గాణపతసూత్రమున నిరూపింపఁబడినది. కొన్ని ప్రయోగములును జూపఁబడినవి. వానిలో "...కడున్విచిత్రము, ద్వారకాపురి వాయ నీ కిచ్చపుట్టుట యెన్నఁడున్ మఱి యిట్టులేగి యెఱుంగవు..." (కళా. ౩-౧౩౯) (ఏగి = ఏగుట) అను సూరనార్యుని ప్రయోగము భావార్థమునకు మిక్కిలి తగియున్నది. చక్కని లక్ష్యము. ఈ యర్థము నేఁటి వ్యవహారమునందును బ్రచురముగాఁ గానవచ్చుచున్నది. 'ఒక్కఁడును బట్టెఁడన్నము తిని యెఱుఁగఁడు.' (తిని = తినుట); 'ఇట్టి వింత లెన్నఁడును జూచియెఱుంగము' (చూచి = చూచుట) మున్నగు వాక్యములు పరిశీలింతురుగాక.

ఈ భావార్థము నన్నయకాలమందును గలదనుట నిస్సంశయము :

"ఏనెట నీవెట సుతుఁడెట
యేనెన్నఁడు దొల్లి చూచి యెఱుఁగను నిన్నున్"
(భార. ఆది. ౪-౧౦౦)

"ఇవి తద్దయు
సుకుమారము లిట్టివానిఁ జూచి యెఱుంగన్."
(భార. అరణ్య. ౪-౭.)

తిక్కనాదులును నీయర్థమును సేకరించినటులు స్థాపింపఁగలిగిన మఱికొన్ని ప్రయోగములును గలవు:

"బాలుఁడు సుకుమారుఁడు పె
ద్దాలములం జూచి యెఱుఁగఁడనక మొనసొరం
జాలుదు సొరుమని పనిచితి
నేలా నన్నా సదోసమెఱుఁగఁగనిచ్చున్"
(భార. ద్రోణ. ౨-౧౪౧)

"మనబొడ్డనబావులలో
ననుదినముఁ జరించు నంచలం దొక హంసం
గన యేమి చెప్పఁ దండ్రీ
కనివిని నే నెందు నెఱుఁగ గని విద్యలకున్"
(ప్రభావతీప్రద్యుమ్నము, ౪-౫౬)

ఇత్యాదు లరయునది.

ఇట మఱొక్క విశేషము : పయిని జూపఁబడిన భావార్థకస్థలము లన్నిటను సమానాశ్రయత్వమేగాక సమానకర్తృకత్వమునయితము సరసముగాఁ గుదురుపడియుండుటచేఁ జింతామణిబాలవ్యాకరణములవల్లనే యివి యెల్ల సాధ్యములగుచుండ వీనికై యింత విచారణ మెందులకని కొందఱకు శంక జనింపవచ్చును. సత్యమేకాని యింతటి విశేషార్థము తేటతెల్లముగ స్ఫురించుచున్న తావులందు సామాన్యమగు భూతార్థమునుమాత్రమే నిరూపించుట బొత్తిగాఁ దృప్తిలేని విధానము.

౨. ప్రభృత్యర్థము, లేక ఆనంతర్యము:—

'ఆశిశువు పుట్టి నాలుగు నెలలయ్యెను.'

'అతఁడు వచ్చి పదిదినము లయ్యెను.'

ఇత్యాదివాక్యములలో పుట్టి = పుట్టుట మొదలుకొని; వచ్చి = వచ్చుటమొదలుకొని యున్నగురీతిని ప్రభృత్యర్థమును గ్రహింపనిచో నన్వయము కుదురపడదు. పయివాక్యములలో సమాపకాసమాపకక్రియలకు సమానాశ్రయత్వమూ సంభవింపదు. (పుట్టినది శిశువు - కడచినవి నెలలు.) భావార్థమూ నసిపడదు. హేత్వర్థమూ పొసఁగదు. నెలలు నాలుగును గడచుటకు ఆ శిశువు పుట్టుట హేతు వనఁజాలముగదా! ఆ శిశువు పుట్టినను బుట్టకుండినను నెలలదారిని నెలలు గతించెడివేగాని నిలుచునవి కావు. కాఁగా నిట్టియెడ ప్రభృత్యర్థమే యన్వయోచితమని తలంపవలయును. లేదా శిశువు పుట్టినపిమ్మట నాలుగునెలలు గతించిన వను నర్థముగూడఁ బొసఁగుచుండుటచే నానంతర్యార్థమయినను సమ్మతింపకతీఱదు.

ఇట్టి వాక్యములు కవిప్రయుక్తములును గలవు:- "...ఓ వనజాక్షి యిచటి కిమ్మునివరేణ్యుఁ డేతేర దొరకొని యెన్నియోనాళ్లయ్యె నేమేమి దిద్దితి వెలుఁగఁజెపుమ..."—ఇమ్మునివరేణ్యుఁ డేతేర దొరకొని=ఈ నారదుఁడు వచ్చుట కారంభించినదిమొదలుకొని అని యిట నర్థము చెప్పవలయును. ఇట్టి వాక్యములందు సమానాశ్రయత్వము పొసఁగనేపొసఁగదు. కావున నిది భావార్థకోదాహరణములకంటె విలక్షణమని భావింపవలయును.

భారతకాలమందును నీ యర్థము ప్రసిద్ధము:—

"ఏ నేఁడు లగుడెంచె నర్జునుం డేగి..." (భార. అరణ్య. ౪-౩.)

"నినుఁగని పెద్దగాలంబు గానఁ జూడఁ దివిరి యిందులకు నేతెంచితి..." (భార. ఆశ్రమ. ౨-౧౪౬.)

ఏగి=ఏగినదిమొదలు, లేదా ఏగినతరువాత; కని=చూచినదిమొదలు, లేదా చూచినతరువాత అనిగదా యిట్టియెడ నర్థము గ్రహింపవలయును.

౩. ఆనంతర్యము-లేక సముచ్చయము:—

'దేవతారాధనమువలన నమంగళములు తొలఁగి శుభములు చేకూరును.'; 'కృషివలన దారిద్ర్యము తొలఁగి యైశ్వర్యము కలుగును.'

ఇట్టివాక్యములందు తొలఁగి=తొలఁగినయనంతరము అను నర్థము గోచరించుచున్నది. లేదా అమంగళములు తొలఁగుటయు, శుభములు చేకూరుటయుఁ గలుగు ననురీతిని సముచ్చయార్థమునయిన గ్రహింపవలెను.

'మనపుట్టి బుద్ధియెఱుఁగుటమొదలు' (హరి. పూ. ౫.) మున్నగు ప్రయోగములందు పుట్టి=పుట్టినతరువాత అను నానంతర్యార్థమే స్ఫురించుచున్నది. 'ఈ మందువలనఁ దలనొప్పి తగ్గి దాహము హెచ్చినది.' మున్నగు వాక్యములందు తలనొప్పి తగ్గుటయు, దాహము హెచ్చుటయుఁ గలిగిన వను సముచ్చయార్థమే సరిపడునటులు తోఁచుచున్నది. ఈ యర్థములకింకను గవిప్రయోగములు లభింపవచ్చును - పరిశీలింపుఁడు.

౪. తుమున్నర్థము:— "నైప్రుండు వండను బోయెను" (వండన్=వండుటకు) ఇత్యాదులందు మన లాక్షణికులు తుమున్నర్థమును 'ను' ప్రత్యయమునకు మాత్రమే నిరూపించియుండిరి. ప్రాచీనభాషలో 'ఇ' ప్రత్యయమునకుఁగూడ నీ యర్థము గలదు. ఎఱింగించి పుచ్చెను—పిలిచిపుచ్చెను ఇత్యాది ప్రయోగములందు ఎఱింగించి = ఎఱింగించుటకు ఇత్యాదిగాఁ దుమున్నర్థమును గ్రహించినపక్షముననే యన్వయము సరళమగును. ఇట్టి ప్రయోగపద్ధతి భాషలోఁ గ్రమముగా సంతరించినది. ఇప్పటి వాడుకలలో నిట్టిపదము లీ యర్థమున మచ్చునకైన నగపడవు. అయినను ప్రాచీనభాషాస్వరూపబోధకములగు లక్షణగ్రంథములలో శబ్దపల్లవంబులంబోలిన యిట్టి పదములందలి యర్థవిశేషము నిరూపింపఁబడుటయే యుచితము.

౫. భావలక్షణము:— 'దేవదత్తుఁడు వండ నతిథి వచ్చెను.' (వండన్=వండఁగా.) ఇత్యాదులందు 'ను' ప్రత్యయమునకు భావలక్షణార్థమును లాక్షణికులు

నిరూపించియుండిరి. 'ఇ' ప్రత్యయమున కీయర్థము గూడఁ గొన్నియెడల నగపడుచున్నది.

'ఆ సభలో నీ ప్రసంగము వచ్చి నీ పక్షమున నేను వాదించితిని.' – ఇట్టియెడ హేత్వాద్యర్థములం దేదియుంగాక 'నీ ప్రసంగము వచ్చి=నీ ప్రసంగము రాఁగా' అనురీతిని భావలక్షణార్థమే వాక్యతాత్పర్య బోధకము సన్నిహితమయినటులు స్ఫురించుచున్నది.

"...నేను మహేంద్రుకడకు నరిగి సంభాషణ మాచరించుచునుండ నా సభ నిక్కౌరవాధినాధు వలని వార్తలు పుట్టి యలఘుతపోవృత్తినిష్ఠాతిశయము వర్ణించి రప్డు..." (భార. ఆశ్రమ. ౨-౯) వార్తలు పుట్టి= వార్తలు పుట్టఁగా అను నర్థము పయిపద్యమున నన్వయోచితముగఁ దోఁచుచున్నది.

ఇంకను ప్రాచీనాధునాతనప్రయోగభంగిని బరిశీలించినచోఁ బయిని జూపిన యర్థవిశేషములకు మఱికొన్ని ప్రయోగములు తగినవి లభింపవచ్చును. నూతనములగు నర్థాంతరములును బొడఁగట్టవచ్చును. పురాతనలాక్షణికుల పరిశ్రమకుఁ దోడుగా ననంతరకాలికులగు భాషాసేవకులు పరిశీలనాసక్తులయి కొఱవడిన విశేషముల గుఱుతించుచుండవలయును. ఎందఱు లాక్షణికు లెన్నిటిని గుర్తించియున్నను బహుళప్రచారము గల భాషలలో నేవో కొన్ని విశేషములు సర్వసమాదరణపాత్రములయ్యు లాక్షణికుల దృష్టికి గోచరింపక మఱుఁగువడియుండుట యనివార్యము. కావుననే లక్షణగ్రంథములు సమగ్రములని యెన్నఁడును సంతుష్టిఁ జెందరాదు. అసమగ్రములని యాక్షేపించుటయుం దగవుగాదు. పూర్వులు నిరూపించినవానిని నిరవశేషముగ నాకళించి శేషించిన విశేషముల సేకరింపఁబూనుకొనుటమాత్రమే లక్షణప్రియుల కర్తవ్యము.



# కలహాంతరిత

## శ్రీ వింజమూరి శివరామరావు

తెలియలేనైతి నీ తెనెవలపు; నీవు
పిలిచినా బతిమాలినా పలుకనైతి;
ఎంత నొచ్చుకొన్నావో? నీయెడద యెంత
వ్రచ్చుకొన్నదో? వల్లవీ ప్రాణరమణ!

స్వామీ! నిన్నె స్మరింతు, నీకొరకె నిశ్వాసింతు, నాశింతు నీ
ప్రేమమ్మె; ప్రణయాపరాధివగు ని న్వీక్షించి రోషించి యే
మో మాటాడితి, తూలనాడితి నదేమో, బుద్ధిమాంద్యమ్ముచే;
ఈమాత్రమ్మున కింతగా కినుతురోయీ? ముగ్ధగోపాలకా!

అక్షు లివి యేల యరుణమైనవియొ? రసన
పరుషదుర్భాష లవి యేల పలికినదియొ?
అపుడు నను వీడి యిలువీడి యరుగునపుడు
చేతు లేల ని న్నడ్డగించినవి కావో?

నా సకలమ్ము నీ వనుచు, నా యనురక్తము జీవితమ్ము నీ
కోసమె యంచు, నిన్ను నెద గొల్చితి; తాల్చితి నాశిరమ్ముపై
నీ సెల వెల్లకాలముల; నీయెడ నీయెడ దోస మింత నే
చేసితి నీసుచే వగపుచే; దయచూపవో దాసురాలిపై?

దరిసిన దర్శింపను నీ
చరణమ్ముల, వికచనీరజమ్ముల, లక్ష్మి
కరముల, నవవక్షశిరః
కిరీటమాణిక్యముల; నికృష్టను స్వామీ!

# జ్యోతిర్వేదము

= శ్రీ గొబ్బూరు వెంకటానంద రాఘవరావు =

విజ్ఞానశాస్త్రము నిర్దిష్టమైన లెక్కలతోను, కొలతలతోను కూడుకొని ఉన్నది. అన్ని శాస్త్రముల కంటె జ్యోతిశ్శాస్త్రమునకు ఈ లెక్కలు, కొలతలు మిక్కిలి ముఖ్యము. చంద్రుడు, సూర్యుడు, నక్షత్రములు మొదలగు ఖగోళసంచారుల గమననిర్ణయవిధానమే జ్యోతిశ్శాస్త్రమునకు ప్రారంభమని చెప్పవచ్చును. మనకు కనపడుచున్న సూర్యగమనముచేత దినము ఏర్పడుచున్నది; చంద్రగమనమువలన చాంద్రమాసము ఏర్పడుచున్నది. మాసము నిర్ణయించుకొనుటకు చంద్రుని మనము ఒక కొలబద్దగా ఉపయోగించుకొనుచున్నాము. ఒక గుడ్డ ఇన్నిగజములు అని కొలిచి చెప్పుదుము. ఒక బల్ల ఇన్ని అడుగుల పొడుగు, ఇన్ని అడుగుల వెడల్పు అని చెప్పుదుము. మూడు పడుల బియ్యము, రెండుశేర్ల పాలు, మానెడు పప్పు అని ఆయా కొలపాత్రలతో కొలిచి వాడుకొనుచున్నాము. మాన, మానిక శబ్దములు కొలత కాధారములైన Standards మొదటి లెక్కలను, సూత్రములను తెలుపుచుండును.

## ఇంగ్లీషు Moon సంస్కృత 'మాన' శబ్దభవము

ఎ. ఎ. మెక్డొనెలు పండితుడు తాను రచించిన సంస్కృత-ఇంగ్లీషు నిఘంటువు ౨౨౫-వ పుటలో 'మాన' శబ్దమునకు అర్థములు ఇట్లు వ్రాసినాడు:— "Measure; measuring; measuring cord; standard; dimension; size, height; length also of time" కాబట్టి కాలమానమును నిర్ణయించుకొనుటకు సదుపాయమైన సాధనము అనే అర్థములో సంస్కృత 'మాన' శబ్దమునుండి ఇంగ్లీషు Moon అనే పదము జనించెనని స్పష్టముగా తెలియుచున్నది. Moon అనగా చంద్రుడు; భూమిచుట్టు ఒకసారి చంద్రుడు తిరిగివచ్చుటకు పట్టు కాలపరిమితి 'Month'; మాసము.

## చాంద్రమానము, సౌరమానము

చంద్రుడు భూమిచుట్టును ఒకసారి తిరిగివచ్చుటకు సుమారు ౨౯ రోజుల ౧౨ గంటల ౪౪ నిమిషముల ౩ సెకెండ్లకు కొంచెము తక్కువకాలము పట్టును. పండ్రెండుమాసములలో పండ్రెండుసారులు భూమిచుట్టు తిరిగి పండ్రెండునెలలు పూర్తియగుసరికి ౩౫౪ దినముల ౮ గంటల ౪౮ నిమిషముల ౩౬ సెకెండ్ల చిల్లరకాలము అగుచున్నది. భూమి సూర్యునిచుట్టు ఒకసారి తిరిగివచ్చుటకు నక్షత్రగణితరీత్యా (Sidereal year) ౩౬౫ రోజుల ౬ గంటల ౯ నిమిషముల ౯ సెకెండ్లు రమారమిగా అగుచున్నది. సూర్యునిచుట్టు ప్రదక్షిణముచేసి తిరుగునది భూమి; అయినను స్థూలదృష్టికి సూర్యుడు కదులుచున్నట్లు తోచుటచేత లోకవ్యవహారములో సూర్యగమనమని వాడుక; దానినిపట్టి సౌరమాసము, సౌరమానమని వాడుకలో చెప్పుకొందుము. పండ్రెండు చాంద్రమాసముల కాలగతికిని, సౌరసంవత్సరమునకును మధ్య తేడా ౧౦ రోజుల ౨౧ గంటల ౨౦ నిమిషముల ౩౫ సెకెండ్లు చిల్లర ఉన్నట్టు స్పష్టము అగుచున్నది. ఈ తేడా

సవరణచేసి దిద్దుకొనుటకు మనవారు మూడుసంవత్సరములలో ఒక అధికమాసముగాని, అయిదుసంవత్సరములలో రెండు అధికమాసములుగాని చేర్చుచుందురు. పందొమ్మిది సంవత్సరములలో ఏడు అధికమాసములు వస్తవి. ఈలాగు సవరణచేసుకొనుచు వెళ్లగా వెళ్లగా ఒకానొకప్పటికి ఈ దిద్దుబాట్లు ఎక్కువ అవుతవి. అప్పుడు ఒక మాసము తగ్గించి సరిచేసు కోవలసి వస్తుంది. ఇలాగు పూర్తిగా జారవిడుచు కోవలసిన మాసమునకు 'లుప్త'మాసమని పేరు. వెనుక ౧౨౦ సంవత్సరములకిందట ౧౮౨౩ లో లుప్తమాసము వచ్చినది. ఇక ఇరవై సంవత్సరములలో గా—౧౯౬౩-౬౪లో ఒక లుప్తమాసము రాగలదు. ఇలాగ అవసరమైనపుడెల్లా అధికమాసములు చేర్చుకొనీ, అవి ఎక్కువ అయిపోయినపుడు ఒక మాసము పూర్తిగా జారవిడుచుకొనీ మన పంచాంగములను, కాలమును సవరణచేసుకుంటున్నాము.

* Lokamanya B. G. Tilak : Orion, Page 13 —

"The main idea of the yearly sacrifice appears to be an old one. The etymology of Ritvij (ritu-yaj) is season sacrificer. Note the correspondence between the sacrifice and the seasons. In సంవత్సర 'వస్' is to dwell. Year is a period where seasons dwell. It is a cycle of seasons. The priests were not only sacrificers but time-keepers. In Rome the care of the calenders was considered a religious function and it had from the earliest times been placed in the hands of the pontiff... Plato states that the months and years are regulated in order that the sacrifices and festivals may correspond with the natural seasons...Cicero remarks that the system of inter-colation was introduced with this object." Lewis Historical survey of Astronomy of Ancients, Page, 19, 24.

## అధికమాసములు చేర్చి పంచాంగములు సవరించుకోకపోతే ఏమి ప్రమాదము ?

మన ముసల్మాన్ సోదరులకు చందువే ముఖ్యము. వారికి చంద్రవంక—బాలచంద్రుడే—కాలచిహ్నము. వారి సంవత్సరములో పండ్రెండు చందులు, అనగా చాంద్రమాసములు మాత్రము కలవు. ఋతువులతోను, సౌరమానముతోను వారికి అంతగా పనిలేదు.

మన హిందువులకు అట్టి లెక్కలు పనికిరావు. వ్యవసాయజీవనము, దేవపూజనము మనకు మిక్కిలి ముఖ్యము. మాసమునకును, సంవత్సరమునకును మధ్య మనకు ఋతుభేదము గమనించుట అత్యవసరము. సంవత్సరములో వేసవికాలము, శీతాకాలము నని రెండే ఋతువులు గలవని కొందరు ; వేసవి, వర్ష ఋతువు, హేమంతము నను మూడు ఋతువులని కొందరు ; వసంత, గ్రీష్మ, వర్ష, శరత్, హేమంత, శిశిరములను ఆరుఋతువు లని కొందరు. ఏ విధముగా చూచుకొన్నను, వ్యవసాయము ముఖ్యవృత్తిగా గల హిందువులకు వర్ష ఋతువు మిక్కిలి ముఖ్యము. వర్షాధిపతులైన ఇంద్రాదిదేవతలను సకాలములో పూజించి యజ్ఞములు చేయవలెను. అనగా ఋతువుల నెరిగి యజ్ఞములు చేయవలెను. అట్లు చేయించువారు ఋత్విజులు.*చాంద్రమానమునకును, సౌరమానమునకును మధ్య సంవత్సరమునకు సుమారు ౧౧ దినములు భేద మున్నది. కేవలము చందుతే లెక్కించుకొనిపోవు ముసల్మానుల పండుగలు ఋతుభేదము గమనింపవు. వారి మొహరం పండుగ ఒకప్పుడు మన చైత్రములో శ్రీరామనవమితో వచ్చును. ఒకప్పుడు భాద్రపదములో గణపతి ఉత్సవములతోను, మరొకప్పుడు ఆశ్వయుజములో దసరా పండుగలతోను, వేరొకప్పుడు పుష్యములో సంక్రాంతి పండుగలతోను రాగలదు. ముప్పదిమూడు సంవత్సరములలో వారి పండుగలు అన్ని మాసములలో తిరిగి రాగలవు. ౩౩ × ౧౧=౩౬౩. ఋతుభేదము పాటింపక చందులనుమాత్రము చూచుకొనిపోవుటలో హిందువులకు వ్యవసాయపు పనుల్లలో నేమి, దేవపూజ, పితృ

పూజాది కర్మలలోనేమి, నిత్యజీవనములో మిక్కిలి చీకాకులు సంభవించును. కావుననే ప్రాచీనకాలముల నుండి మనలో అధికమాసము చేర్చుకొని ఋతుసహిత మైన సంవత్సరము నిలుపుకొనుట ఆచారమైయున్నది. ఈ యంశము శునఃశేఫుడు వరుణునిగూర్చి తెలిపిన వేదమంత్రములవలన స్పష్టమగుచున్నది:* "తన పవిత్రధర్మములను చక్కగా తెలిసికొని ధృతవ్రతుడైన వరుణుడు ప్రజావతములగు పండ్రెండు మాసములను ఎఱుగును; మరియు అప్పుడప్పుడు వచ్చు అధికమాసమునుకూడ అతడు బాగుగా ఎఱుగును." దీర్ఘతముడు సంవత్సరాత్మకమైన కాలచక్రములో తెలిపిన ౩౬౦ తిథులను పండ్రెండు చాంద్రమాసములు పూర్తియగు ౩౫౪ దినములలో సర్ది, అవసరమునుబట్టి అధికమాసములను చేర్చుచు మన సిద్ధాంతులు పంచాంగములను సవరణచేయుచుందురు. †

## గ్రహణములు, తురీయ యంత్రవిజ్ఞానము

అత్రిమహాఋషి ఒక గొప్ప సూర్యగ్రహణమును తురీయ మను యంత్రసాధనమును వాడుకచేసి తెలిసికొనినట్లు వర్ణింపబడినది. సంస్కృతభాషలో తురీయ మను శబ్దమునకు నాలుగవది అని అర్థము. ఎందులో నాల్గవది అని ప్రశ్న. ఒక వలయములో నాల్గవవంతు తెలుపు యంత్రసాధనమును తురీయ మందురు. ఈ యంత్రసాధనమునే ఇంగ్లీషు వారు ఇంగ్లీషుభాషలో Quadrant అందురు. తురీయ మను యంత్రమును ఇటీవల భాస్కరాచార్యులవారు తమ సిద్ధాంతశిరోమణి X-౧౫లో వర్ణించియున్నారు. తురీయయంత్రములు ఇప్పటికిని పెదపర్తివారు మొదలగు మన దేశపు సిద్ధాంతుల ఇండ్లలో వాడుకలో ఉన్నవి. యంత్రార్థద్యోతకమైన తురీయమును ఆ యర్థములోగాక కేవలసంఖ్యావాచకముగా గ్రహించి ఈ వేదమంత్రమునకు సాయనాచార్యులు అర్థము చెప్పుట తగదని లోకమాన్యుడు తీవ్రముగా విమర్శించెను. ‡ ఈమంత్రములో తురీయము, స్వర్భానువు అను రెండింటి ప్రశంస కలదు. స్వర్భాను వనగా ఛాయాగ్రహమైన రాహువు. తురీయ మనునది ¼ వలయ యంత్రము. ఇట్టి యంత్రసాధనములచే వేదఋషులు గ్రహణములను తెలిసికొనుచుండి రని స్పష్టమగుచున్నది.

---

* ఋగ్వేదము I. ౨౫-౮:—"వేదమాసో ధృతవ్రతో ద్వాదశప్రజావతః వేదాయ ఉపజాయతే."

† Lokamanya B. G. Tilak : Orion. Page 15:-

"Now a month of thirty civil or సావన days cannot correspond with a lunar synodical month and the Brahma-vadins had therefore to omit a day in some of the savana months to secure the concurrence of civil and lunar months. The year of 360 savana days was practically reduced to a lunar year of 354 civil days or 360 tidhis."

‡ Lok. B. G. Tilak : Orion. P. 160: "Atri knew the eclipsed sun by తురీయ బ్రహ్మ and శాయన interprets the last two words to mean the fourth verse or మంత్ర. But the verse wherein these words occur is itself the 6th being V 40-6 and Sayana has to explain that by fourth is to be understood as fourth from sixth i e. by tenth verse ! The explanation appears to me quite unsatisfactory...we cannot accept an interpretation which makes the 4th = 10th verse of the hymn V 40-6."

"స్వర్భానో రథ యదింద్ర మాయా అవోదివో వర్తమానా అవాహన్-గూళ్హం సూర్యం తమసా పవ్రతేన తురీయేణ బ్రహ్మణా వింద దత్రిః" అనగా సూర్యుడు అంధకారముచేత ఆవరింపబడినవాడై వెలుగు ప్రసరింపజాలక ఆటంకమునొంది చిక్కువడ్డట్లు అత్రిమహాముని తన తురీయ మను యంత్రసాధనముచే తెలిసికొనెను. అంతలోనే, ఓ ఇంద్రా! ఆకాశము దిగువ తన మాయాబలముచే సూర్యుని కబళించి పట్టిన స్వర్భాను వను ఛాయాభూతమును ఖండించివైచితివి."

"బుద్ధిమాంద్యజనితోన్మాదుల్ గదా శ్రోత్రియుల్" అని శ్రోత్రియుల కొక అప్రతిష్ఠ అంటకట్టబడినది. వేదఋషులు ఏమీ యెరుగని పరమ జడులని పడమటి విమర్శకులు డప్పుకొట్టి గేలిచేయుచున్నారు. అంతకంటె అట్టహాసము చేయుచు వారికంటె ముందు మన విమర్శకులే వేదఋషులు యంత్రజ్ఞాన మెఱుగని పరమభాండదను లని చాటుకొనుట ఆచారమైపోయినది. అట్టివారు ఇట్టి మంత్రార్థములను సావధానముగా తెలిసికొని, ఇప్పటికైనను చవకవిమర్శనలనుండి విరమించుట కనీసధర్మమని విన్నవింతును.

## మన సూర్యు డొక నక్షత్రము : నక్షత్రములు సూర్యులు

## (Our sun also is a Star; stars are suns)

ఆకాశమునందు మెఱయు నక్షత్రములు వేలును, లక్షలును కలవు. వానితోపాటు మన సూర్యుడుకూడ ఒక నక్షత్రమని ఈ నాటి వైజ్ఞానికులు చాటుచున్నారు. ఇతర నక్షత్రములవలెనే మన సూర్యుడు ఒక నక్షత్రమని వేదఋషులు ఎఱుగక పోలేదు. కేతు వను పేరు గల వేదఋషి ఒక అగ్నిసూక్తములో * మన సూర్యుని ఇట్లు వర్ణించినాడు:

"ఓ అగ్ని దేవుడా! మనుష్యులకు వెలుగును, వేడిమిని ఇచ్చుచుండుమని నియమించి సూర్యుని నక్షత్రముగా చేసి ముగా మెఱయుచుండుమని నీవే ఆకాశమున కెక్కించి అచట నిలిపి ప్రకాశింపజేయుచున్నావు."

అంతే కాదు : ఈ భూమిమీద ఏడు దిక్కులను వ్యాపించి మెఱయు నక్షత్రములు సూర్యులనికూడ వేదఋషులు ఎరుగుదురు. † ఈ నాటి కవులకు, వైజ్ఞానికులకు బాగుగా తెలిసిన ఈ ప్రకృతి సత్యములు వేదఋషులకు క్రొత్తవి కావు. ‡

## తేజస్సు, పరిమాణము-ఈవిషయములలో నక్షత్రములను పైపారువేయుట, తారతమ్యము తెలిసికొనుట

నక్షత్రములను ఒకదానితో ఒకటి పోల్చి తారతమ్యములను తెలిసికొనుటకు మేధాతిథి యను వేదఋషి ప్రయత్నించెను. అతడు మన భూమిని, ఆకాశమును, మన సూర్యుని ఉదయమగుచున్న ఇంద్రునితో పోల్చి చూచినాడు. ఇంద్రుడు ఆర్యుల దేవత ; నక్షత్రస్వరూపుడు. ఆర్యుల దేవత లందరును తేజోఘనులు ; నక్షత్రస్వరూపులు. వృశ్చికరాశిలో నెట్టగా మెఱసిపోవు జ్యేష్ఠనక్షత్రము ఇంద్రుడు. "జ్యేష్ఠానక్షత్రమ్ ఇంద్రో దేవతా"అని కృష్ణయజుర్వేదన క్షత్ర ఇష్టి స్పష్టముగా తెలుపుచున్నది. ఈ జ్యేష్ఠనక్షత్రమును పడమటి ఖండముల జ్యోతిశ్శాస్త్రవేత్తలు (Antares) 'అంటారిస్'అందురు. ఈనాటి అత్యద్భుతయంత్ర పరిశోధనలవలన ఈనక్షత్రము సూర్యునికంటె నాలుగువేల రెట్లు ఎక్కువ తేజస్సు కలదనియు, పరిమాణవిషయమున మన సూర్యగోళములు తొమ్మిది కోట్లు ఏకమైతే ఒక జ్యేష్ఠనక్షత్ర మగుననియు తేలినది. $ ఇన్ని రెట్లని స్పష్టముగా చెప్పలేదుకాని, ఇంద్రుడు మన భూమిఆకాశములకంటెను, మన సూర్యునికంటెను గొప్పవాడనియు, మన సూర్యులు ఒక వేయియుండి అయినను ఉదయమగుచున్న ఇంద్రునితో సాటి కాజాలరనియు మేధాతిథి ఈక్రింది సూక్తములో చక్కగా వర్ణించిచెప్పినాడు:—

* ఋగ్వేదము X. ౧౫౬-౪. "అగ్నే నక్షత్రమజరమా సూర్యం రోహయో దివదధర్జ్యోతి ర్జనేభ్యః."

† ఋగ్వేదము IX. ౧౧౪-౩. "సప్తదిశో నానాసూర్యాః"—కశ్యపఋషి.

‡ Night Thoughts: Poet Young :—
"These sparks of night-These stars shall shine-Unnumbered suns".

$ Sir James Jeans : 'Stars in their courses' P. 181 ; 'Universe around us' P. 278.

"యద్ద్యావ ఇంద్ర తే శతమ్ శతమ్ భూమి రుతస్యుః
నత్వా వజ్రి న్సహస్రమ్ సూర్యా అనునజాతమష్ట
రోదసీ" (ఋగ్వేదము VIII—౫౯-౫)

ఖగోళవేధ చేయుచుండిన మన వేదఋషులు సూర్యచంద్రమానములు తెలిసికొని ఋతువుల నట్లే ఉంచుకొని అధికమాసములు అవసరమైనపుడు చేర్చుకొనుచు సంవత్సరపరిమితి నిలుపుకొనుచుండిరని మనము తెలిసికొంటిమి. తురీయయంత్రములచే గ్రహణములను, వాటి పరిమితులను వారు తెలిసికొనుచుండిరని ఎరిగితిమి. సూర్యుడొక నక్షత్రము; నక్షత్రములు సూర్యులనికూడ వారికి తెలియునని మనము తెలిసికొంటిమి. వాని తేజస్సులు, పరిమితులుకూడ తైపారు వేయుచుండిన విషయముకూడ తెలిసికొంటిమి. అయితే ఈనాడు **Milky way** అనియు, **Nebulae** అనియు పాశ్చాత్యులు తెలుపు ఖగోళదృశ్యములుకూడ వేదఋషులు ఎరుగుదురా? వాటి ప్రాముఖ్యము వారికేమైన తెలియునా అను విషయములను గూర్చి మనము ఇక పరిశోధింపవలసియున్నది.

## క్షీరసాగరము (Milky Way)

ఆకాశరంగమును ఏమాత్రము శ్రద్ధతో పరిశీలించినను తెలతెల్లగాను, మబ్బుమబ్బుగాను, పొగరూపమున సున్న మంచుతో నిండిన ప్రవాహమువలె ఒకానొక విచిత్రదృశ్యము కానవచ్చును. అనాదికాలముల నుండి అనేకదేశములవారు ఈ దృశ్యమును అనేకవిధముల భావించి వర్ణించుచుండిరి. మనవారీ ధవళదృశ్యమునుగూర్చి ఏమి వ్రాసిరో, మన నిత్యజీవనములో గృహములందు దీని నేవిధముగా ప్రదర్శించుచున్నారో ఇపుడే తెలిసికొందము. కాని ముందుగా పడమటి దేశములలో ప్రసిద్ధులైన ప్రాచీననవీనకవుల వర్ణనములు ౪-౫ మాత్రము ముందు వ్రాయుచున్నాను.

Ovid అను మహాకవి:—

"When the sky is clear, a pathway of very radiant white colour may be seen in the Emperean...and along it the immortals repair to the august dwelling of the Lord of Thunder"

మరొక పండితుడు:— "Through all History and through the folklore of all nations the Milky way plays its part".

స్వర్గాపగ:—"Since time out of mind the Milky way has been thought of as the RIVER OF HEAVEN"

మిల్టన్ మహాకవి:—

"A broad and ample road whose dust is gold
And pavement stars as stars to us appear
A way there is in Heaven's extended plain
Which, when the skies are clear, is seen below
And mortals by the name of 'Milky' know
The ground work is of stars, through which the Road
Lies open to the Thunderer's Abode.
It is The way to God's Eternal Home."

ఎడ్వర్డు యంగు:— "The Gorgeous Arch with golden worlds inlaid."

చీనావారు:—In China it is called Tien Ho, the Celestial River. It is the White Road running to the land of the Hereafter.

మనము వ్రాయుచున్న జ్యోతిర్వేదమునకు ఈ భావములు మిక్కిలి అవసరము. ఏమనగా, ఓవిడ్ మహాకవి మతముప్రకారము చనిపోయినవారి ఆత్మలు విశ్వప్రభుని మహనీయమందిరము చేరుకొనుటకు ముందు ఈ మార్గము ననుసరించిపోవును. అనాదికాలమునుండి ఈ మిన్నేరు "స్వర్గాపగ" అనియే వ్యవహరింపబడుచున్నది. మిల్టను అభిప్రాయముకూడా పుణ్యాత్ములు ఈ తెల్లరస్తామీదుగానే వెళ్లి పరమేశ్వరుని పుణ్య

ధామము చేరకొందురనియే. మరణానంతరము జీవులు ఈ ధవళమార్గము ననుసరించి పోయిపోయి స్వర్గలోక విహారియగు నీ పుణ్యస్రవంతి జేరుకొని ముక్తి బడయుదురు. ఇది చీనావారి విశ్వాసము. ఈ మిన్నేరు ఖగోళమును ఒక ఒడ్డాణమువలె ఆవరించియున్నది. దీనిని పడమటివారు (Galactic wheel) క్షీర (సాగర) చక్రమని చెప్పుదురు. ఈ పాల సముద్రమును తఱచుట వలన అనేకపదార్థములు పుట్టెనని మన పురాణములలో కలదు. వానిని చర్చించునపుడు ఈ క్షీరసాగరమును గూర్చి వివరము తెలుసుకోగలము. ప్రస్తుతము పాల వెల్లినిగూర్చి ఋగ్వేదములో వ్రాసిన ఒక మంత్రము మాత్రము పరిశీలింతము.

"దివః పీయూషం పూర్వ్యం దుక్థ్యం మహో గాహా ద్దివ ఆనిరధుక్షతఇంద్ర మభిజాయమానంసమస్వరన్"

ఋగ్వేదము IX-౧౧౦-౮.

అనగా గభీరాకాశముయొక్క లోతుపాతుల నుండి స్తుతిపాత్రములైన తొలికాలపు స్వర్గక్షీరములను వారు వెలికితీసి ప్రవహింపజేసిరి; ఉదయించు ఇంద్రునిగూర్చి వారు ఎలుగెత్తి గానముచేసిరి అని యర్థము.

ఇంద్రుడనగా జ్యేష్ఠానక్షత్రమని తెలిసికొంటిమి. క్షీరసాగరచక్రముయొక్క 'Hub', అనగా ఇరుసు తిరుగు "కుంచము"వంటి మధ్యభాగము ఈ జ్యేష్ఠానక్షత్ర ప్రాంతముల గలదని నవీనవైజ్ఞానికులు తెలుపుచున్నారు. దీనికి వేదకాలమునుండి ప్రాముఖ్యము కలదని స్పష్టము.

## తెనుగువారి "పాలవెల్లి" ప్రాముఖ్యము

మన తెనుగుదేశములో ఆస్తికులైనవారి యిండ్లలో తూర్పుగదులలోనో, ఉత్తరపుగదులలోనో ఎత్తుగా తీనెలుకట్టి దేవుని పెట్టెలను, అమ్మవారి విగ్రహములను ఉంచి పూజచేయుట ఆచారమై యున్నది. ఈ తీనెలమీద ౧-౨మూళ్ల ఎత్తులో పాల వెల్లిని వ్రేలకట్టుదురు. వెదురుబద్దలతోగాని, మరొక కర్రబద్దలతోగాని ఒకచతురస్రమును తయారుచేయించి, లోపలి గళ్ల మూలలను పాదరసపు బుడ్లు వ్రేలగట్టుదురు. ఈ బద్దలకట్లేమి? ఈ పాదరసపు బుడ్లేమి? దేవుని తీనెపై గొడుగువలె వీనిని ఎందుకు కట్టవలెను? ఎప్పుడైన యోజించిచూచినారా?

మనదేవతలు నక్షత్రస్వరూపులు. నక్షత్రములపై గొడుగువలె పాలసముద్రదృశ్యము ఆకాశమున వ్యాపించియున్నది. పాలసముద్రములోను, ప్రక్కలను కూడా తేజోవంతమైన నక్షత్రము లున్నవి. ఈనక్షత్రముల చిహ్నములుగా జిగజిగమెఱయు పాదరసపుబుడ్లు గట్టి, లక్ష్మికిని, తదితర దేవతలకును పుట్టినిల్లు, నివాసస్థానము నైన క్షీరసాగరపుచిహ్నముగా పాలవెల్లిని దేవుని తీనెలపై మనవారు కట్టుకొనుచున్నారు. ఇట్లు అనాదికాలమునుండి మన దేశములో ఖగోళవేధ' నక్షత్రపరిశీలనము, నక్షత్రస్వరూపులై మెఱయు దేవతల ఆరాధనము మొదలగునవి ప్రబలియున్నవి.

## చుక్కమబ్బులు (Nebulae)
## సృష్టిక్రమము (Cosmic Evolution)

గ్రహములు, తోకచుక్కలు, ఉల్కలు, నక్షత్రములు, పాలవెల్లి అనునవేకాక ఆకాశరంగమున గంధపుబొట్లవంటి తెలతెల్లని మచ్చలు, నిడిచిన పత్తిబోజలవంటి పలచని రూపములు, ఉల్లిపాయ ళను, కందుంపలను స్ఫురింపచేయు దృశ్యములు, చిత్రవిచిత్రములైన ఆకారములతో అక్కడక్కడ కనబడుచుండును. ఇంగ్లీషువారు ఈ మబ్బులను 'Nebulae' అందురు. సృష్టిక్రమములో ఈచుక్కమబ్బులు మహాద్భుతమైన పాత్రధర్మము నిర్వహించుచున్నవని నవీనవైజ్ఞానికులమతము.*

---

*సర్ జేమ్సు జీన్సు: -'The Universe around us.' P. 245. "The normal mechanism by which the greater part of the Universe has been carved out, is the birth of successive generations of astronomical bodies through the action of 'gravitational instability.' The normal geneology runs somewhat as follows:—Chaos > Nebulae > Stars > Binarysystems > Sub systems."

మన వేదకాలమునాటి ఋషులకు సృష్టిక్రమములో ఈ చుక్కమబ్బు లున్నవని తెలుసునా? వారు వీటిని గమనించినారా? సృష్టిపరిణామనాటకములో ఇవి యే ముఖ్యపాత్రధర్మములను నిర్వహించుచున్నవో స్పష్టముగా ఎరుగుదురా? అను ప్రశ్నలకు ఋగ్వేదము ఏమి చెప్పుచున్నది, చూడండి:—

ఋగ్వేదము X. ౮౨-౭.—"అన్య ద్యుష్మాక మంతరం బభూవ నీహారేణ ప్రావృతా."

"మీ మధ్య మరొక విచిత్రదృశ్యము లేచి పొడ చూపుచున్నది. ఆ దృశ్యము తెల్లని పొగమంచుచే ఆవరింపబడినట్లు కనబడుచున్నది."

ఈ మంత్రములో "నీహార" శబ్దము చుక్కమబ్బులకు ఎంత ఒప్పియున్నదో ముఖ్యముగా గమనింపుడని పాఠకులను ప్రార్థించుచున్నాను. శీతకాలములో ఒక్కొక్కప్పుడు ఎదుట నేమున్నదో కనబడకుండ చేయునంత దట్టముగా తెల్లని పొగవంటి మంచు మనలను ఆవరించియుండుట మన అనుభవములోని విషయము. చుక్కమబ్బులను వర్ణించుటకు ఈ నీహారముకంటె మంచి మాట ఎక్కడ ఉన్నది?

ఈ తెలమబ్బు కాలక్రమమున అనేకములగు ఆకారములను పొందుచుండును. వీనిస్వరూపమును గూర్చి ఋగ్వేదములో ఈ మంత్రము ఉన్నది:—

"అన్యదన్య దసూర్యం వసానా నిమాయినో మామిరేరూప మస్మిన్" ఋగ్వేదము III-౩౮-౭.—

నిర్మాణదక్షులగు దేవతలు ఆకాశరంగమునం దొక క్రొత్త ద: మును తయారుచేసి దాని కొక వింత ఆకారమును ప్రసాదించిరి.

ఈ యాకారము లనేకవిధములుగా నుండునని పైని తెలిసికొంటిమి. అందొకటి పద్మాకారము. ఈ పద్మమునుండియే సృష్టికర్తయు, చతుర్ముఖుడు నైన బ్రహ్మ పుట్టెనని మనవా రందురు. ఈ పద్మాకారము గల చుక్కమబ్బునకు హెర్షెల్, రోస్, ప్లాస్కెట్ అనువారలు ఫొటోగ్రాపులు తీసిరి. ఇందు (౧) ౧౫౦ సంవత్సరముల క్రిందటిది. Herschel తీసినది. (౨) ౭౦ సంవత్సరముల క్రిందట Rosse తీసినది. (3) ౨౫ సంవత్సరముల క్రిందట Plaskett తీసినది.

ఈ చుక్కమబ్బు "భువననిర్మాణహేతువు" అని వేదకాలమునాడుకూడ మనవారు ఎరుగుదురు. చూ: ఋగ్వేదము X-౮౨-౬.

"అజస్య నాభావధ్యేకమర్పితమ్
యస్మిన్ విశ్వాని భువనాని తస్థు."

విశ్వములో గల సమస్తభువనములు ఎందులో ఉన్నవో! అదీ!



**తిరువాదిలో త్యాగయ్యగారి ఇల్లు**

(ఈ తిరుమాళిగయందే ఆ సంగీత సాహిత్య చక్రవర్తి తన జీవితమంతయు కాపురముండెను.)

# ఊరడింపు

## శ్రీ బెళ్లూరి శ్రీనివాసమూర్తి

తలలన్ వంచి కృశించిపోయిన ససుల్ తాపంబు నొందింప ను
జ్జ్వలగ్రీష్మాతపముం గనుంగొని నిరాశాభగ్నచిత్తంబునన్
కలఁతన్ బొందకు మోకృషీవల, లసత్కాదంబినీధ్యానమం
జులమై తోఁచు నభంబు, నీవు ప్రమదాశ్రుల్ రాల్తు వీలోపలన్.

కడచిపోయిన జీవితకాలమందు-ఎన్నిమారులు హృదయవిచ్ఛిన్నగతుల
గాఢనైరాశ్య మొదవెనో, కర్షకా స-హించుకొనలేదె, భావి నాశించి మరల!

ప్రకృతిన్ దివ్యరహస్యముల్ గలవు, భావాతీతముల్ కొన్ని, నేఁ
టికి దుస్సాధ్యము రేపు సాధ్యమగు నీ డెందంబులో హర్షవీ
చిక లుత్పన్నముగా, కృషిన్ మఱచి యీచింతాభరం బేల నీ
యకలంకంబగు నాత్మలోఁ గలదు దైవాంశంబె యూహింపుమా.

త్రోవల కంటకంబు లెటులో మొలకెత్తెను నీపొలాన, నీ
భావము నిబ్బరించుకొని భావిసుఖంబున, ముండ్ల నేరి యీ
త్రోవల కంచె వేయుము, తరుప్రచయంబుల నీడ నిద్రలో
నీవు గడింతు వేసుఖము నిర్మలముం బొనరింపు జీవికన్.

చాతకపక్షి నల్గడల శ్రావ్యనినాదము సల్పు నెంత సం
ప్రీతి వహింతువోయి యవనిం బడు చల్లని వానచిన్కులన్
కాతర మేల, ఏ మధురకాలమొ వేచెను నీకుఁగాఁగ శో
భాతిశయంబునం బెరుఁగు పైరులు మోదము గూర్చు నీమదిన్!

బెజవాడ వద్ద ప్రవహించుచున్న కృష్ణా తరంగిణి



# పుణ్యపుష్కరము

[ఏకాంక నాటిక]

= శ్రీ ముదిగొండ కోటయ్యశాస్త్రి అయ్యవారు =

తపోభూమి: పూర్వాహ్ణము: తుందిలశంకరులు

తుందిలుడు:—(కరములు మోడ్చి) నా జన్మము సార్థకమైనది ప్రభూ! ధన్యుడను. అనంతచిత్రమహిమాన్వితమగు నీ మూర్తిం నాకు దావొసగుము. అవిరళబ్రహ్మానందానుభవుడనై జన్మవారాశిని దరింతును.

శంకరుడు:— (సమందహాసముగ) తుందిలా! ఉగ్రతమమగు నీతపశ్శక్తియే నీకమృతత్వమును గల్పించినది. భవదీయసత్యసంకల్పబలాకర్షితుడనై ప్రసన్నుడనగు నేను నిన్ను బూర్ణమనోరథుగ ననుగ్రహింతును. నీవు బుష్కరనామకమై, నా యష్టమూర్తులలో నొకటియగు రూపము బ్రాప్తించెదివి.

తుందిలుడు:—(సభక్తికముగ) పితా! పురందరాదులకైన లభ్యముగాని నా యదృష్టము సిద్ధమైనది. కృతజ్ఞతాపూర్వక వందనముల గైసేయుము.

(బ్రహ్మ ప్రవేశించును)

బ్రహ్మ:—(స్వగతము) తుందిలా! నీ పూర్వపుణ్యఫల మెట్టిదో కదా? ఈశ్వర పదమా–పదమేమి? ఈశ్వరత్వము నందితివి. (ప్రకాశముగ) దేవాధీశా!

అపరిచ్ఛిన్నమయ్యు జీవకళ్యాణకార్య రూపమును ధరించిన నీకు నానమోవాకములు. తుందిలున కమోఘ వరదాన మొనర్చిన నీ సర్వశక్తిసంపన్నత భోళాశంక రత్వమును బరళ్ళతము జేసినది.

శంకరుడు:—పితామహా! తుందిలుడు మొక్క వోని పరిశుద్ధాంతఃకరణుడు. తపస్వి. పూతచరితుడు. పరమశాంతుడు. అనురూపగుణాన్వితుడగు నీతని కీవర దానము సార్థకము, సాల్పమును

బ్రహ్మ:—తుందిలుని చిత్తసంస్కృతి యుష్మ త్కటాక్షవీక్షణతరంగముల నుయ్యాలలూగి యత్యు చ్ఛ్రియమగు ధ్రువపదాలంకృత యయినది. మహదా శ్రయము గాదా?

శంకరుడు:—వర్తమానకథాంశమున కంతటికిని నీ యభ్యర్థనమే మూలము. నీ కొరకే నేడు తుందిలుడు బుష్కరు డయ్యెను. జగత్సృష్టికి సహాయముగ నీతని నీ కనుగ్రహించితిని.

బ్రహ్మ:—సఫలమనోరథుడ నైతిని.

తుందిలుడు:—సృష్టికర్తకు జలరూపమున నా యొనర్చు సహాయమున నెట్టి కొరంతయు సంభవింప కుండునటుల, మహేశ్వరా, అనుగ్రహింపుము. పితా మహాభగవానుడా! మత్సేవాపరత్వము నీ యెడ నకుంఠి తమును, గడుంగడు నాదరము గూర్చునదియు నగు గాక.

బ్రహ్మ:—తపస్వీ! తుందిలా!! అపరశివుడ వైన నీ సహాయోగమున నా కేకార్యమం దావంత యేని లోటు కలుగునా? బంగారమునకు బరిమళ మబ్బినది.

శివుడు:—తుందిలా! నీమనోభీష్టము లన్నియు సమకూరెడి. చతురాననా! తుందిలునకు బుష్కర రూపముతోబాటు సర్వతీర్థసామ్రాజ్యసార్వభౌమకిరీ టాధిపత్యము నొసగితిని. తీర్థరాజా! పుష్కరా! నేటినుండి సార్ధత్రికోటి తీర్థములును నీకనుసన్న మెలగును. నీ శుభోదయము సకలలోకనిత్యాభ్యు దయని:శ్రేయసస్నానమగును విధి ననుసరింపుము.

(అదర్శనము)

బ్రహ్మ:—తీర్థరాజా! పురస్థితసువర్ణకమండలు వున బ్రవేశింపుము. నీ వింటుండియే నా సృష్టికార్య ములకు సహాయుడ వగుము.

(బ్రహ్మ జలరూపతుందిలునితో సత్యలోకమునకు నిష్క్రమించును)

సత్యలోకము : సాయాహ్నము :

బ్రహ్మమందిరము

(బృహస్పతి - బ్రహ్మయును)

బృహస్పతి:— దేవా! ద్వాదశవర్ష క్షామము నీ వెరుగని దేమున్నది?

బ్రహ్మ:— దౌర్భాగ్యదేవతానిల యమువలె నున్న భూలోకమున కిక శాంతి యెక్కడిది?

బృహ:—లేదు. నిజముగా లేదు. నిత్యకర్మా నుష్ఠానమునకైన నీటిబొట్టు లేదు. క్షామడాంబరమారీ స్ఫోటకాదులు రాష్ట్రాధిపత్యపదప్రతిష్ఠితములయినవి.

బ్రహ్మ:—అధ్వరముల మాట యిక జెప్పవల సిన దేముండును?

బృహ:—అట్లగుచో యజ్ఞస్వాహాకారములు హాహాకారములుగ బరివర్తితమయిన వనిన జాలును.

బ్రహ్మ:— అనావృష్ట్యాదుల నిర్జీవములగు నదుల మాట యట్లుండగా జీవనదు లేల నిర్జలత్వాం తర్వాహినీత్వదశావిశేషితము లయ్యెనో?

బృహ:—కలికల్మషసంపర్కమున.

బ్రహ్మ:—జీవులను స్మరణమాత్రపవిత్రప్తపాపుల నొనర్పజాలిన నదీమతల్లికల పావిత్ర్యమో?

బృహ:—యాత్రికుల పాపఫలమున కమ్మడు వోయినది. నేడు తీర్థప్రభావము నిత్యకార్యశక్తిమై నిర్వీర్యమైనది.

(బ్రహ్మ ఆలోచించుచుండును)

బృహ:—విచారమగ్ను లయితి రేల ?

బ్రహ్మ:—మరేదియును గాదు. ధర్మగ్లానియు, సజ్జనహృదయక్షోభయు ననివార్యము లయ్యెగదా యని.

బృహ:—మహానుభావా! దిక్కును దరియు దోచక స్వసంరక్షణమునకును, ధర్మసంస్థాపనమునకును బీటువారిన హృదయములతో భగవదవతారావతరణమునకు సాధులోకము క్షణక్షణనిరీక్షణాయత్త మగుచున్నది.

బ్రహ్మ:— దేవాచార్యా! ప్రస్తుతకర్తవ్య మేమి ?

(ప్రవేశము భూదేవి : సశోకముగ)

భూదేవి:— లోకపితా! రక్షింపుము—రక్షింపుము.

బ్రహ్మ:—వసుంధరామాతా! ఊరడిల్లు మూరడిల్లుము.

బృహ:— ఊరడిల్లక చేయున దేమి ? పీతశ్యామలసస్యపటాలంకృతయై సుహాసినియు, సుమంగళియు, రత్నగర్భయు నగు భూమాత కీనాడు సర్వదిగంబరత్వము.

భూదేవి:—తండ్రీ, దారిద్ర్యరోగకష్టకిల్బిషసంభృతమగు జీవగణముల భరింపజాలను. కరుణామయా! నన్నుద్ధరింపుము.

బృహ:—లోకేశా! అఘటనఘటనాసమర్థుడవగు నీ యధీన మీసర్వము. నే నుత్తరకర్తవ్యమును మీకు విజ్ఞాపింపగల సమర్థుడను గాను. తీర్థరాజాగమనముచే లోకమున శాంతిసౌఖ్యములు పునఃప్రతిష్ఠితము లగును.

(ప్రవేశము తీర్థరాజు)

తీర్థరాజు:—నమస్తే-నమస్తే.

బ్రహ్మ:— తీర్థరాజా న శ్శభివాదనము, పుష్కరా! సకలకష్టసంక్షుభితమగు భూలోకము రక్షణమునకై త్రాహి త్రాహి యని నీ శుభాగమనమును గోరుచున్నది.

భూ:—దేవా! మ మ్మనుగ్రహింపుము. మా మనోరథము జెల్లింపుము. ఇప్పట్టున నీకంటె మ మ్ముద్ధరింపగల దాతయు, మరొక సాధనమును లేదు.

బృహ:— శివరూపుడవగు నీ మహత్తత్త్వము సకలలోకమంగళక్షేమశాంతిలక్షణముల కాధారము. నీయనుగ్రహమే నేడు నిష్ఠురాతపదందహ్యమానకుసుమమయకోమలకాంతారమ్లానజీవనమున —కమృతాంబుసేచనము.

పు:—పితామహా! నిన్ను      నే నెట్లుండగలను ?

బ్రహ్మ:— లోకకళ్యాణమున కియ్యది నీకు దప్పనిసరి.

పు:— దేవా! నీ వేమైన జెప్పుము. ఈ సందేశశ్రవణమున హృదయాకుల మినుమడించుచున్నది. వీడజాలను. నిన్ను వీడియుండజాలను.

బృహ:—ఆర్యా, మా కిక దిక్కు లేదు. ఇందులకు నీ వంగీకరింపనిచో లోక మింక సంపూర్ణప్రళయాగ్ని కింధనము గాకుండదు.

భూ:— మహాశయా! సజ్జనసర్వస్వ ము లు బరప్రయోజనాత్మకములు. మై, ణ్ణమైన జీవపరిణామసమస్య నీ పరిష్కారమున సార్థవంతమైన గౌరవమునొందవలయును.

బ్రహ్మ:—పుష్కరా! సంశయింపకుము.

తీర్థ:— లోకేశా! క్షణమేని నీ సాహచర్యమునుండి విముక్తిని వాంఛింపనైన వాంఛింపని నాకు లోకసంచారమునకు నీ సడలింపరాని కఠిననిర్ణయమా ? క్షమింపుము. నీ సంకల్ప మనిర్వచనీయము. నీ కటాక్షముననే లోకము లనుగ్రహింపబడగలవు.

బ్రహ్మ:—తీర్థరాజా! సమాహితచిత్తుడవగుము. బృహస్పతి ద్వాదశరాసుల ప్రవేశించునప్పుడును, వదలునప్పుడును పండ్రెండుపండ్రెండు దిన

షులు నిత్యము మాధ్యాహ్నికమున రెండు ఘడియల కాలము బృహస్పతిద్వితీయుడవై గంగా పుణ్యనదుల చేరియుందువు. నీ సంయోగమున జలపూర్ణములు, పవిత్రతరములు నై నదులు పుష్కరసంజ్ఞ నలరారును. నే నొక్కడనే గాక సర్వదేవతానీకములతో ముప్పది మూర్తులను సకలసౌభాగ్యదాతవు, నదీసంగమమునకు నిన్ను సమయమున గలిసికొని నీకును, నీ తీర్థికకోటికి ంతిశుభఫలముల ప్రసాదింతును.

తీర్థ:— చిత్తము. భవదీయానుమతము నను సరింతును.

భూ:—మా కష్టములు గట్టెక్కినవి.

బృహ:— పాపాంధకారమున బుణ్యభానూదయమైనది

బ్రహ్మ:—మీ కెల్లరకు శుభసుఖము లమరుగాత. ఎల్లెడల శాంత్యాకీర్ణమై కళ్యాణమయమై జగము వెలుగొందుగాక.

(నిష్క్రమణము)

## 3

భూలోకము : మధ్యాహ్నము

గంగాప్రదేశము :

(తీర్థరాజు-బృహస్పతియును)

గంగ:—(సంభ్రమముగ) దేవాచార్యద్వితీయుడగు పుణ్యపుష్కరతీర్థసార్వభౌమునకు స్వాగతము-సుస్వాగతము.

తీర్థ:—కళ్యాణీ! శుభదాయినివి గమ్మ.

బృహ:—భగవతీ! శివరూపమును ధరించి నేడు ప్రక్షాళితపాపవైతివి. స్వచ్ఛస్ఫటికసంకాశజలపూర్ణవైన నీయునికి దగ్గరునకు జెన్నిధిచందమున లోకదృష్టికి గోచరమైనది.

గంగ:—వనలక్ష్మి చైత్రాగమ వైభవోపేతయయినది కాదా?

బృహ:—తీర్థరాజా! నీ సంయోగమున గంగాదేవి భుక్తిముక్తిప్రదాయినియై యాశ్రితగణముల నలరించునదివలె నున్నది.

(బ్రహ్మాద్యమరుల ప్రవేశము)

జయము-జయము - తీర్థరాజా! జయము-జయము.

బ్రహ్మ:—పుష్కరపాదాంకితమయిన గంగాతటము లోకసుస్థిరస్థితి కంకురారోపణ మొనర్చి నూత్నవికాసమయ మయినది.

తీర్థ:—విధాతృమహాశయా! కళ్యాణము-ప్రళయము లను నివి నీ స్వాధీనములు. భవత్సంకల్ప తోరణబంధనమే నా యీ యుద్యమారంభమునకు ప్రథమాధ్యాయము.

బృహస్పతి:—తీర్థరాజా! చక్కగా జెప్పితివి. పితామహానుగ్రహమున నీ జగ ముద్ధరింపబడినది. ప్రజానీకము స్వధర్మపరాయణాయత్త మైనది. ఎల్లెడల నానందజ్యోత్స్నలు పరుగులిడుచున్నవి.

బ్రహ్మ:—తీర్థరాజా! అదిగో భవదాగమన వార్తాశ్రవణమున బుష్టియు, దుష్టియు ఘటింప తీర్థము లన్నియు గంగాగర్భమునబడి నీదెస కేతెంచుచున్నవి. పాలకపాలితాదర్శ మిట్లుండవలయునుగదా.

బృహ:—చకోరాహ్లాదమునకు జంద్రుడే గాక మరెవ్వరు?

తీర్థములు:—రాజా పుష్కరా! నిన్ను జూచినంతనే మా కొరతలెల్ల బటాపంచలైనవి. జీర్ణకాయులమై నామమాత్రావశేషముగ జీవితముల గడపు మాకెల్లరకు నీ ప్రవేశమున తేజోబలసంపన్నత సంఘటితమైనది. నిమిషమేని నీ వియోగమును సహింపజాలని మా కేదదారి?

తీర్థ:— తీర్థాధిదేవతలారా! ఆచార్యునితో నేయేనదీస్థుడనై యున్న నట మీ కెల్లరకు నా సాన్నిధ్యము లభించున ట్లనుగ్రహించితిని. పావనతరములగు మీ శుభగీతములు మంగళశబ్దముల నెల్లయెడల గీర్తింపబడుగావుత.

తీర్థములు:— తండ్రీ చతురాననా! సురాచార్యా! మీ యవ్యాజకృపారసమున నిరాశా భూయిష్ఠములగు మా జీవనములకు జిరస్థాయిత్వము సంభవమైనది. మీ ఋణమును మే మెట్లు చెల్లించుకొందుమో!

బ్రహ్మ:—తీర్థములారా! మీ సద్యోగబల మీ స్థితికి గారణము. మీ కెల్లరకు గంగాదికములగు పండ్రెండు నదులతోడను ఘనిష్ఠసంబంధావకాశముల గల్పింతును.

తీర్థములు:- -అనుగ్రహింపబడితిమి.

బృహ:—తీర్థదేవతలారా! పుష్కరతీర్థ రాజును గూడి నేను మేషరాశియందు గంగతోడను, వృషభరాశియందు నర్మదతోడను, మిథునమున సరస్వతితోడను, కర్కాటకమున యమునతోడను, సింహరాశియందు గౌతమితోడను, కన్యారాశియందు కృష్ణానదితోడను, తులయందు గావేరితోను, వృశ్చికమున తామ్రపర్ణితోడను, ధనూరాశియందు సింధుతోడను, మకరమున తుంగభద్రానదితోను, కుంభమున మలాపహారిణితోడను, మీనమున ప్రణీతానదితోడను గలిసియుండును. ఇద్దాన నిమ్మహానదీసంబంధముగ మీ కెల్లరకు తీర్థరాజుతో నిత్యసంబంధము సంభావితమగును.

బ్రహ్మ:—సురాచార్యా! మణివలయసంబంధమువోలె బుష్కరునితో నీకును, నీతో బుష్కరునకు ననూనకీర్తివైభవములు ప్రాపించినవి.

తీర్థములు:— జగత్కథయం దిది యానందకాండము తండ్రీ!
త్వత్పాదారవిందభజనానందులమై మనునట్లు మమ్మను గ్రహింపుము.

బ్రహ్మ:—నదీమాతృకలారా! మీమీ వాహినీతటముల ద్రిమూర్తులము స్వయంప్రతిష్ఠితులమై మీకును, తీర్థికబృందమునకును మనోభీష్టము లొనగూర్తుము. మానివాసములు సర్వప్రసిద్ధములై వైరాజ-నారసింహ-శ్రీశైలాదిక్షేత్రనామకములగును. మామా నామాంకితములై మీ యెల్లతీర్థములు రుద్రతీర్థ - విష్ణుతీర్థ, బ్రహ్మతీర్థములాదిగా ప్రశంసింపబడి భక్తకల్పద్రుమములై విలసిల్లును. పుష్కరా! నీసుభాగమసమయమునం దెవరు పవిత్రనదీస్నానంబు సేచనపానములొనర్చి శ్రద్ధాన్వితులై నియతిమెయి సురాచార్యుని - నన్ను - ఆత్మీయపితృగణములను - నిన్ను బూజించుచున్నారో విగతకల్మషులగు వారెల్లరు ముక్తి నయితే మనాయాసముగ నొందుచున్నారు. అత్యంతస్వల్పములయ్యు దత్తదాచరితములగు దానజపాదిసుకర్మము లనంతఫలదాయకములగును. సాధకగణములకు సకలసౌభాగ్యములు సిద్ధించును.

అందరు:—మహాప్రసాదము.

(నిష్క్రమణము)

## ౪

## కృష్ణాపుష్కరము : ప్రాతఃకాలము : భక్తబృందము.

ఒక భక్తుడు:—భక్తవరులారా! మోదప్రదమగు నదీపుష్కరము శుభాభ్యుదయహస్తముల జాచి మన జీవితముల సార్థవంతముగ జేయ నాహ్వానించుచున్నది. భావనాశుద్ధియే నదీమాతృపదములకు మన మర్పింపవలసిన యుపాయనము. కోటిజన్మార్జితపుణ్యవిశేషమునగాని సమకూడని మహదైశ్వర్యప్రాప్తి యామెయద్వితీయానుగ్రహాధీనము. కర్మభూమియగు భారతము పుష్కరనదీమతల్లికల నిత్యకళ్యాణము పచ్చతోరణమై అలరారినది. సకలకళాక్షేత్రమై విశ్వవిజ్ఞానమున కాటపట్టయినది. సస్యశ్యామలమై యన్నపూర్ణమందిర మను ఖ్యాతికి బాత్రమైనది. అవర్ణనీయమహామహిమామహితమగు నదీపుష్కరస్నానమాత్రముననే మానవుల మనోవాక్కాయకర్మములు బరిశుద్ధము లగుచున్నవి. పుష్కరాత్మకనదీజలముల జన్మరోగము సయితము నిర్మూలింపగల మహత్తరపవిత్రత సహజప్రతిష్ఠితమైనది. మూఢమానసము విజ్ఞానదీపదీపితమగునట్లొనర్చుటయు, విజ్ఞానజ్యోతికి స్థిరత్వము ననువదించుటయు నను గుణములు రెండును పుష్కరనదీజలప్రభావలేశములు. తత్కథాశ్రవణమున స్నానాసక్తి

యు, దాన జిత్తశుద్ధియు, నంత శ్రద్ధయు, నద్దాన గర్మానుష్ఠానమును, ననంతరము జ్ఞానోపలబ్ధియు, దాన సిద్ధియు సిద్ధింపజేయగల నదీపుష్కరమాహాత్మ్యమును శేషాదులైన వర్ణింపగలరా యని పురాణములు శంకించినవి. కవుల కావ్యగీతికలందును, వైదికుల వేదసూత్రములందును, గాయకుల భావగేయములందును, భక్తుల హృదయసంకల్పకోరటములను బుష్కరవైభవము జిరస్థాపిత మయియున్నది. రండు, రండు. పావననదీజలముల సుస్నాతులు కండు; కలికల్మషమునకు దూరులు గండు. నేడు సకలహృదయముల బుష్కరనదీమూర్తియే యఖండతాండవధురీణయైయున్నది. మీ హృదయకవాటముల దెరచి నదీమాతృపాదారవింద సేవకులు గండు. ఆమెనామకీర్తనము భుక్తిముక్తుల కిరవైనది. స్థిరమతులై యిట్టి పుణ్యకాలావసరమున స్వధర్మానుష్ఠానదీక్షితులు గండు. స్వదేశజాతిమత సంఘాభిమానమునకును, బరోపకారచింతనమునకును విశ్వమానవసౌభ్రాతృత్వభావనకును, ధర్మరక్షణపరత్వమునకును మీ పవిత్రహృదయముల స్థానమొసగుడు. ఇష్టదేవపితృారాధనశిష్టపూజనముల ప్రమత్తులు గాకుడు. సహృదయాకములగు దానధర్మము లీ సమయమున కోటిగుణితములై యక్షయఫలప్రాప్తి నొనగూర్చును. ఆర్యులారా! వేదధర్మముల నుద్ధరింపుడు. దాతలారా! బీదల గనికరింపుడు. గురుకులముల నుద్ధరింపుడు. విద్యాపీఠముల బ్రోత్సహింపుడు. ధర్మవైద్యాలయముల నెలకొల్పుడు. సోదర సోదరీమణులారా! ఆర్యధర్మమును సకలకళావిలసితముగ నొనర్చి భారతీయార్యగౌరవసంస్కృతికి వన్నెబెట్టుడు. అమోఘవరదాయినియగు మాతాశీర్వచనపాత్రులు గండు. జై కృష్ణామాయీకి జై.

భక్తులు:—(చేతులెత్తి)

శుద్ధస్ఫటికసంకాశాం ద్విభుజాం పద్మధారిణీం
శివమూర్తిధరాం దేవీం కృష్ణవేణీం నమామ్యహం;
పవిత్రాత్యంతనైర్మల్యమహాపుణ్యాంబువాహినీం
త్రైలోక్యపావనీం దేవీం కృష్ణవేణీం నమామ్యహం.

తీర్థరాజు:—

స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం
న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః
గోబ్రాహ్మణేభ్య శ్శుభమస్తు నిత్యం
లోకా స్సమస్తా స్సుఖినో భవంతు.






# కొన్ని అపూర్వమైన "హెచ్. ఎం. వి." రికార్డులు

మాస్టర్. ఎస్. రాజేశ్వర రావు

**N. 18765**

{ చల్లగాలిలో
{ కలగంటి

మాస్టర్ రాజేశ్వరరావు &
శ్రీమతి బాలసరస్వతి

**N. 18758**

{ తుమ్మెదా
{ కోపమేల

శ్రీమతి బి. రాజరత్నం &
శ్రీ పి. సూరిబాబు

**N. 18742**

{ నందకిశోర
{ రామనామ భజన

మాస్టర్ వి. జే. వర్మ &
శ్రీమతి బి. రాజరత్నం

**N. 18747**

{ వొచ్చే అలలు
{ ఊగవోయీ

శ్రీమతి బి. రాజరత్నం

**N. 18745**

{ ఘల్ ఘల్లన రా
{ హోయి హోయి

"హెచ్. ఎం. వి." గ్రామఫోన్ వ్యాపారులందరియొద్ద రికార్డులు దొరుకును.



## "హిస్ మాస్టర్స్ వాయ్స్" రికార్డులు

## ది గ్రామఫోన్ కంపెని లిమిటెడ్, మద్రాసు.

# గ్రహముల వేధ ఫలించుపద్ధ

శ్రీ ౧ ౧ లు

దాదాపు ఆరుసంవత్సరముల మాట. జూన్ నెల 30-వ తేదీనాఁ డుదయమున నేను నాగదిలో కూర్చుండి ఏదో చదువుకొనుచుంటిని. ఉద్యోగ వశమున గ్రామాంతరమున నే నపు డుండుట. ఆప్త బంధు వే కాక, ఆబాల్యమిత్రుఁ డగు నొక సాధు శీలుని యింటి చేరువ నివసించుచుంటిని. అతని పుత్రిక నా గదిలోనికి వచ్చి ఖిన్న వదనముతో—

"మామా! సేవకుని పంపుదురా? వైద్యశాలకు పోయిరావలెను." అనియెను.

"అవశ్యముగ పంపుదును." అని ప్రతియిచ్చి కారణ మేమని యడిగితిని. ఆ చిన్నది తన కుడిరెట్టను చూపినది. అచట మధ్యభాగమున అరచేతి వెడల్పున కుంకుమపూత పూసిన రీతిగ చర్మ మెఱ్ఱవారి మిణమిణ మించుచుండినది. గాయము కాని, కురుపుకాని కానరాలేదు. కొంత వాపుండినది.

"ఇదేమో తెలియదు. చాలా నొప్పి. ఆస్పత్రికి పోయి మందు వేయించుకొంటాను." అని ఆ అమ్మాయి చెప్పినది.

"పోదువుకాని, నీజాతకకుండలి నొకమారు తీసుకొనిరా." అంటిని. ఆమె వెళ్లి పోయినది.

ఈ అమ్మాయి కథ చాల దయనీయమైనది. మూఁడేండ్లు నిండీనిండక మునుపే మాతృదేవతను గోలుపోయి, పదుమూఁడేండ్ల వయసు వచ్చీ రాకయే వివాహపు ముచ్చటలతోఁ గూడ ఐదువతనపు సౌభాగ్య మడుగంటిన శోచనీయచరిత్ర యీ చిన్నది. ఏదైనా బ్రతుకు తెరవు కల్పింపనెంచి పెద్ద లామెకు చెన్నపురిలో నాంగ్లభాష నభ్యసించుటకు సౌకర్యము లొనగూర్చిరి. మహిళావిద్యాలయములో నాంగ్లవిద్య నభ్యసించి బోధనాభ్యసన పాఠశాలలో పరీక్షలో నెగ్గి ఉపాధ్యాయావృత్తి కర్హత నార్జించి విద్య చాలించుకొని నెలదినముల క్రిందనే ఆమె యింటికి వచ్చియుండినది. అప్పటినుండి ఏ మ్యునిసిపాలిటీకో, ఏ జిల్లాబోర్డుకో, ఏ విద్యాశాఖాధికారిణులకో విన్నపములు వ్రాసుకొనుచు ఉద్యోగవరప్రసాదమును నిరీక్షించుచు నామె కాచియుండెను. జ్యోతిషవిద్య నభ్యసింపుమని నే నపుడపు డాచిన్నదాని కుపదేశించుచుంటిని. కాని, అది యొకవిద్య యనికాని, ఉపయోగకారి యనికాని ఆమెకు తోఁచినది కాదు. ఏ ప్రాథమిక పాఠశాలలోనో, ఏ పాతికె రూపాయల వేతనమునకో పనిచేయుటకన్న ఈవిద్య నభ్యసించినచో గౌరవముగా జీవించుచు సంఘసేవ చేయవచ్చునని నే నెంత బోధించినా ఫల మంతగా కానరాలేదు. ఉపజ్ఞ కల నిశితమైన బుద్ధి, యుక్తియుక్తమై పటువైన వాగ్ధోరణి, జాగరూకతతోఁగూడిన వివేకము, జంకులేని స్వాతంత్ర్యప్రీతి సత్యముపై సడలని యభిమానము— ఈ గుణములు కానవచ్చుటచే, ఈ చిన్నది జాతకశాస్త్ర మభ్యసించినచో ఉపాధ్యాయురాలుగా నుండి సంపాదించు గౌరవముకంటె పదిరెట్లు హెచ్చుగా గౌరవము నార్జించఁగలదని నా యూహ. నానిర్బంధమునకు, నాయందుఁ గల గౌరవభావమునకు ఫలముగా నా చిన్నది కొన్ని దినములలో సాయనగ్రహ స్ఫుటము చేయుట, లగ్నముకట్టుట, భావకుండలి వేయుట, దినవర్ష దశాపద్ధతి సాధించుట ఇత్యాదులను నేర్చుకొన్నది. కాని శాస్త్రముపై విశ్వాసము, అభిమానము కల్గుట కింకను చాలకాలము పట్టును. శాస్త్రాభ్యాస విషయమున మంత్రములతో మామిడికాయల్లు రాలవు.

కొన్ని నిమిషములలో నాచిన్నది తన సాయన జాతకకుండలిని తీసుకొనివచ్చినది. ఇదే ఆకుండలి:—

| | | | |
|---|---|---|---|
| గు 26-30<br>I 25-36<br>శు 7-33 | | | |
| బు 21-37<br>వ 15-7<br>రా 8-30<br>ర 4-53 | సాయన గ్రహ భావ<br>కుండలి | | శ 11-20 |
| | | | ఇ 1-10<br>కే 8-30<br>కు 25-37 |
| X 26-44 | | చ 11-53 | |

ప్రశంసావిషయ మారోగ్యమగుటచే షష్ఠస్థానమును గమనింపవలసియున్నది. అరింట కుజుఁడున్నాఁడు. రక్తప్రకోపము, తీవ్రజ్వరాదులు, వ్రణబాధ, ఉష్ణాధిక్యము ఇత్యాదులు దీని సామాన్య ఫలములు. కుజుఁ డుండునది సింహరాశి యగుటచే గుండెదడ కానరావచ్చును. కుంభరాశియందున్న బుధునితో నీ కుజుఁడు సమసప్తక వేధ నందుటచే నరముల యాతన, భావోద్రేకము తెచ్చి యీవచ్చును. కాని, ఇవన్నియు జన్మకాలిక గ్రహస్థితులు.

"దినవర్ష పద్ధతిలో నిప్పటి కేమి విశేషము లున్నవి?" అని యడిగితిని.

"కుజవరుణులు చలనవశమున పరస్పరసమసప్తక వేధకు వచ్చినారు. చలితచంద్రుఁ డీనెలకు జన్మ బుధుని కెదురుగా నడచుచు షష్ఠభావములో నున్నాఁడు" అని ఆచిన్నది ప్రతియిచ్చినది.

"సరే! రక్తోద్రేకముతో కూడిన నరముల బాధ కదా యిప్పు డనారోగ్యమును సూచించవలయును?"

"అందుకే ఆస్పత్రి యాత్ర."

"కావచ్చును. కాని, యిది యేదినమున నారంభమైనదో, ఆదినమున విద్ధగ్రహముల చారములో నీజాతకముతో అతకఁగల విశేషము లేమైననున్నవా?"

"నిన్ననే కొంచెముగ నారంభమైనది. నేఁటి కింత యధికము."

అని ప్రతియిచ్చి కొన్ని నిమిషములు దైనిక గ్రహములను జాతకగ్రహములతో పోల్చిచూచి, ఆ చిన్నది "గడచిన 23-వ తేదీన కుజుఁడు కుంభరాశిలో 4°-42′ లో స్తబ్ధుఁడై వక్రించినాఁడు. అనఁగా, నా జన్మకాలికరవిస్థానములో నన్నమాట. నిన్ననే బుధుఁడు సింహప్రవేశము చేసినాఁడు. మ రేమీ విశేషములు లేవు." అనియెను.

ఆరోగ్యదాత యగు రవి ఈజాతకమున రోగస్థానాధిపతి. అట్టి రవిస్థానమందే కుజుఁడు వక్రించుట. ఈ కుజునికి జాతకమున రోగస్థానాధిపత్యమున్నది. ఆరోగ్యభంగము, రక్తప్రకోపము ఇవి సూచించఁబడుచున్నవి. జన్మకాలమున కుజునితో సమసప్తక ద్వేషదృష్టిలోనున్న బుధుఁ డీసమయముననే తాత్కాలిక కుజజన్మరవిసంయోగ బిందువునకు సమసప్తకస్థానమునకు రానారంభించినాఁడు. కావున, నరముల సలుపుతోడి రక్తప్రకోపమువలని యనారోగ్యము కానవచ్చినది. వైద్యులు దీని కేమి ప్రత్యేక నామము వాడినా, విషయ మింతే.

ఈయంశముల నాలకించి, "సేవకుని పంపండి. నే నాస్పత్రికి పోయివత్తును." అని యా చిన్నది ఆత్రమును కనుపరచినది. ఆమెకు కల్గిన భయ మామెముఖభావము దాఁచినదికాదు. పాపము!

"అట్లే పోదువుకాని, ఒక్కమాట. కుజుని సమసప్తకవేధ నభిలషించు బుధుఁడు నిన్ననేకదా సింహప్రవేశము చేయుట? అప్పుడే నీకు బాధ యారంభమైనది. ఆ గ్రహముల సమసప్తకవేధ పూర్తి అయినదా?"

మరల పంచాంగమును త్రిప్పిచూచి చకితురాలై ఆచిన్నది—

# గ్రహముల వేధ ఫలించుపద్ధతి

"రాఁబోవు 3-వ తేదీన వేధ పూర్తిగా నుండును. నాఁడే చంద్రుఁడుసయితము వేధాస్థానమును పొందఁ గలఁడు. అనఁగా, మూఁడుదినములు నాకీబాధ ఉండుననియా" అని ప్రశ్నించెను.

"కాదు. వేధ పూర్తి అయిన దినమున బాధ అధిక మగును. ఆరంభమునుండి వేధాస్థాన మెంతదూర మో అంతదూరము విద్ధగ్రహము దాఁటిపోయినపుడు బాధ నిమ్మళించఁగలదు. కారణ మున్నప్పుడు కార్య ముండును. కారణము నశించఁగా కార్యముసహితము నశించును" అని ప్రతిచెప్పితిని.

పంచాంగమును మరల త్రిప్పిచూపి యాముగ్ధ "అయ్యో! ఇంకా ఏఁడుదినములా?" అని కన్నుల నీరునించెను.

వేధాస్థానమునకు నాల్గుభాగల సమీపమునకు బుధుఁడు వచ్చినపు డారంభమైన యనారోగ్యము అవలిపైపున నాల్గుభాగల దూరము బుధుఁడు దాఁటి పోయినపుడుకదా నిమ్మళించవలసి యుండును? ఈ నడుమ జులైనెల 3-వ తేదీననే వేధ పరిపూర్ణతనందఁ గలదు. ఆనాఁడే చారవశమున రవి కటకరాశిలో 10-వ భాగకు—అనఁగా, జన్మ శనిస్థానమునకు—రాఁగలఁడు. జన్మకాలమున శనిచంద్రులకు కేంద్రవేధ యుండుటచే నిది యొక క్లిష్టదినము.

"ఐతే, ఆస్పత్రికి పోవద్దనియా?" అని యామె ప్రశ్నించెను.

"మహారాజుగా పొమ్ము: కాని, వారము దినములైనా పోవలసియుండు నని నాసలహా. ఆలోఁగా ఏడాక్టరయినా నీబాధను మాన్పలేఁడు. నీ కాక్షేపణ లేనిచో, నేను మంత్రింతును. వారము దినములు మంత్రించినచో చాలును." అంటిని.

ఆ చిన్నది నవ్వి, "అంతేనా ప్రయోజనము? చికిత్స చేయనిచో చేతి కపాయము కలిగితే నాగతి యేమి?" అనెను.

"అమ్మాయీ, శాస్త్రమును నేర్చుకొను చున్నావు. నీజీవితములో గ్రహముల చారమువలని ఫలమును నీ వర్థము చేసుకొనఁగల్గి ననే తప్ప, ఇతరుల జీవితములలో గ్రహముల కార్యము నూహింపఁజాలవు. ప్రకృతపు వేధాస్థానమునకు మేషరాశి 5-వ భాగలో నున్న చలితశుక్రునినుండి శుభదృష్టి కలదు. కావున భయపడ నక్కర యుండదు. నిస్సంశయముగా నియమితకాలమున నీ యనారోగ్యము శాంతించఁగలదు. ఏదినమున బుధుఁడు వేధాస్థానమును దాఁటిపోవునో, నాఁటి రాత్రినుండి—అనఁగా మూఁడవ తేదీనుండి—బాధ తగ్గుచురాఁగలదు. చేయి పూర్వస్థితికి వచ్చుటకు తరువాత మూఁడుదినములు పట్టును. ఇందుమీఁద నీ ధైర్యము."

క్షణకాల మెగాదిగ నన్ను చూచుచు, వచ్చి రాని నమ్మకముతో, పోయీ పోని భయముతో ఆ చిన్నది "నేను మందుకు వెళ్లను లేండి. కాని, నా చేతికి మీరే జవాబుదారీ."

అని బెదరించుచు తన యింటికి వెళ్లినది.

అనుకొన్నట్లు, మరుదిన మనారోగ్య మధిక మైనది. మోచేతిదాఁక రెట్ట వాచి ఎఱ్ఱవారినది. ఆ మరుదినము ముంజేతికి సయిత మావన్నె వ్యాపించినది. ఆహారనిద్రలు లేకపోయినవి. ఆ చిన్నదాని తండ్రి భయపడి నాసలహా నడిగినాఁడు. నా యభిప్రాయము నతనికి తెలిపితిని. నాపయిఁ గల విశ్వాసముతో నతఁడు చికిత్సాప్రసక్తికి పోలేదు. మూఁడవతేదీ ఉదయమున కామెచేయి ఆమూలాగ్రముగ రక్తనిక్త మైనది పోక, ఇంద్రగోపపు వర్ణముతో నిగనిగలాడుచుండినది. చేయి కదలించుటకు వీలుకాక పాప మాచిన్నది మంచముపట్టియుండెను. నేనొకమా రామెను చూడఁగా, కన్నులనిండ నీరునించి పులుకు పులుకుమని నన్ను చూచుచు నాముద్దరాలు, "నా గతియేమి మామా?" అని వాపోయెను. నేను కొన్ని సాంత్వనవాక్కు లాడి యామెదుఃఖము నపనయించి తిని. ఆమరుదినము వ్రేళ్లపై నున్న రక్తవర్ణము తగ్గి నది. సలుపులు కొంత నిమ్మళించినవి. రాత్రి కంటికి కొంత నిద్ర అంటినది. జులై 7-వ తేదీనాఁటికి క్రమ క్రమముగ నాచిన్నదాని భుజము యథాపూర్వస్థితికి

వచ్చెను. ఆ రక్తవర్ణ మేల వచ్చెనో, ఏల తనంత మాయమయ్యెనో, ఆ వాపునకు కారణమేమో, మందుమాకులు లేకయే ఇవన్నియు నెట్లు పోయినవో, అందరు నాశ్చర్యపడినారు. అనారోగ్యవిషయమున ఇంద్రుని చెవాట మున్నచో, దాని కారణము దురూహ్యముగ నుండునని పాశ్చాత్యులమతము. ప్రశంసావిషయమున బుధుఁడు సింహప్రవేశము చేయఁగనే జాతకురాలి జన్మకాలమందలి ఇంద్రగ్రహస్థానముపై కాలూఁదియే ముందుకు నడువవలసియున్నది. ఆకారణమున బుధుని పనులలో ఇంద్రుని మాయ కొంత వ్యాప్తిలో నుండఁగలదు. ఇంద్రజాలమున వస్తువు లెట్లు వచ్చునో, అట్లే అంతర్ధానము కాఁగలవు కదా ?

ఆరోగ్యము వచ్చినతరువాత నే నాచిన్నదానిని జూచి, "ఏమమ్మా ! నాపూచీ తీరినదా ?" అంటిని.

మనస్సంకోచనము, కృతజ్ఞత చూడ్కులలో వెల్లివిరియుచుండఁగా నామానిని, "నేను జ్యోతిషమును నేర్చుకొందును."అనెను.

ఉద్యోగమునకై ప్రాకులాడుచుండఁగనే ఆమెకొక సంవత్సరము గడచినది. శనిరాజ్యమున ఆత్రముగా పనులు జరుగవు. తరువాత హంగామీగా అపుడపు డేవో పనులు దొరకుట, నెల కొకగ్రామమునకు బదలాయింపు వచ్చుట, ఉద్యోగవిరామము రాఁగా మరల క్రొత్తపనికై తారాడుట-ఈఅవస్థలలో మూఁడునాల్గుసంవత్సరములు గడచినవి. తరువాత నొక్కసారి నే నాజాతకురాలిని చూడఁగల్గినపుడు జాతకముల మాట ప్రస్తాపమునకురాఁగా—

"నాజాతక మేమనుచున్నది? నాగతి యింతేనా ?"అని యామె అడిగెను.

ఏమియు తెలియని చిన్నతనమున బొమ్మపెండ్లివంటి వివాహము తన కొకటి ముడిపెచి ఆ జన్మాంతము తన్ను సుఖదూరను కావించినారు పెద్దలని అపుడపుడు దుఃఖించుట ఆ చిన్నదాని యలవాటు. వయస్సు, విజ్ఞానము, లోకానుభవము వచ్చినకొలఁది ఆమెమనోయాతన అధికమగుచువచ్చినది. ఆ దుఃఖమును అస్వాభావిక మనఁజాలముగదా ?

"నాకుఁ దోఁచిన యంశముల వివరింతును. నీవే నిర్ధరించుకోవచ్చును." అంటిని.

జాతకమున బుధుఁడు చతుర్థసప్తమాధిపతి. వ్యయభావమం దుండుటచే ఈగ్రహమునకు బలము తక్కువ. పైఁగా, ప్రబలుఁడగు వక్రకుజునినుండి సమసప్తక వేధ యీబుధున కున్నది. చతుర్థసప్తమ భావములలో గ్రహము లెవ్వరును లేరు. అగుటచే, ఈరెండు భావములు బలహీనము లగుట తప్పదు. మూఁడేండ్ల వయస్సునందే మాతృక్లేశము సంభవించి చతుర్థ(మాతృ)స్థానదౌర్బల్యము బాగుగా చూపినది. ఇఁక, సప్తమభావము తన యోగ్యతను ప్రదర్శించవలసియుండినది. స్త్రీజాతకమున రవి భర్తను సూచించువాఁడు. ఇట్టి రవి లాభస్థానమునం దున్నాఁడు కాని, ఇంద్రగ్రహమునుండి ప్రబలసమసప్తకదృష్టికి లోనయి ఆశాభంగమును సూచించఁగలఁడు. శనిచంద్రుల స్థితిని గమనించినచో గుండియ లవిసిపోఁగలవు. చంద్రునికి శనినుండి పరిపూర్ణకేంద్రవేధ ! స్త్రీజాతకమున నీయోగ మున్నచో, వయస్సు చెల్లిన భర్తను కట్టుకొనుటచే కలుగు మనస్సంకోచనమో, మాతాపితరుల నిర్బంధమువలననో, లోభ్యమువలననో సిద్ధించిన అతృప్తికరమయిన ప్రేమశూన్యహేయదాంపత్యజీవితమో కలుగునని పాశ్చాత్యహోరాతంత్రవేత్తలు వక్కాణించిరి. బ్రహ్మచారిణీత్వమునకే తగిన యోగమిది. ఎట్లయిననేమి, యుక్తవయస్సున దాంపత్యజీవితసుఖ మనుభవమునకు రానీయని దీయోగము. ఇట్టి చంద్రుఁ డుండుట అష్టమస్థానమున. ఇది ప్రబలబాలారిష్టయోగమే కాని, లగ్నమం దుదయించుచున్న మహాబలశాలి యగు బృహస్పతి అరిష్టము తొలఁగించి కాపాడినాఁడు. లగ్నసప్తమభావములలో సప్తమమే మిగుల దుర్బలమగుటచే ఈ శనిచంద్రకేంద్రయోగ ఫలము సప్తమభావదౌర్బల్యముతో మిళితమై చెల్లుబడికి రావలసియున్నది. మఱియు, తులారాశిలో

# గ్రహముల వేధ ఫలించుపద్ధతి

13°-49' లోనున్న వివాహసహమబిందువు (పాశ్చాత్య పద్ధతితో) అష్టమభావమందే యున్నది. ఇది వైవాహికజీవితవిషయమున మరింత దౌర్బల్యసూచకము. పంచమాధిపతియగు చంద్రునితో ప్రాతికూల్యదృష్టి గలిగి, పంచమస్థానమునం దున్న శని విషయసుఖ సంతానసౌభాగ్యదూరురా లీజాతకురా లని తెలుపు చున్నాఁడు.

సారాంశ మేమన, సకాలమున దాంపత్య జీవితము రానేరదు. విషయసుఖానుభవవిషయమున నాశాభంగ ముండఁగలదు. పెద్దలు నిర్ణయించిన బంధ మతృప్తికరముగా పరిణమించి క్లేశదాయక మగును. హెచ్చుగా వయస్తారతమ్యము గల సంబంధము కాక అన్య మతుకుట కష్టము. అది తగిన దను కొనుటకు వలసిన మనఃపరిపాక ముండదు. మొత్తము మీఁద బ్రహ్మచర్యమే శ్రేయస్కరము. జీవితమున కుపయోగకారికూడ.

ఇదంతయు జన్మకాలీనగ్రహసామగ్రి చేసిన వాగ్దానము. అనఁగా, జన్మకాలము సూచించు పురాకృతకర్మపరిపాకము.

"కేవలం గ్రహనక్షత్రం నదదాతి ఫలం నృణాం,
సర్వ మాత్మకృతం కర్మ లోకవాదో గ్రహా ఇతి."

అను పెద్దల సూక్తిని స్మరింతము.

ఇఁక, దేవమాన(దినవర్ష)దశాపద్ధతి యేమను చున్నదో చూతముకాక.

పండ్రెండు సంవత్సరముల ప్రాయమునకు లగ్నము చలించి జన్మశనికేంద్రమును, జన్మచంద్రుని సమసప్తకమును పొందఁగలదు. ఆజన్మాంతము క్లేశదాయకముగా పరిణమించు వివాహబంధము నార్జించుట కింతకన్న తగిన యవకాశ మెప్పుడు లభించును? శనిచంద్రు లేమి వాగ్దానముచేసిరో, ఆ వరప్రసాదమును స్వీకరించుటకు సిద్ధముగా దోసిలియొగ్గి చలితలగ్న మెదురుగా వచ్చినపు డా గ్రహము లూరకుండఁ గలవా? ఆసంవత్సరమందే చలితరవి జన్మవరుణసంయోగ మందినాఁడు. ఇంద్రుని సమసప్తకవేధచే చెడిన యీ రవి ఆశాభంగద్యోతకుఁడు గదా? రవి వరుణసంయోగము చూపు దశలో కలుగు మనువులు, స్నేహములు, బాంధవ్యములు మెరుపుతీఁగవలె మెరసి క్షణములో మాయమై విషాదాంతములుగా పరిణమించునని పాశ్చాత్యు లనుచున్నారు. తలవనితలంపుగా సౌకర్యము లెదిగివచ్చును; ఆకస్మికముగా మంచి యవకాశము లబ్బును; అంతా కూడిరాఁగలదు; పట్టిన దెల్ల బంగారగునట్లు తోఁచును. కాని, చేతి కబ్బునది హాలాహలమే!

పెద్దలు వివాహము చేయ సంకల్పించిరి. సనాతనాచారదీక్షాపరతంత్రహృదయుఁడు జాతకురాలి తండ్రి. కన్యాత్వము తీరకమునుపే తన యేకపుత్రికకు కంకణప్రాప్తి కలిగించు కుతూహల మతనికి జనించినది. పాపము! జాతకదశల వాగ్దానము నా అమాయకుఁ డెఱుఁగఁడు.

1928-వ సంవత్సరమున, ఫిబ్రవరినెల 10-వ తేదీన జాతకురాలికి 'పెండ్లిశాస్త్రము' జరిగినది. ఆముహూర్తకాలపు కుండలి యిట్లుండును:—

| | | | |
|---|---|---|---|
| బు 8-35 | వ 1-5<br>గు 8-35<br>I 11-30 | | రా 15-34 |
| ర 20-30 | (సాయనము) | | |
| కు 16 38<br>శు 15-8<br>X 8-45 | వివాహ ముహూర్తము | | ఇ 20-8 |
| శ 17-20<br>కే 15-34 | | చ 11-30 | |

లగ్నమందు బృహస్పతి, దశమకేంద్రమున శుక్రుఁడు, లాభస్థానములో రవి, మూఁడింట రాహువు

కల యీ వివాహలగ్నము చూచుట కెంతో రమ్యముగ కానవచ్చుచున్నది. కాని, సప్తమశుద్ధిలేదను మహాదోష మొక్కటి యున్నది. సప్తమభావమధ్యముననే చంద్రుఁడున్నాఁడు. అనగా, చంద్రాస్తమయకాలమున జరిగిన వివాహ మిది. వివాహ మైనవెంటనే చంద్రుఁ డస్తమించుటచే సౌఖ్యము, మనశ్శాంతి, గార్హస్థ్యధర్మము అన్నియు తోడనే అస్తమించునని దీని యర్థము. ఇఁక, మిగిలిన దేమి? జీవితములో గాఢాంధకారముతప్ప!

సామాన్యవిధుల నట్లుంచి, విశేషవిధుల గమనించినచో గుండియ లవిసిపోఁగలవు. జాతకమున శని వేధచే చెడి 'వాడి వత్తయై' మృత్యుభావమందు మాల్గుచున్న చంద్రుని స్థానమందే వివాహకాలమున తాత్కాలికచంద్రుఁడు సిద్ధమైనాఁడు! ఆ చంద్రస్థానమే వివాహకాలమున భర్తృ(సప్తమ) భావమైనది. శనిచంద్రుల వాగ్దానము చెల్లివచ్చుట కింతకంటె తగిన ముహూర్తము లభించుట దుర్లభము

"యోగే స్థానం గతవతి బలిన
శ్చంద్రే స్వంవా తనుగృహ మథవా,
పాపై ర్దృష్టే బలవతి మరణం
వర్షస్యాంతే కిల మునిగదితం."

అను వరాహమిహిరాచార్యుని యుపలక్షణసూత్ర మెంత బాగుగా నతుకుచున్నదో పాఠకమహాశయులు గమనించఁగలరు.

జన్మకాలమున ఇంద్రరవుల కుండు సమసప్తకయోగము ఆశాభంగసూచకమని వింటిమి. వివాహముహూర్తకాలమున నీగ్రహము లెట్లున్నవో పరిశీలించువారికి ఇంద్రగ్రహకార్యమునుగూర్చి వ్యాఖ్యానమవసరముగ నుండదు. నికరముగా ఇంద్రరవులు చారవశమున సమసప్తకమునకు వచ్చిన దినమున సంపాదించిన వివాహసంస్థనుండి ఆశాభంగముకాక వేరేమి సిద్ధించును? మఱియొక్కమాట. జాతకమున భర్తృస్థానాధిపతికదా బుధుఁడు? ఈగ్రహము వివాహమంగళకాలమున జన్మకాలికశుక్రసంయోగము నందుండుట గమనింపఁదగినది. శుక్రుఁడు జాతకమున అష్టమ(మృత్యు)స్థానాధిపతి. భర్తృస్థానాధిపతి మృత్యుదేవతకౌఁగిలింతలో నున్న ముహూర్తమందా పరిణయమహోత్సవము? వివాహకుండలిలో నయిత మిట్టి యోగవిశేషమే కలదు. చూడుఁడు. సప్తమాధిపతియగు శుక్రుఁడు అష్టమాధిపతియగు కుజుని సంయోగము నాత్రమున అభిలషించుచు దశమకేంద్రమందున్నాఁడు దేవమానముతో నీసంయోగము పూర్తియగునప్పటికి, అనఁగా రెండవయేట, ఫలము హస్తగతము కావలసియుండును. ఎంత ఘోరము!

దైనికజాతకము నొకసారి గమనింతము. వివాహదినమున దైనిక-చతుర్థకేంద్రము కర్కాటకరాశిలో 11-వ భాగ యందే, అనఁగా, జన్మకాలికశనిగ్రహముపైననే నికరముగా నున్నదనుట ప్రారబ్ధపరిపాకవిశేషమును చాటుచున్నది. చతుర్థకేంద్రము గృహస్థానము. గృహాధిపతియగు చంద్రుని ద్వేషించుచున్న శనిగ్రహమున ప్రత్యక్షమైననాఁడు (ఇది సంవత్సరకాలములో నొకదినమున మాత్రమే సంభవించును) సంపాదించి యిచ్చిన గృహస్థాశ్రమమున ఇంకెట్టి కళ యుండఁగలదు?

మఱియు నొక విశేషము. 'ఆశా' సహమము కర్కాటకరాశిలో $29^{\circ}$-27′ లో గండసంధిలో జాతకమున నున్నది. దీనినే పాశ్చాత్యసంప్రదాయములో స్త్రీవివాహద్యోతకబిందు వందురు. ఈబిందువు దేవమానచలనవశమున కదలి సింహరాశిలో 10-వ భాగలో వివాహకాలమం దుండినది. జన్మరవివరుణుల మధ్యబిందువు (centre cf gravity) కుంభరాశి 10-వ భాగలో నున్నదని చదువరులు గమనించఁగలరు. చలితరవిజన్మవరుణుల సంయోగ మాసంవత్సరముననే సంభవించుటచే, ఈమధ్యబిందు వాసంవత్సరమున నపారశక్తి మంతమయినది. అగుటం బట్టి, ఆశాసహమము చలనవశమున జన్మకాలరవివరుణుల సమసప్తక వేధను సంపాదించినట్లయినది. ఆశాభంగకారకుఁడగు రవి, వియోగసంపాదనప్రియుఁడగు వరుణుఁడు-వీరు

'ఆశా' బిందువుయొక్క తాత్కాలిక చలితస్థానమున కెదురుగా చేరి యొకవైపున కూర్చుండి 'తులాభార' వినోదముసలుపుచున్న వయస్సులో జాతకురాలికి తాళికట్టుట! సూక్ష్మమై, కోమలమై, మృదువైన ఆశాతంతువున కిది మోయలేని భారము. ఆ మరు సంవత్సరమే ఈబిందువు సింహరాశిలో 11½ భాగ నాశ్రయించఁగలదు. అనఁగా, లగ్నాధిపతియగు బృహస్పతినుండి నికరముగా సార్ధకేంద్ర ప్రాతికూల్య దృష్టికి వచ్చుననుట. జాతకురాలి వివాహపు ముచ్చట లడుగంటు టేమి యరుదు?

జాతకమున బృహస్పతి ప్రబలశుభగ్రహము కదా? వివాహలగ్నమునందే అట్టి శుభగ్రహము కూర్చుండి ఏమి గుటుకలు మ్రింగుచున్నాఁడు? అని యడుగవచ్చును.

"గురు స్సుదీప్త స్తనుకేంద్ర సంస్థితో
బలాధికో లగ్నగతో విశేషతః,
నిహంతి దోషా నఖిలాన్; స్తథావిధ
స్స్వవర్గ సంస్థో భృగుజో బుధోపి వా"

అనుట విద్యామాధవసూరిసూత్రము. బృహస్పతి బలవంతుఁడుగ నుండవలయు; లగ్నభాగయందే నిలువ వలయు; ఇట్లుండినచో దోషములను హరించఁగలఁ డాబృహస్పతి. కాని, 'మహాదోషము' లను హరించునని కాదు. లగ్నభాగ కెదురుగా సూటిగ (సప్తమభావమున) చంద్రుని నస్తమింపఁజేసి (ఇది మహాదోషము), వెనుక 8 భాగల దూరములో బృహస్పతిని కూర్చుండఁబెట్టినచో, పాప మతఁ డేమి చేయఁగలఁడు? ఇంతే కాదు. అతని వీపులమీఁదనే వరుణమహాశయుఁడు సయితము లగ్నభావమందే యున్నాఁడు. తగిన సౌకర్యముల సమకూర్చక, తప్పులను సవరించలేదని ఆచార్యుని నిందించు టేమి ధర్మము?

"సరే; అగ్రతాంబూల మిచ్చి చంద్రుని నాహ్వానించి పట్టముకట్టినారు. అతని కార్య మతఁడు చేయనిండు. వెనుక 8 భాగలలోనున్న నేను 8, 9 సంవత్సరముల కాలములో నాయోపుకోలఁది జాతకురాలికి తరణోపాయమును కల్పింతును." అను చున్నాఁడు బృహస్పతి. అతని కుండునది లగ్నదశ మాధిపత్యము. విద్యావివేకములు, పేరు ప్రతిష్ఠలు, శీలసంపత్తులు, జీవనవసతులు ఇవి అతని యధికారము లోని వస్తుసంభారము. దాంపత్యజీవితము, విషయ సుఖానుభవము, సంతాన సౌభాగ్యము ఇత్యాదు లతని "డిపార్టుమెంటు" కు చెందినవి కావు. పాప మతఁ డేమిచేయును? అది యట్లుండె.

1929-వ సంవత్సరమున జులై నెలలో 22-వ తేదీన, జాతకురాలికి బాల్యావస్థ తీరకమున్నే, వైవాహికజీవితము నామమాత్రావ శిష్ట మెనది; ఆశాతంతువు విచ్ఛిన్నమైపోయినది; రవివరుణుల భారమును మోయలేక తెగి నేల పాలయినది. నాఁటి గ్రహసామగ్రి 36 వ పుటలోని కుండలిలో చూపఁ బడినది.

జన్మకాలికగ్రహములతో, వివాహ కాలపు గ్రహములతో తాత్కాలికగ్రహములు సంపాదించిన ఆత్యంతికస్పష్టసంబంధమును ఈకుండలియందలిబాణపు గుర్తులు చదువరులకు సులభముగా చూపఁగలవు. నాఁడు పున్నమ. రవిచంద్రులు పరస్పరము సమసప్తక వేధలో నున్నారు. శుక్రుఁడు రవినుండి అర్ధకేంద్ర మున, విషమదృష్టి స్థానములో నున్నాఁడు. కాని, ఇది జాతకురాలికి మాత్రము సంబంధించిన ప్రత్యేక యోగము కాదనుట సత్యము. మఱి విశేష మేమనఁగా జాతకురాలి చలితవరుణస్థానమునుండి (పరస్పర వేధ గల) యీ మూఁడు గ్రహములకు—అనఁగా, రవిచంద్ర శుక్రులకు—వచ్చిన ప్రబలవేధ ముఖ్యముగా గమనింపఁ దగినది. చంద్రరవులకు (భార్యాభర్తలకు) అష్టమాధి పతియగు శుక్రునినుండి సంభవించిన వేధలో వరుణుని కైవాటమున్నది. ఇంతే కాదు. వివాహకాలమున తనుభావములో నుండిన వరుణుఁడు మెల్లగ లగ్న బిందువును చేరుకొనుట ఆనాఁడే జరిగినది. జన్మ చంద్రస్థానము, వైవాహిక చంద్రస్థానము, వివాహ లగ్నము, వివాహసప్తమస్థానము ఇవన్నియు జన్మకాశి

వేషకుఁ జిక్కియుండఁగా, ఆ వేధాఫలితమును కార్య రంగమున ప్రకాశమునకుఁ దెచ్చుపని నాఁటి వరుణ గ్రహము సాధించినది. ఏమి యీవరుణ గ్రహపు దెబ్బ! బంధమున ముడివేసిన బాలుఁడు ఆదినముననే ఆకస్మిక ప్రమాదముపాలై బండిపైనుండి తలక్రిందుగా నేలపైఁ బడి క్షణములో నిహలోకయాత్ర చాలించినాఁడు.

11½° వివాహలగ్నము




11½° జన్మచంద్రస్థానము, వివాహచంద్ర స్థానము, వివాహ సప్తమ భావము

చలితరవివర్షుణసంయోగపు వయస్సున వివాహము జరుపుట గొప్ప లోపము. అట్టి వివాహముహూర్తమున వరుణగ్రహమును లగ్నమందు రానిచ్చుట ప్రమాదకారి. మన పంచాంగములలో వరుణగ్రహమునకు స్థానమీయనంతమాత్రమున, మన కార్తాంతికులా గ్రహమును నిరాదరించినంతమాత్రమున దాని శక్తికి కల్గిన లోటేమియు లేదు. జాతకురాలికి వివాహవిచ్ఛిత్తి కలిగిన మార్గములో సయితము పిట్ట పిడుగువంటి వరుణగ్రహకార్యమే కానవచ్చుచున్నది. పాశ్చాత్యగ్రహ మిది యని దీనిని నిరాదరించినచో నష్టము మనకేకాని పాశ్చాత్యులకు కాదు.

పోనిండు. ప్రమాదదినమునకు దైనికలగ్నమును సాధించినచో నది సింహరాశిలో 23-వ భాగకు వచ్చును. ఆబిందువందే తాత్కాలికకుజుఁ డుండుట!

అనఁగా, దైనికలగ్నము దైనికాష్టమాధిపతిసంయోగములో నున్నదనుట. జన్మకాలమున భర్తృస్థానాధిపతిని ద్వేషించుచుండినవాఁడీకుజుఁడు. ఏమి చిత్రము!

ఆబాలుని జాతకముతో పోల్చిచూచితిమేని, అనేకాంశములు గోచరించును. తగని బంధ మిది యనుటకు పెక్కు కారణము లున్నవి. కాని, గ్రంథవిస్తరభీతిచే మానితిని. ఒక్కమాట! శనిచంద్రుల కేంద్రవేధ గల కన్యకు పసితనమున పసిబాలునితో వివాహ మసంగతముకదా? దుష్టుఁడైన శని యట్టి వివాహ మోర్వఁగలఁడా? ఓర్చెనేని, జన్మములో సుఖమును రుచిచూడనిచ్చునా? ప్రేమలతను త్రెంచి, ఎండించి, పిప్పిచేసి, ముడిచి మూటకట్టునుకాని!

అది యట్లుండె. పండ్రెండుసంవత్సరముల ప్రాయమున పెద్దలు జాతకురాలికి వివాహము చేసి యుండని పక్షమున ఈగ్రహచార మేమి చేయుచుండెనను ప్రశ్న యున్నది. శనిచంద్రుల వేధాస్థానమునకు (మేషరాశి 11-వ భాగ) చలితలగ్న మా వయస్సున వచ్చుట నెవరుగాని తప్పించలేరు. అదియే విధి. తత్కాలమున కెట్టి సౌకర్యము లుండునో, ఏమార్గములు సులభముగా నలవడునో, ఏసంబంధ బాంధవ్యములు చూపట్టునో, వాని నాశ్రయించి గ్రహములు తమ సూచించు ఫలముల కాకారములు కల్పించును. బాలునితోడి వివాహ మగుటచే కథ యిట్లు పరిణమించినది. లేదా, ప్రమాదవశమున నతని కాజన్మాంతముగ అంగవైకల్యము కలిగి తన్మూలకముగ క్లేశప్రాప్తి రావచ్చును. అట్లుకాక, వయసు చెల్లినవానితో పెండ్లి అయియుండెనేని, దాని మార్గము వేఱు. వివాహమే కాకుండెనేని, కథ భిన్నముగా నడచియుండును. మాటవరస కాలోచింతము. ఆడుకొనుచున్న చిన్నపిల్లల నపహరించుకొని దూరదేశములకు పోయి ఏ ఘోషాపద్ధతి జమీాఁదారుల జనానాకో విక్రయించు నీచుల కథలు వినుచుందుముకదా? ఇట్టి పరిణామము సంభవించెనేని, ప్రశంసలో నున్న ఫలములన్నియు నందు కానరావచ్చును. ఏ మార్గముతోనైననేమి, యుక్తకాలమున ప్రేమవికాసము నిచ్చు దాంపత్యజీవితమునకు వెలచేయు బంధ మొకటి సిద్ధించవలసియున్నది. ఆకస్మికాకర్షణము, ప్రమాదకరమగు బంధము, స్వజనవియోగము, సుఖనాశనము, మనఃక్లేశము ఇవి జీవితమున కలిసిరావలయును. ఏ మార్గమైననేమి?

గ్రహములనుండి వచ్చు ఫలదాయక తేజఃప్రసార మొక నిర్ఝరప్రవాహమువంటిది. వర్షాకాలమున దానిని ప్రవహింపకుండఁజేయుట మన తాతల తరము కాదు. చేతనయినంతలో దాని కొక కట్ట కట్టి, మరవలు తూములుగుండా ఆనీటిని వేరుమార్గమున ప్రవహింపఁజేయుట తగిన యోగ్యత కల ఇంజనీయరుకే సాధ్యము. అందరు నాపని చేయఁజాలరు. తగిన శక్తి లేనివాఁడా పని చేయఁబూనెనేని కట్టను, కట్టరాళ్లను, కట్టుచున్నవానిని సయితమా ప్రవాహము సముద్రము జేర్చఁగలదు. గ్రహచారము సూచించు దుష్ఫలము రాకుండ అరికట్టుట మనకు సాధ్యము కాదు. ఏదో యొక మార్గము దాని ప్రవాహమునకు చూపి తీరవలెను. దాని స్వభావమునకు తగినమార్గ మొకటి తయ్యారుచేసినచో, అది ఆ మార్గమున ప్రవహించి, ఇతర విధములుగా మనలను బాధించదు. కాని, ఈపనికి గొప్ప సంకల్పశక్తి కావలసియున్నది. మొత్తముమీఁద నది చిక్కుసమస్య. కాని, దైవము (అనఁగా, గ్రహచారము సూచించు పురాతనకర్మ ఫలపరిపాకము) ఎంత బలిష్ఠమైనా, పురుషకారపు స లేకనే ఈ జన్మమున ఫలదాయి కానేరదు.

"యథా హ్యేకేన చక్రేణ రథస్య నగతిర్భవేత్,
తథా పురుషకారేణ వినా దైవం నసిధ్యతి."

అను సూక్తి అమోఘమయినది.

జాతకురాలికి బుధవరుణసంయోగ మున్నది. కుజనవాంశలో బుధుఁడు, వర్గోత్తమాంశలో వరుణుఁడు ఉన్నారు. ఉపజ్ఞతోఁ గూడిన నిశితబుద్ధి కలదు. పైఁగా, అపారమగు స్వాతంత్ర్యకాంక్ష

యున్నది. ఇతరుల ఆదర్శములు, అభిప్రాయములు ఆదరపాత్రములని ఆమెకుఁ దోఁచుట కష్టము. అనుకొన్న పని సాధించు నోర్పు, దానికి వలయు పట్టుదల ఇవి సమృద్ధిగా కలవు. మూఢవిశ్వాసమునకు హృదయమున చోటు లేదు. బుధునికి కుజునితోఁ గల సమసప్తకదృష్టి తైక్ష్ణ్యము నీయఁగలది. మాటలలో ధోరణితోపాటు చురుకుదనము సయితము ముండఁగలదు. అప్రియమని సత్యమును నిరాదరించుట ఎన్నఁడు కాని రుచించదు. తన దృష్టిలో అధర్మమో, అన్యాయ్యమో కానవచ్చినచోట దండయాత్ర వెళ్లుట కామె వెనుదీయునది కాదు. సరివారితోడి సంభాషణలో స్పర్ధ వచ్చినచో గెలుపామెదే యని ఆరింటి కుజుఁడు చెప్పుచున్నాఁడు. చక్కని కార్యనిర్వాహకశక్తి సింహరాశిలో స్వనవాంశలో నున్న కుజుని ప్రసాదము. కాని, బలవంతుఁడై లగ్నమందే యున్న మీనగురువు చక్కని వినయవివేకములతోడి త్యాగశీలతను ప్రసాదించినాఁడు. ఇతరులు కష్టములో నుండిరేని, స్వార్థదృష్టినే మరచి వారి కుపకరించునంతటి నిర్మల దయార్ద్రహృదయ మాపాదది. ఇది మీనగురువు ననుగ్రహము. ఈ గురువు దశమాధిపతి సయితమగుటచే, నిష్కలుషమగు జీవికలో ప్రజాదరము వడయు చక్కని మార్గమును చూపినాఁడు. ఆరింటి కుజుఁడు ధనుస్సులో వర్గోత్తమాంశలో నున్న దశమకేంద్రముపై పరిపూర్ణత్రికోణశుభదృష్టిని బరపుచు గౌరవాస్పదమగు స్వతంత్రజీవనోపాయమును సూచించుచున్నాఁడు. పుణ్యసహము ధనుస్సులో 2°-37′ లో బృహస్పతియాజమాన్యములో నుండి, ఏగ్రహము లేమి చేసి? నేను రక్షింతునని వాగ్దాన మిచ్చుచున్నది.

ఇట్టి నైజస్వభావము లున్న జాతకురాలి కెట్టి జీవిత మర్హమైనదో నిర్ణయించుకొను బాధ్యత ఆమెదే. ప్రేమమయదాంపత్యజీవితము ననుభవించు ప్రాప్తి లేనపుడు, స్వాతంత్ర్యముమాత్రము కోలుపోయి, ఎవ్వనికో జన్మావధిగ దాస్యము చేయుటకు తగిన చిత్తవృత్తి, చాలినంతయోర్పు, కావలసిన భావదారిద్ర్యము జాతకురాలి కున్నదనుట జాతకవిరుద్ధవిషయము. అవి లేనినాఁడు ప్రస్తుతస్థితి శ్రేయస్కరమా, శోచనీయమా అను విషయము నెమ్మదిగా జాతకురాలే ఆలోచించి నిర్ధరించుకోఁదగిన మాట. చేతనయినంత దేశసేవయో, సంఘసేవయో చేయఁగల ఆనుకూల్యము, అనువగు జీవిక, తగిన త్యాగశీలత, కావలసిన స్వాతంత్ర్యము ప్రసాదించిన బృహస్పతియనుగ్రహము కొనియాడఁదగినది.

చలితదశమకేంద్రము త్వరలో బృహస్పతియర్ధకోణదృష్టికి రానున్నది. చలితగురువు పుణ్యసహమునకు పూర్ణత్రికోణశుభదృష్టికి వచ్చి కాపాడుచున్నాఁడు. క్రమక్రమముగ నీగురువు చలించి లాభగతుఁడగు జన్మరవిని అర్ధకోణదృష్టిచే పోషించఁగలఁడు. గురురాశియందే చలితరవి యుండుటచే నీ సత్ఫలమునకు వికాస మున్నది. ఇవి పెక్కుసంవత్సరములు వ్యాప్తిలో నుండఁగల దశలు. శని వక్రియై చంద్రకేంద్రమునుండి మెల్లగ వెనుకకు తగ్గుచుండు కారణమున జీవితవికాసము నరికట్టిన శనిపట్టు క్రమక్రమముగా తగ్గుట కవకాశ మున్నది. శనిచంద్రులకు పరివరన మున్నది. శని తన ఉచ్చనవాంశలో నున్నాఁడు. అగుటచే బాల్యమున శనిచంద్రులవలని క్లేశ మేమివచ్చినా, వివేకము నార్జించి మధ్యవయస్సున బాగుపడు నవకాశ మున్నది. శనిచంద్రులకు జన్మకాలములో కేంద్రవేధ గల జాతకములకు చంద్రుఁడు చలనవశమున నొకసారి రాశిచక్రమును చుట్టివచ్చిన తరువాత—అనఁగా, 27 సంవత్సరములమీఁద—శనిపట్టు వదలునఁట! అగుటచే, భావిజీవిత మాశాజనకముగా నున్నది.

విషయమంతయు విని నవ్వుచు—

"నాభార మిపుడు చాలవరకు తగ్గినది." అని యాజాతకురాలు చెప్పినది.

"జ్యోతిష మభ్యసించుము. దుఃఖమే యుండదు. సంఘసేవ చేయుచు జీవితము నానందమయముగా చేసుకోఁగలవు." అంటిని.

"అర్థార్జనే సహాయః
పురుషాణా మాపదర్ణవే పోతః,
యాత్రాసమయే మంత్రీ
జాతక మపహాయ నాస్త్యపరః.

అని చెప్పిన కల్యాణవర్మయుపదేశము స్మరింపఁదగినది.

ఇప్పటికాలమున మన దేశములో స్త్రీలలో నీవిద్యకు వ్యాప్తియే లేకుండుట చింతాకరము. కడకు పంచాంగము చూచి తిథివారనక్షత్రములు తెలుసుకొను నలవాటుసయితము మన నాగరకతరుణుల కందరాని విద్య యగుచున్నది. సంతాననిరోధకరములగు నాధునికోపకరణసామగ్రి నెఱుఁగుటకు వారి కున్నంత సౌకర్యములు అమావాశ్యాదుల నెఱుఁగుట కిప్పటి విద్యావిధానములో కానరావు. వైద్యవిద్య 'ఎట్లు ప్రజాసేవకక్కఱకువచ్చునో, జాతకశాస్త్రముసయితము నట్టి యుపయోగము కలదే. ఆయుర్వేదము నభ్యసించిన స్త్రీలు స్త్రీజనసేవ కెట్లు ముఖ్యమో, జ్యోతిష మభ్యసించిన స్త్రీలుసయితము స్త్రీసంఘాభ్యుదయమున కంత యావశ్యకమే. గర్భాశయవ్యాధులచే బాధపడు స్త్రీలు చికిత్సకై పురుషవైద్యులకడ కేగుట కెట్లు జంకుదురో, దాంపత్యవిషయములలో క్లేశము లనుభవించు స్త్రీలు భవితవ్యత నెరుఁగుటకై పురుష కార్తాంతికుల నాశ్రయించుట కట్లే జంకుట అస్వాభావిక మనరాదు. పాశ్చాత్యదేశములలో నిపుడు హోరాశాస్త్రమును బాగుగా నభ్యసించి వృత్తిగా చేసుకొని సంఘసేవ చేయుచున్న నారీమణులు పలువురున్నారు. ఈ శాస్త్రమునకు జన్మస్థాన మనఁదగిన భారతభూమికేనా యిట్టి దారిద్ర్యము ?



# 'నిరంకుశాః కవయః'

= శ్రీ కుంటిమద్ది శేషశర్మ =

అదిగో! తుహినభూధరదరీఝరీనిరీక్షాపేక్షతో భూసురవరుడు ప్రవరుడు ప్రయాణమయ్యెను. మంచి తోడుగదా. మనము ననుగమింతము. అల్లదె శీతశైలము. ఆహా! దీని శిఖరములు మింటి నొరయుచున్నవి. అంత యెత్తునుండి సెలయేళ్లు పిల్లగంతులు వైచుచు, గండోపలంబులకు ఢీకొనుచు, వెనుదిరుగుచు, సుడియుచు, తరంగములు రేగ మర్దలధ్వని ననుకరించుచు, శ్రవణసాహిత్యము నొనగూర్చుచున్నవి. ఆ యభంగభంగనినాదంబులు ఘనగర్జారావంబులని పురివిప్పి యాడు నెమళ్లు చూపుల నాకట్టుచున్నవి. మదపుటేన్గుల తొండములచే విరువబడిన చందనాదితరుపరిమళములు ఘ్రాణతృప్తి గావించుచున్నవి. ఆహా! యెట్టి ప్రకృతిశోభ. సర్వేంద్రియానందమొనగూర్చుచున్న దీహిమవంతప్రాంతము.

ఇంకను పరికింతముగాక.

ఏమి యీ యలకానదీజలంబుల నోగాడిన మరుదంకురంబుల ప్రభావము. పర్వత మెక్కుచున్నను అలసటయే తోచుటలేదు.

ఔరా! యీసరోవరాభోగము. సమాధినిష్ఠాగరిష్ఠులైన మునిశ్రేష్ఠుల కియ్యది తపంబున కెంతేని యనుకూలము. ఇదియకాబోలు "నిడుదపెన్నెరిగుంపు జడగట్టి సగరమున్మనుమండు తపము గైకొనినచోటు."

అది యేమచట పెనులోయ పొడగట్టుచున్నది. అబ్బ! చూచినంతనె కన్నులు దిరుగుచున్నవే. "జరఠకచ్ఛపకులేశ్వరు వెన్ను గానరా జగతికి మిన్నేరు దిగిన చోటు" ఇదియగాబోలు.

హోయిహోయి! చిత్త మెంత ప్రశాంతముగనున్నది. వేసవిలో పంచాగ్నిమధ్యమునను, శీతువున నివతాళించు జలంబునను "గిరికన్య పుచ్చడీకతనంబు పోనెట్టి పతిగొల్వ నాయాసపడిన చో" టిదియగానోపు.

అల్లదిగో యచట విభూతిరాశి గాన్పించుచున్నది. పాపము! "వలరాచరాచవా ఫలికాక్షు కనువెచ్చ కరగిన యలకనికరపు చోటు" ఇదియగానోపు.

అదియే మచట కనుపపులు ఎంతదట్టముగ పెరిగినది. ఇదియేనేమో వేల్పుబడవాల గన్న శరవణము.

ఆహా! యెట్టి ప్రదేశములు, పవిత్రపరిశుద్ధములు, రమణీయములు. ఇట్టి యుద్దీపనసామగ్రులెవ్వరి మనంబుల చలింపచేయజాలవు. తపస్వియిల్లాండ్రైననేమి—వారి చెలువంబు ముచ్చిచ్చునకుకూడ విరాళి గల్గించినది. ఔరా! ఏమనవచ్చు బ్రహ్మకునైన నీనగమహత్వం బెన్న దరమే? ఈపర్వతరాజుకతంబునగదా ఆదిభిక్షువుగూడ ఒక యింటివాడయ్యె. జదలేట పౌలోమి కీత నేర్పుచు సురరాజు జలకేళి చెలువారించెను.

నిఖిలనిలింపసభయు జన్నంపుపొంపుసంపదనప్పటప్పటికి జిహ్వా త్రుప్పుడల్లు నామెత లెరింగెను. ఔనౌ! నగాధిరాజమా! నీకివే మానమోవాకంబులు.

అబ్బా! యెంతదవ్వు దిరిగితిమి. వలిమల శైత్యమున గనుపించలేదుగాని, ఎంతప్రొద్దెక్కె. అదో నలినీబాంధవు డప్పుడే మింటిమధ్య కేతెంచెను. రవి

కాంతములు వేడెక్కినవి. కరగిన మంచుతుంపురులు వానిపై బడి 'సుయ్యి'మనుచున్నవి. నేటికి చాలీవిహారము. మరలుదముగాక. మన సంగడీడు ప్రవరుడేమి కదలకున్నాడు. ఇంతవరకు నుత్సాహముతో కొండమూలమూలల రెక్కలుకట్టుకొని తిరిగి, ఇపుడేమో గొణుగుచున్నాడే, విందముగాక.

"పాదలేపము కరగిపోయినది. ఇంటికి బోగాల్లాడవు. గ్రామగమనాభిలాష మనస్సును తొందరించుచున్నది. ఆర్తి హెచ్చెను."—ఇదివరకు దివ్యాదివ్యముగ పొడగట్టిన వలిమల ఇపుడు ఘోరవనప్రదేశమట. చేదోడు వాదోడు లేని మిన్నులువడ్డచోటు. ఆకొన్నట్టి యుద్దండవేదండవరాహహరిపుఖ్ఖ వ్యాఘ్రములకు నాటపట్టట-అమ్మో! తాకిన కొంకరలుపోవు మంచుకొండా నిన్ను దలంచినంత హృదయము వ్రయ్యలగుచున్నది. బుద్ధిజాడ్యమున కాశీగయాప్రయాగాదులను జూడనొల్లక క్రొవ్వి యిచ్చటికి వచ్చితిమి. చాలు నీసావాసము. నీకివే వందనములు.

ఔరా! పెద్దనప్రతిభ. తొలుత హిమవంతమును సినిమాతెరపై చూపినయట్లు, అతిరమణీయముగ, దానంతటి దర్శనీయము లేనట్లుగ, దానిని జూడకున్న జన్మ వృథయగునట్లుగ చిత్రించెను. పిమ్మట అంతకన్న నికృష్టమైనది లేనట్లు, బుద్ధిగడ్డితిని దానింజూడబోవలసినట్లు, తలంచిన గుండె లవియునట్లు చూపెట్టెను. కవులు నిరంకుశులుగదా, మెచ్చిన తురకమెచ్చులు, తన్నిన గాడిదతన్నులు!

ఈయనే ఒకప్పుడు చంద్రుని ఏమనుచున్నాడో కాంతము.—పుట్టినది పాలసముద్రములో. మెట్టినది త్రినేత్రుని కపర్దము. చేసినది సకలదైవతక్షుధాశాంతి. చీకటిని హరించి కువలయమును రంజింపజేయువాడు. అమ్మహావిష్ణువునకుం గుటిల్లాలు సిరికి తోబుట్టువు. సకలకళ లెరింగిన దిట్ట. సూర్యునికి సైదోడు. అందములకు సీమ. మన్మథునికి మామ. ఔరా చందమామ! ఎంతని కొనియాడవచ్చును!

కవిభావనాబలము చంద్రుని కొండెక్కించినది. కాని "తమతమ నెలవులు దప్పిన తమ మిత్రులు శత్రులగుట తథ్యము"అన్నట్లు మరొకకంట జూచిన చంద్రుడెట్లు కనుపడుచున్నాడో చూతము.

"తొలుదొల్త కమలమిత్రుని వంక రూపాట, దక్షాధ్వరధ్వంసి తన్నుగనుట, పరివేషమిషమున పాశంబు దాల్చుట, కప్పు దేహమునందు కానబడుట, కాలవశంబునఁ గాని తోపకయుంట, సతతనిష్ఠురగదాన్వితతఁ గనుట, పూని పాండుక్షేత్రమున ప్రవర్తించుట, ప్రకటానురాగతారకు డగుటను అంతరం బెద్దియాత్మలో నరసి చూడ రాజ నీకును నల ధర్మరాజునకును? ప్రాణిలోకంబు బాధల బఱచునపుడు ధర్మపథ మొక్క డెక్కు డానస్యనంను."

కనుక యమధర్మరాజైన ధర్మమెరిగి ప్రవర్తించును. కాని ప్రాణికోటుల బాధించుటయందు అతనికంటె నితడు క్రరకుబెడదగల కర్కటకుడట. అంతియగాక, ఇతనిని కొలుమవారికిగూడ కరకుదనమునకు కరవులేదనుచున్నాడు: "గోవధముసేయు తురకల దైవంబవు నీవు." అని.

"కనకపు సింహాసనమున శునకముఁ గూర్చుండఁబెట్టి శుభలగ్నమునం దొనరగ పట్టముగట్టినను వెనుకటి గుణమును మాన"దన్నట్లు, "విడువక తలపైఁ గొన్నాళ్లిడిచూచి"యు, "కళంకివగుట యెరిగి, మహేశుండుడుకుచు దక్షాధ్వరమున నడుగున బడవైచె"నని, కొండెక్కించిన మహానుభావుడే అడుగున బడవైచి కొట్టినాడు. ఔరా, కవివరుల నేర్పు! వీరి కత్తి కిరువాగుల పదనుగదా!

ఇది పరికింతము.

"వక్త్రం చంద్రవిడంబి పంకజపరీ
హాసక్షమే లోచనే
వర్ణః స్వర్ణమపాకరిష్ణు రలినీ
జిష్ణుః కచానాం చయః

వక్షోజా విభకుంభవిభ్రమహరౌ
  గుర్వీ నితంబస్థలీ
వాచోహారిచ మార్దవం యువతిషు
  స్వాభావికం మండనం."

ఆహా! చంద్రుని బోలు మోము, పంకజముల పరిహసించు వాలుగన్నులు, బంగారు నిరసించు మేని కాంతి, తుమ్మెదల బారు మీరు నెరికురులు, కుంభి కుంభసంపత్ప్రశ్యతోహరములైన కుచకలశంబులు, వెడదనితంబము, మెత్తని మనోహరవాక్కులు, కులుకు బెలుకులు యువతికి పెట్టని సొమ్ములుగదా. సొమ్ములే గాదు—"స్త్రీణా మేత ద్భూషణం చాయుధంచ." అందుకనే వీరబలలు కారు. "యాభి ర్విలోలతర తారకదృష్టిపాతైః శక్రాదయోపి విజితా స్త్వబలాః కథం తాః" అని ప్రశ్నించినాడు.

కాని, అతని లేఖినినుండియే దిగుమతియైన దీ పద్యము:—

"ఆవర్త స్సంశయానా
  మవినయభవనం పట్టణం సాహసానాం
దోషాణాం సన్నిధానం
  కపటశతమయం క్షేత్ర మప్రత్యయానాం
స్వర్గద్వారస్య విఘ్నో
  నరకపురముఖం సర్వమాయాకరండం
స్త్రీయంత్రం కేన సృష్టం
  విష మమృతమయం ప్రాణిలోకస్య పాశః"

అని స్త్రీ విగ్రహము తలంచినంతనే వళ్లు జలదరించునట్లు వర్ణించినాడు. వారి చేష్టలనేగాదు, ముందు పేర్కొన్న అంగాంగసౌందర్యమును గురించికూడ—

"నో సత్యేన మృగాంక ఏష వదనీ
  భూతో నచేందీవర
ద్వంద్వం లోచనతాం గతం న కనకై
  రప్యంగయష్టిః కృతా,
కిం త్వేవం కవిభిః ప్రతారితమనా
  స్తత్వం విజానన్నపి
త్వజ్మాంసాస్థిమయం వపుర్మృగదృశాం
  మందో జన స్సేవతే."
అని భర్తృహరే వర్ణించినాడు.

అంటే కవు లెంతటికైనను సమర్థులే. వీరుని చేతి కత్తికన్నను కవిచేతి కలానికి ధార మిక్కుటము. దీని మార్దవము హృదయముల గరగించును. వీరు నందిని పందీ, పందిని నందీ చేయగల సమర్థులు. అందుకనే వీరికి సరిసాటి లేదు. "సుకవితా యద్యస్తి రాజ్యేన కిం" అని ప్రభుశక్తికన్న కవితాశక్తిది పైచేయి యన్నాడు భర్తృహరి. అట్టి కవితామతల్లికివే కైమోడ్పులు.






# —అందువల్ల పొదుపుకాగలదు

పొదుపుచేసే ప్రతి పనివల్ల డబ్బు ఆదాఅవుతుంది.—మిగులుతుంది మీకే. వారాలపాటు, నెలలపాటు ఈ విధంగా పొదుపుచేసుకుంటే చిన్నచిన్న మొత్తాలన్నీ కలిసి ఎంత పెద్దమొత్తం అవుతుందనుకున్నారు ! ఈ రోజులలో పొదుపుగా వుండడం మీ విధికృత్యంకూడా. ఎందుకంటారా, సప్లయిలపై చెప్పలేనంత ఒత్తిడి కలుగుతూవుంది; పీదలకు ఎన్నో అవసరాలు వున్నాయి. పొదుపుగావుండే సద్గుణ సంపన్నులయితే, దేశానికి సహాయపడగలరు; ఆర్థికంగా మీరు బాగుపడనూగలరు.



## మితవ్యయంతో కొరతను జయించు



చినిగిపోయిన తువ్వాళ్ళు, దుప్పట్లు, టేబిల్ క్లాత్‌లు మరికొంతకాలం ఉపయోగపడేటట్లు చేసుకోండి.



చినిగిన చొక్కాలను, యిజార్లను (పైజామాలను), వస్త్రములను, పంచెలను, కుట్టుకొని, కొత్తవాటినికొనడం తప్పించుకోండి.



నాన్నబట్టలు, అమ్మబట్టలు పాతపడినవివుంటే వాటిని చింపి, పిల్లలకుకుట్టించండి. అప్పుడవి బాగానే కనిపిస్తాయి.



పాత చెప్పులను బాగు చేయించుకోండి గాని, పారవెయ్యవద్దు.



కొత్తగొడుగు కొనవద్దు, పాతదానిని బాగుచేయించండి.



పాత ట్రంకు పెట్టెలను, సూట్‌కేసులను హోల్డాలులను బాగు చేయించండి. కొత్తవి ఖరీదు ఎక్కువ, దొరకవు.

# సాధ్యమైనంతవరకు ఏదీకొనవద్దు,

ఇండియా ప్రభుత్వపు సమాధారం, బ్రాడ్‌కాస్టింగు శాఖవారి ప్రకటన

# ఏడుకొండలవానికి కొత్త నవరత్నకిరీటము

తిరుమల తిరుపతి దేవస్థానముల కమిటీవారు శ్రీ వేంకటేశ్వరస్వామికి ఈ నవరత్నకిరీటమును క్రొత్తగా తయారుచేయించినారు. నేడో రేపో ఇది యథాశాస్త్రముగా స్వామివారి శీర్షము నలంకరించబోవుచున్నది.

దీని నిర్మాణమునకు తగిలిన మొత్తము ఖర్చు దాదాపు పదిలక్షలరూపాయలు. కుబేరసంపదగల ఏడుకొండలవానికి కొదవేమున్నది ?

ఈ కిరీటముయొక్క ఎత్తు ౨౭ అంగుళములు. దీని ముంభాగమంతయు అమూల్యములైన నవరత్నములతో ధగద్ధగాయమానముగా తాపటము చేయబడియున్నది; వెనుకభాగము పూర్తిగా ప్రాచీనకాలపు నగిషీలతో చిత్రింపబడిన వట్టి బంగారుముద్ద. ఒక్క బంగారమే ఈ కిరీటములో సుమారు వెయ్యి తులములున్నదట. మరి, సంఖ్యాతీతములైయున్న ఆ నవరత్నముల తూక మెంతయుండునో ! ఆ నవరత్నములలో కెల్ల హెచ్చు వెలగలవి రెండు పెద్దపచ్చలు; రెండు పెద్ద వజ్రములు. అవి ఒక్కొక్కటి సుమారు ౧౫ క్యారట్ల బరువుగలిగియున్నవట. ఇంతింతలేసి రత్నములతో, అంత ముద్ద బంగారముతో నిర్మాణమయియున్న ఈ కిరీటమది యెంత బరువుండునో పాఠకులే ఊహించుకోగర్తలు. ఎంత బరువున్న నేమి ? చతుర్దశ భువనముల భారమును అవలీలగా మోయజాలిన దక్షునికి ఇది యేపాటి భారము !

# శృంగేరీ సందర్శనము



## = శ్రీ వేలాల సుబ్బారావు =

"పోయి సేవింపలేకున్న పుణ్యతీర్థ
మహిమ వినుటయు నిఖిలకల్మషహరంబ"

అని పెద్దవగారు చెప్పినట్లు దేశదేశాంతరాలలోని దివ్యస్థలసందర్శనంచేత కల్మషపరిహారం కావడంమాట ఎట్లావున్నా (అది మన కంటికు ప్రత్యక్షంగా కన్పించే విషయం కాదు; పైగా పాపపుణ్యాలంటేనూ, ధర్మాధర్మాలంటేనూ అనేకపరివర్తనలూ, తారుమార్లూ కలుగుతూవున్న ఈరోజుల్లో ఫలానిది కల్మషమనీ, అది నివర్తించిందనీ అనుకోడం విడంబనమే) ఆనందంమాత్రం ప్రత్యక్షమవుతుంది యాత్రాపర్యటనంలో. సహజరమణీయములైన, వివిధవృక్షలతా కుంజపరిపూర్ణములైన పర్వతశిఖరాలనూ, సానువులనూ, గుహాకందరాలనూ చూడటంచేత చిత్తం ఆశ్చర్యచకితమై ఏకాగ్రతను పొంది దేహం మరచిపోయేటంతటి ఆనందపారవశ్యంవల్ల స్తంభించిపోయి ఒక్క క్షణమాత్రమైనా అనిర్వచనీయసౌఖ్యం పొందితీరుతుంది. కళ్ల వెంట ఆనందబాష్పాలు రాలుతై; ముఖాన్ని ఒక విధమైన గాంభీర్యం ఆవహిస్తుంది. ఇంతకంటే భగవత్సాక్షాత్కార మేముందీ? "ఆనందో బ్రహ్మ"యని కదా ప్రాజదువు?

శృంగేరీసందర్శన మటువంటిదే. దైవానుగ్రహంవల్ల ఇదివరకు నేను చేసిన యాత్రలన్నింటిలో కాశ్మీరమందలి అమరనాథయాత్ర మిక్కిలి కఠినమైనది. అంత కష్టమైనదిగాకపోయినా ఈ శృంగేరీ యాత్రా అటువంటిదే.

"కాలోఽస్మి లోకక్షయకృత్ ప్రవృద్ధో
లోకాన్ సమాహర్తు మిహ ప్రవృత్తః."

అని కాలపురుషుడు మొదలెట్టిన నరమేధయాగం విశ్వరూపం దాల్చి సాగుతూ, అందులో ఆహుతి భాగభాగ్యముందవలసిన కోటానకోట్ల పుణ్యాత్ములకే ప్రయాణసౌకర్యాలు సమకూరకుండావున్న ఈ రోజుల్లో నావంటి పాపీదిరాయువులకు దొరికే దెట్లా? కాని దొరికింది ఏ దేవతానుగ్రహంవల్లనో మొన్న మార్చి ౧౬-వ తారీఖు శనివారం రాత్రి బెంగుళూరి మెయిల్లో.

మైసూరు రాజ్యం యావత్తూ మలనాడూ, మైదానమూ అని రెండువిభాగాలు. అందులో మైదానపు పీఠభూమి ఇంచుమించుగా ౧౫౦౦ అడుగులు మొదలుకొని ౩౦౦౦ అడుగులవరకూ ఎత్తు కలిగి వుంటుంది సముద్రపు నీటిమట్టానికంటే. ఇదంతా రాష్ట్రపు పూర్వదిశయందే వుండి; తూర్పు కనుమలకు సంబంధించినది. ఒకదానిమీద వకటిగా పదిలంగా తీర్చి కూర్చినట్లుగా ఉండే బ్రహ్మాండమైన బండలతో నిండిన, చెట్లూ చేమలూ లేని కొండలతోనూ, కొండబోళ్లతోనూ, అక్కడక్కడ నీటివసతి గల చోట్ల కొంతమేర పైర్లతో, తోటలతో పచ్చగా కన్పించినప్పటికీ మొత్తముమీద శుష్కప్రాయమైన, లేక చిట్టడవుల మయమైన గుట్టలతో, మిట్టలతో నిండివుంటుంది పైకి చూడటానికి. కాని భూగర్భంలో ఎన్ని ధనరాసులు, ఎన్ని కుబేరనిధులు ఏ రూపంలో విద్యమానములై వున్నదీ తెలియదు. ఇప్పుడీ బండల

కొండ లగుపడే ప్రాంతాలన్నీ అజీవిక యుగము (Azoic Age) నకు చెందిన వనీ, మొదలు భూగర్భమందే పాషాణ రూపమున నుండిన వనీ, యుగయుగాంతరాలు గడచిన కొలదీ వర్షాతప వాతముల రాపిళ్ల ప్రభావమువల్ల చుట్టూ క్రమ్ముకొనివుండే మృదు పదార్థములు విశీర్ణములైపోవ, బండ లరిగి గుండ్రములై ఈలాటి కొండ లేర్పడిన వనీ భూగర్భ శాస్త్రజ్ఞుల మతము. అందుకు నిదర్శనంగా రైళ్లమీదగాని, ట్రంకు రోడ్లమీదగాని ప్రయాణంసాగిస్తూ పర్వతప్రాంతముల గుండా పోవలసి వచ్చినప్పుడు కొండలను తొలిచి వేసిన దొనలలో కనుపించే రాతి చట్టుపుల వల్ల భూగర్భంలో ఎంత పాషాణమయభాగం విస్తరించి వుందో మన మూహించి తెలుసుకోవచ్చు. ఆరోగ్రాణం, కొల్పాడులనుండి ఆరంభమై గుడియాత్తంనుంచి మితిమీరి పెరిగిందీ మెట్టసీమ.



మైసూరులో శ్రీ చాముండీ దేవాలయము.



నంజనగూడునందలి నంజుండేశ్వరాలయము.

మర్నాడు ప్రొద్దున ౯ గంటలకు బెంగుళూరు మైసూరు మీటర్‌గేజ్ రైలెక్కాం. సాయంకాలం స్కూలువదలంగానే ఇండ్లకు పరిగెత్తే బాలకుల మాదిరి కొంతసేపూ, నిండుచూలాలి మందగమనంతో కొంత మేరా చిన్నరైలు కదం. సుమారు ౧౨ గంటలు దాటుండవచ్చు-ఇదుగో కావేరీ అన్నారు నా యీ యాత్రకు కారకులై నాతో కూడా వస్తున్న ముత్తుస్వామయ్యరుగారు. చప్పున తిరిగి చూసే సరికి రాతి చట్టునలు కన్పించాయి. బాగా పరికించినమీద వాటి మధ్యగుండా జలం పారుతూ వుండటం గోచరమైంది. పల్నాటి, వినుకొండసీమ నదులు జ్ఞాపకానికి వచ్చాయి. శ్రీరంగపట్నం స్టేషను చేరాం.

ఆ పేరు వినేసరికి చారిత్రకవిషయా లెన్నో వక్కమారుగా మనోరంగంమీద తాండవించాయి. అప్పుడప్పుడే మన నేలమీద పాదాలు మోపి వాటిని

# శృంగేరీ సందర్శనము

స్థిరంగా నిలవ ద్రొక్కుకోడానికి మన ప్రస్తుత పరిపాలకులు కొంతకాలం జుట్టుపిలకలకు నూనెలు రాసీ, కొంతకాలం గడ్డాలను దువ్వీ సామాన్య ప్రజకు గగన నిర్మిత ప్రాసాదాలనుజూపిస్తూ వాళ్లనెట్లా లోబరచుకొంటూ వచ్చిందీ ఇత్యాది ప్రసంగాలన్నీ మనోవీథిలో బలిసమలాట లాడాయి. టిప్పుసుల్తాను బ్రిటిష్ జోదులతోనో, లేక మిత్రమండలికి తోడ్పడవచ్చిన స్వసోదరులతోనో పోట్లాడుతూ దుర్గద్వారం మీద భౌతికశరీరం విడిచాడన్న సంగతి జ్ఞాపకం వచ్చేసరికి మనస్సు చివుక్కుమంది. 'ఈశ్వరేచ్ఛ' యనే మన చరమసిద్ధాంతం ఇంతలో మెరుపులాగు తళుక్కుమని మనస్సు నావరించిన అంధకారభావాలన్నింటినీ పటాపంచలు గావించింది. తరువాత కావేరీ తూర్పు శాఖ నుత్తరించి చాముండీపర్వతమందిర గోపురదర్శనంతోపాటు ఒంటిగంటకు మైసూరు చేరాం. అక్కడనుంచి మైసూరు చామరాజనగర్ బ్రాంచి లైనుమీదుగా ౩ గంటలకు నంజనగూడ్ చేరాం. ఇక్కడ కపిలనదీ తీరంలో నంజుండేశ్వరాలయ ముంది. నదిలో స్నానంచేసి ఈశ్వరదర్శనం చేసినవారికి సమస్తచర్మ సంబంధి రోగాలూ నశించి పోతవంటారు.

బెంగుళూరునుంచి హుబ్లీ, ధార్వాడ, బెల్గాంములమీదుగా పూనాకు పోయే యం. యస్. యం. మీటరుగేజ్ మెయిన్‌లైనుమీద 'బిరూరు' అనే జంక్షన్ ఉంది. అక్కణ్ణుంచి 'తర్కేరీ'కిగాని, 'షిమోగా'కుగాని బ్రాంచిలైను రైలుమీద పోయి అక్కడనుంచి కాలినడకనో, బండ్లద్వారానో, బస్సులమీదనో శృంగేరీ కెళ్లాలి. దక్షిణపశ్చిమంగా సుమారు ౫౦ మైళ్లు. ఉత్తరపశ్చిమంగా ఇంతకు ౧౫ మైళ్లెక్కువ దూరంలో ప్రపంచఖ్యాతి వడసిన జెరసొప్పా (Gersoppa falls) లేక, జోగప్రపాతమున్నదట. వర్షాకాలంలో తప్ప తక్కిన సమయంలో అది అంత దర్శనీయం కాదంటారు.

నంజనగూడునుంచి మైసూరికిమళ్లీ వచ్చి అక్కడనుంచి ఒత్తి గంట బండిలో బయలుదేరాం. ౮, ౯ మైళ్లు గడచిన పిదప కృష్ణరాజసాగరస్టేషను సమీపిస్తున్నదనగా విద్యుద్దీపపంక్తులతో దేదీప్యమానమైన కన్నంబాడీఆనకట్ట నేత్రపర్వమొనరించింది. ఈ స్టేషను దగ్గరనే మైసూరు గవర్నమెంటువారి రాసాయనిక ఎరువులు తయ్యారుచేసే పెద్ద కర్మాగారముంది. అనంతరం చీకటి పడినందున ఎన్ని ప్రాకృతిక, కృతక దృశ్యాలను చూడలేకపోయినామో కాని తెల్లవారి ఒత్తి గంటల సమయాన భద్రానదీతీరమున భద్రావతీఅయిరన్ స్టీలుకర్మాగారాల ఉన్నతప్రాసాదాలు విద్యుద్దీపాలతో వెలిగిపడుతూ అంతరాళమందలి ఏ ఇంద్రభవనాల్లాగో కనులపండువుగావించినవి. పిదప మేము దిగవలసిన స్టేషను షిమోగా చేరేసరికి ఒత్తి గంటలు కావచ్చు. ఇక్కడనుంచి శృంగేరీవరకూ సహ్యాద్రికి తూర్పుగా నున్న మహారణ్యమార్గము. ఈమార్గమందు గలిగిన ప్రయాణానందము అనుభవైకవేద్యమే.



కన్నంబాడి ఆనకట్ట-దాని అడుగుననున్న 'బృందావన' ఆరామసీమ.

నానావిధవనస్పతిసంతతులలో భేద ముండును గాక, హిమాలయారణ్యాలూ వింధ్యాచలాటవులూ, సహ్యాద్రిపంక్తులమీది యడవులూ అన్నీ ఆనందం గూర్చేవే. కేటి యందను వాటిదే.

షిమోగానుండి బయలుదేరేసరికి ఎనిమిదిగంటలు దాటుండవచ్చు. ౫౦ మైళ్లు గడచేవరకూ ఏమంత దర్శనీయముగా లేదు. కాని ఆటుపిమ్మట నిసర్గమనోహర, గంభీరఅరణ్యానీదేవి ప్రత్యక్షమై బలిచక్రవర్తి ఎదుటి మాయామాణవకునిలాగు, సముద్రలంఘనావసరమున హనుమద్రూపములాగు పెరుగుతూపోయి తుదకు "ద్యావాపృథివ్యో రిద మంతరంహి వ్యాప్తం త్వయైకేన దిశశ్చ సర్వాః"అని విశ్వరూపసందర్శనావసరమున అర్జునుడు వచించినట్లు దశదిశలందూ మహాపర్వతారణ్యములుతప్ప వేరేమియు కన్పించలేదు. నరసింహరాజపురంమీదుగా 'కొప్పా'అనే తాలూకా పట్టణం ౧౨ దాటినతరువాత చేరాం. అక్కడ మూడునాలుగుగంటల అవకాశము లభించినందున వనభోజనానందముగూడ ప్రాప్తించినది. అనంతరం నాలుగుగంటలకు బయలుదేరి సాయంకాలానికి శృంగేరి చేరుకొన్నాము. కొప్పాశృంగేరీలమార్గం ఇదివరకు వ్రాసినదాని కెంతమాత్రం తీసిపోదు. యావన్మార్గమూ మైళ్లకొలది పర్వతపార్శ్వములు అడవుల నరికించి చేసిన కాఫీ, యుక్లిప్టసు ప్లాంటేషనులతో నిండియున్నవి. అరటి, పోకల వనాలకు లెక్కే లేదు. అవి ఈ కొండలమీద పెరటితోటలే.

ఆదిశంకరులు నాస్తికమతనిర్మూలనం చేసి దిగ్విజయం ముగించుకొన్నపిమ్మట తమ వేదాంతమత ప్రచారంకొరకు భారతవర్షంలో నాలుగుదిశలందూ నాలుగు మఠములను స్థాపించియుండిరి. ఉత్తరమున హిమాలయాలమధ్య బదరీనారాయణక్షేత్రమునకు నలువదిమైళ్లు దిగువ అలకనందానదీతీరమున జ్యోతిర్మఠమూ(ఇప్పుడిది జ్యోషీమఠమని పిలువబడుతూ వుంది), తూర్పున సముద్రతీరమున పురీక్షేత్రమునందు గోవర్ధనమఠమూ, దక్షిణమున సహ్యాచలసానువులందు తుంగానదీతటమున శృంగేరీమఠమూ, పడమట సముద్ర తీరాన ద్వారకామఠమూ. ఈ నాల్గింటిద్వారా వేదమతపునరుద్ధారణం కావలెననేవారి శుభసంకల్పం నేటికీ నెరవేరుతూనేవుంది. దక్షిణాన్నుంచి ఉత్తరంగా పారుతూవచ్చిన తుంగనది శారదాదేవాలయాదులు గల పర్వతమును తగిలి పూర్వగామియై రెండు ఫర్లాంగులుమాత్రమే చని పునః ఉత్తరముగా ఒక్క మైలువరకూ శృంగేరీప్రక్కగా ప్రవహిస్తూపోయి మరల తూర్పుగా తిరిగి ఇటులే వంకరలు పెట్టుకొంటూపోతుంది. ఇక్కడి చుట్టుప్రక్కల పర్వతాలన్నీ అంత మరీ ఎత్తయినవికావుగాని మనుష్యులు ప్రవేశించజాలనంత దట్టముగా అల్లిబిల్లిగా పెనవైచుకొనిపోయిన మహావృక్షములతో నిండియున్నవి. ఈ నది పుట్టుకనుగురించి ఒక చిన్న పురాణగాథ కలదు.

పూర్వ మొక దానవుడు భూమిని పాతాళమునకు గొంపోవ విష్ణువు వరాహావతార మెత్తి సముద్రమున మునిగి తన రెండు దంతములతో పైకెత్తుకొని వచ్చి ఒక పర్వతముమీద విశ్రమించియుండగా ఒక దంతమునుండి స్వేదం వెలువడి ప్రవహించి తుంగగా పరిణమించెనట. కుడిదంతమునుండి భద్రనది పుట్టెనట. ఈరెండూ కలిసి తుంగభద్రయై సుమారు ౪౦౦ మైళ్లు ప్రవహించి కృష్ణలో లీనమైనవి. ఇందువల్ల కృష్ణ మనకు అతిపూజ్యమైనదీ, పావనమైనదీ. మహాకవి కాళిదాసు మేఘదూతలో "దేవదారువిగుళ్లను త్రుంచి వాటినుండి కారే పాలవాసనలతో కూడుకొని దక్షిణదిశను వీచే వాయువులను నే నాలింగనం చేసుకొని ఆనందిస్తుంటాను. ఇవి నీశరీరాన్ని స్పృశించివుంటా" యని యక్షుని నోట పలికిస్తాడు. అట్లాంటప్పుడు శారదాంబాభిషేకజలపవిత్రీభూతతుంగానదీసలిలాంశములు గల కృష్ణానదీస్నానంచేత మనం పావనులమైనట్లు ఎందు కానందింపగూడదూ? అది అట్లా ఉండగా ఆంధ్రుల సత్కీర్తిని ఆచంద్రతారార్కము గావించిన విజయనగరరాజ్యసంస్థాపనమునకు కనకవర్షము గురిపించి ద్రవ్యసహాయ మొనరించిన పుణ్య

# శృంగేరీ సందర్శనము

మూర్తి విద్యారణ్యులవారు ఈశృంగేరీమఠాధిపతు లలో ౧౨-వ వారు. కావున ఏవిధంగా చూసినా శృంగేరీవర్ణనం మన ఆంధ్రుల కవశ్యకర్తవ్యం.

రామాయణమున ప్రసిద్ధి కెక్కిన ఋష్య శృంగాశ్రమ మిదియే. శృంగగిరిశబ్దము శృంగేరిగా పరిణమించినది. ఆ కాలమున కొందరు ఋషులిచట సత్రయాగము కావించిరట. ఆ సందర్భములో తైలాది నిషిద్ధదానములను స్వీకరించుటకు ఎవరును దొరక కుండగా ఒక మలయాళ బ్రాహ్మణు డందుకు సమ్మతించి వచ్చి దానముబట్టెనట. ఆ దోషమున నతనికి బ్రహ్మరాక్షసరూపము కలిగెను. అంత నతడు దుఃఖితుడై తన గతి యేమని ఆ ఋషులనే యడుగగా వారాతనికి 'ఆకామావై' యను పదము నిచ్చి దాని నుచ్చరిస్తూ కూర్చుండ మనియు, ఎవ రెప్పుడు దాని యసలు అర్థమును చెప్పుదురో అప్పు డతని పాప పరిహార మగుననియు చెప్పిపోయిరట! అత డట్లే ఎంతో కాలము దాని నుచ్చరిస్తూ కూర్చుండగా శంకరుల వారచ్చటికి పోయినప్పు డది విని ఆ=ఆశ్వయుజ మనీ, కా=కార్తీక మనీ, మా=మార్గశీర్ష మనీ, వై=వైశాఖ మనీ, ఆయా నెలలలో అచటి తుంగనదిలో స్నాన మాడినవారికి సకల విధ పాపమోచనము కలుగు నని చెప్పగా అత డట్లేచేసి పాపవిముక్తు డయ్యెనట. ఆ స్థలమున నిప్పుడు మలయాళబ్రహ్మమందిర మని ఒక చిన్న గది కలదు. అం దొక భయము గొలుపు విగ్రహము కలదు. శృంగేరికి వచ్చు యాత్రికులందరూ ఆ మూర్తిని దర్శించి తీరవలెనట. అన్యథా యాత్రా ఫలము నొందరట. బ్రహ్మమందిరమునకు ఉత్తరంగా రామమందిర మున్నది. ఈ ఊరిలోని బాలబాలిక లందరూ ఇక్కడ రామభజన మారంభించి శారదాదేవి నారాధించి అక్కడనుంచి ఊరంతటా తిరుగు చుందురు.

ఇక్కడి ప్రాకృతికసౌందర్యమే గాక శంకరుల వారిచట మఠమును స్థాపించుటకు మరిఒక ప్రచలిత గాథయు గలదు. దిగ్విజయానంతర మీ త్రోవను పోతూ ఆచార్యులవారు ప్రస్తుతం శారదామందిర మున్నచోట మిట్టమధ్యాహ్నపు టెండకు సహించలేక ఒక కప్ప బాధపడుతూ వుండడమూ, ఒక మహా నాగేంద్రము తన ఫణామండలపు ఛాయతో దానిని కాపాడుతూ వుండటమూ చూసి ఆశ్చర్యము నొందిరట. ఇంతకు మించిన అద్వైతసిద్ధి ఏమున్నది? "సర్వంఖల్విదం బ్రహ్మ" "అవిభక్తంచ భూతేషు విభక్తమివచ స్థితం" ఇత్యాది వాక్యాలకు నిదర్శనం ప్రత్యక్షంగా కన్పిస్తున్నది. ఖాద్య, ఖాదకాలు రెండూ ఇంత ఐకమత్యం కలిగివుండటం స్థలమాహాత్మ్యమని స్మరించి అప్పుడే అక్కడ శారదాదేవిని స్థాపించిరట. ఇప్పు డిచట కప్పేశ్వరు డని మహాదేవారాధన సైతం జరుగుతూవుంది.

శృంగేరీమఠస్థాపనానంతరం నేటి ముప్పది రెండుమంది గురువు లా స్థానాన్ని అలంకరించారు. వారిపే ర్లివి :

౧. శ్రీశంకరాచార్య; ౨. సురేశ్వరాచార్య; ౩. బోధజ్ఞాన; ౪. జ్ఞానఘన; ౫. జ్ఞానోత్తమ; ౬. జ్ఞానగిరి; ౭. సింహగిరీశ్వర; ౮. ఈశ్వరతీర్థ; ౯. నరసింహతీర్థ; ౧౦. విద్యాశంకరతీర్థ (లంబికాయోగి); ౧౧. భారతీకృష్ణతీర్థ; ౧౨. విద్యారణ్య-విద్యానగరకార, వేదభాష్యకార; ౧౩. చంద్రశేఖర భారతి; ౧౪. నరసింహభారతి; ౧౫. శంకరాచార్య; ౧౬. పురుషోత్తమభారతి; ౧౭. చంద్రశేఖరభారతి; ౧౮. నరసింహభారతి; ౧౯. పురుషోత్తమభారతి; ౨౦. రామచంద్రభారతి; ౨౧. నరసింహభారతి; ౨౨. నరసింహభారతి; ౨౩. అభినవనరసింహభారతి; ౨౪. సచ్చిదానంద - స్తంభే హేరంబదర్శక; ౨౫. నరసింహభారతి; ౨౬. సచ్చిదానందభారతి; ౨౭. అభినవ సచ్చిదానంద భారతి; ౨౮. నరసింహభారతి; ౨౯. సచ్చిదానంద భారతి; ౩౦. అభినవ సచ్చిదానందభారతి; ౩౧. నరసింహభారతి; ౩౨. సచ్చిదానంద శివాభినవనరసింహభారతి.

వీరిలో ౧౦-వ పీఠాధిపతులగు విద్యాశంకరులు విజయనగరసంస్థాపనకు తమ సర్వస్వమునేగాక తమ రాజనీతిచాతుర్యమునుగూడ అర్పించి, కాలాంతరమున వేదభాష్య మొనరించి, ఆచార్యప్రఖ్యాతిని గడించిన విద్యారణ్యులవారి గురువులు. వీరు (విద్యాశంకరులు) విరూపాక్షమునందు తుంగభద్రాతీరమున లా మఠములను స్థాపించి అం దొకదానికి విద్యారణ్యుల నధిపతుల గావించిరి. విద్యారణ్యులు విజయనగరరాజ్యం స్థాపితమైనపిమ్మట శృంగేరీపీఠమునకు ౧౨-వ గురువులైరి. విద్యాశంకరులవారి ఆరాధనమందిర మిపుడు శారదామందిరానికి కుడివైపున దక్షిణపూర్వంగా గలదు. అదియు ఇంచుమించుగా శారదామందిరమువలెనే ప్రఖ్యాతికెక్కినది. హైందవశిల్పశాస్త్రము ననుసరించి శైవాగమవిధులప్రకారం కట్టబడినది. అందు ప్రతిరోజూ శివలింగమునకు ఆరాధనము జరుపబడుచుండును. ఈ విషయమున నొక్క గాథ కలదు. విద్యాశంకరులాకాలమున ౧౫ సంవత్సరములు యోగ మభ్యసించి వచ్చిన లంబికాయోగులట. వీరు మందిరంలోపల గూర్చుండి తల్పులన్నింటినీ మూయవలసిన దనియు, ౧౨ సంవత్సరములవరకూ తెరవవలదనియు శిష్యులకాజ్ఞ ఇచ్చిరట. శిష్యులు అటులే కావించిరి. కాని 3 సంవత్సరములు గడచినపిదప మనసుపట్టజాలక తలుపులు తెరిపించగా అందేమియు గన్పించలేదు. ఆరాత్రే విద్యాశంకరులు తమ రెండవశిష్యుడగు భారతీకృష్ణతీర్థులవారికి కలలో గన్పించి అందొక శివలింగమును స్థాపించవలసిన దని చెప్పిరట. వారట్లే గావించిరి. దానికే ప్రస్తుతము పూజాపురస్కారములు గావింపబడుచున్నవి. ఈ ౧౦, ౧౧, ౧౨ పీఠాధిపతుల కాలమందే శృంగేరీపీఠస్థానము సంస్థానములో సంస్థానమైనది. పీఠాధిపతులకు బిరుదులూ, రాజలాంఛనములూ (కిరీటఛత్రచామరాదులు) లభించినవి. విజయనగరరాజులు స్వయముగా శృంగేరి దర్శించి గ్రామాదులు దానముగావించిరి. ఏరాజు ఏకాలమున నెట్టి దానములుచేసినదియూ వారప్పుడు చెక్కించిన శాసనతామ్రఫలకము లిప్పటికిని గలవట. ఎన్నిరాజ్యములు మారినను అవి అప్పటిలాగే ఇప్పుడూ చెల్లుబడిఅవుతూవున్నవి. శారదాదేవి దేవాలయమునూ ఆకాలమందే పునరుద్ధరింపబడి ఇప్పుడున్న రీతిగా నిర్మింపబడినదట. దేవాలయం నల్లపాలరాతితో గట్టబడినది. అద్దమువలె తళతళలాడుతూవుంటుంది. ఈగర్భగుడిచుట్టూ కందకము ఏర్పడులాగున నాలుగువైపులా ఉన్నత స్తంభములపై మంటపప్రాకారములు గలవు. ఈకందకము ప్రదక్షిణముసేయుట కుపయోగించును. శ్రీశంకరులవారు చందనకాష్ఠనిర్మితమూర్తిని స్థాపించిరటగాని ఇప్పటి విగ్రహం పంచలోహనిర్మితం. వివిధరత్నఖచితసువర్ణభూషణాలంకృతం. విలువకట్టరానిది. నిత్యనైమిత్తికాదిఅర్చనలూ, ఆరాధనలూ సరే ప్రతిశుక్రవారం రాత్రిపూట సువర్ణనిర్మితమైన దేవీఉత్సవవిగ్రహాన్ని వెండిరథముపై గూర్చుండబెట్టి గ్యాసులైట్లతో గుడిచుట్టుకొనియున్న కందకముగుండా ఊరేగింతురు. ౫౦, ౬౦ మంది ఏతత్స్థానాశ్రయులగు విద్యార్థులూ, వారి గురువులూ వేదమంత్రములను పఠిస్తూ స్వయంగా రథమును లాగుదురు. ఈ పరిక్రమోత్సవము హరిద్వారమందలి బ్రహ్మకుండమీది గంగాదేవీ దీపార్చననుబోలి బ్రహ్మానందమొనగూర్చుచు చూపరులను తన్మయులనుగావించును. ఈయావరణమందే గురుకులమును, పుస్తకశాలయు, పాకశాలాదులును గలవు. ఇంచుమించుగా ౫౦, ౬౦ మంది విద్యార్థు లుందురేమో. ప్రాచీనాచారముల ననుసరించి తర్క, వ్యాకరణ, వేదాంతాదిశాస్త్రములు నేర్పబడుచున్నవి. కాని మన యనేకవిద్యాసంస్థలవలెనే ఇదియు సాగుచున్నది. ఆధునికవిశ్వవిద్యాలయములవలె లేదు. ప్రాచీనవిద్యలకూ, ఆధునికవిద్యలకూ గల సామ్యమూ, తారతమ్యమూ పరిశోధించి ఏర్పరించగల పరిశోధకశాల లిట్టిప్రదేశములందు నెలకొల్పబడియుండినచో జనోపకృతి ఎంతగా గలిగియుండెడిదో ఊహింపవలనులేదు.

# శృంగేరీ సందర్శనము

తుంగానది కవతలితీరమున పీఠాధిపతుల నివాసార్థము భవనములుగలవు. ఈప్రదేశమునకు నరసింహవనమని పేరు. ఈ ఆరామమున సంపెగచెట్లధికము.

"భాగీరథీనిర్ఝరశీకరాణాం
వ్యూఢా ముహుఃకంపితదేవదారుః"

అని కవిసార్వభౌముడు వర్ణించినట్లు

"తుంగానదీనిర్మలశీకరాణాం
వ్యూఢా చలచ్చంపకపుష్పగంధీ"

కాని మృగాలను వేటాడిన హింసకుల స్వేదసలిలము లార్పుటకుగాదు దేవీదర్శనార్థమేతెంచిన యాత్రికబృందాల స్వేదకణము లార్పి వారి యలసట బోదోలుటకు సుగంధవాయువు వీస్తూఉంటుంది. ఈ వనమధ్యభాగమున సచ్చిదానందశివాభినవనరసింహభారతులవారి ఆరాధనమందిరము కలదు.

ప్రస్తుత మీమఠాధిపతులుగ నున్నది శ్రీ చంద్రశేఖరభారతీస్వాములవారు. వీరు వయోవృద్ధులు. వీరికి సీనియర్‌స్వాము లనియు పేరు గలదు. వీరు తమ అనంతరపీఠాధిపతిని స్వయముగ నియోగించి వున్నారు. వారి శుభనామధేయము శ్రీ అభినవవిద్యాతీర్థస్వాములవారు. వీరిని జూనియర్‌స్వాము లనియు పిలుచుటకలదు. వీరి మందహాసం దర్శనీయము. శరచ్చంద్రికాతుల్యము. రెండుమూడు నిముషములే వారితో సంభాషించు భాగ్యము కలిగినను వారి ఆంతర్యము గుర్తించుటకు వలనుకలిగినది. సంస్కృతపరీక్షలకు హాజరగు విద్యార్థులకు వీరు సాయమొనరించుచుందురట. వయోవృద్ధులైనందున సీనియరుస్వాములు పేరుకు ఉన్నప్పటికీ తక్కిన యాశ్రమకార్యములన్నింటినీ వీరే నిర్వహించుచుందురు.

భారతవర్షమందలి ఏక్షేత్రమునకు బోయినను వందలకొలది భిక్షుకులు మొదట దర్శనమిచ్చుట చాలామంది ఎరిగిఉన్నదే. కాని యీక్షేత్రములో ఒక్క భిక్షుకుడైన కన్పించకుండుట గొప్పవిశేషము.




సమయానుకూలత

# హృదయావేదన

**శ్రీ సత్యదుర్గేశ్వర కవులు**

[అతడు శ్రీ వీర వెంకటపతిదేవరాయలు. 1614 క్రీ. శ. వరకు నిరుపమప్రౌఢి రాజ్యము చేసిన శ్రీమదాంధ్ర చక్రవర్తి. ధర్మపత్నులు ఆరుగురు. అయినను అనపత్యుడు. పెద్ద భార్య ఓబాంబిక: జగ్గరాయని పుత్రిక. ఒక బ్రాహ్మణ శిశువును తనకు జనించినట్లు ప్రకటించి పెంచి పెద్దచేసినది. ఆమెయందలి ప్రేమాతిరేకమున మహీపతి అడ్డు చెప్పడు. కాని అంత్యఘడియలలో రాజ్యము సోదరీసుతునకు ప్రసాదించును. అతడు శ్రీరంగదేవరాయలు. జగ్గరాయలు దౌష్ట్యమున రాజ్యమాక్రమించి వానిని సకుటుంబముగ జంపించును. కాని ఆతని సుతుడొకడు మిగిలిపోయెను. ఏచమసేనాని వాని తరపున యుద్ధము ప్రకటించును. అతడు రాజభక్తుడు. అది జగ్గని ఆవేదనకు పునాది.]

జగడ మొనర్చి ఏచముని జంపుటయో, కికురించి స్వీయ ప
క్షగు నొనరించుటో, ఎదియొ సాగినయుండెడి దింతవట్టు గ
ట్టిగ ఇటువైపు నిల్చి పురడించిన ఆదొర లిప్పు డన్యప -
క్షగతులు కాకయున్న; ఇక, కష్టమె పో; దిగజోప శాత్రవున్.

కడు విషమించె ఈ చివరికాలము; నే డెది సేయబోయినన్
జెడుగులె తారసిల్లెడు; వజీరుల జూచినవారలెల్ల ఒ
త్తిడి కలిగించి పోయిరటు; దేశము చూడ, అరాజకంపుటా
గడముల దోగె; అంతయును, కష్టమ కన్నులు విప్పి చూచినన్.

త్వరపడి; ఱేని వాని గృహవర్గము నొంచి వధింపబంచి ము
ష్కరు డనిపించుకొంటి; అటు జల్పక ఎప్పటియట్ల వారలం
దరు చెరయంద యున్న వసుధాపతు లెల్లరు ఇందె యుండియుం
దురుకద; కష్టకాలమున దోచదుపో వెర వెంతవారికిన్.

వెనుక కేగిన నుయ్యి, ముందునకు జనిన - గొయ్యి అను సామెతకు నేడు గోడివడితి
ఒకడనై పోతి, లేదు సాయుజ్యము; మరియు- అన్ని విధముల బలశాలి యయ్యె దూదక.

పాయని బాధ్యతన్ మొనయువాడు, స్వామిమ్ముగ తండ్రి, అప్పు డా
పోయిన నేత; ఆతనికె పుత్రునిపై మొగచాటు తోప; ఏ
దోయొక యింత తాతనయియుండిన నా, కితడన్న ఇంత ఆ
ప్యాయ మిదేల? మిట్టిపడి ఆరని పాపము జోకచేసితిన్.

నలుగురిలోన ఆవిగొనినాడ, నృపాలుని దత్సమస్తమున్
గలచి చెరన్ విధించి మొనకట్టి తుదన్ బొలయించి నేడు భూ
తలమున; ఇంక, ఈతనువుదారిన పిమ్మట దైవ మెట్టి శి
క్షలు విధియించునో; ఉరక సర్వవిధంబుల మాసిపోయితిన్.

ఎవ్వరోయొక రిల మొగరించి ఏలు-కొనిన, ఏలుకోనీక; ఈగొడవ లెల్ల
బెనిచి అంతటి సార్వభౌమునకు మామ - నయ్యు, ఆఖర కపకీర్తి కగ్గమైతి.

# చీకటి వెలుగులు

[ కథానిక ]



శ్రీ జి. యజ్ఞ. సూరి

శివాలయము కట్టటం పూర్తికాగానే ప్రాకారాలు ప్రారంభించారు. కూలీలు గోడ పునాదులకు ధిమ్మిసా కొడుతూ, ఆదెబ్బలనే తాళంగా చేసి పాట పాడుకొంటున్నారు. అప్పుడు దారిచూపుతూ ఉంటే మిగతావాళ్లు వంత పలుకుతున్నారు.

"కందిరీగనడుముదాన్ని"—

ఎట్టా పోనిత్తురా!

"వాలుచూపుకళ్ల దాన్ని"

ఎట్టా పోనిత్తురా!

"పికిలిపిట్ట గొంతుదాన్ని"

ఎట్టా పోనిత్తురా!

"చింతపువ్వురంగుదాన్ని"

ట్టా పోనిత్తురా!

"అట్టాటిట్టాటిదాన్ని"

ఎట్టా పోనిత్తురా!

ఇంతలో మేస్త్రీ వచ్చి "పన్నెండు కొట్టారు. పని ఆపి అన్నాలకు పొండి" అని కేక వేశాడు; కూలీలు అందరూ పునాదిగోతులనుంచి బయటికి వచ్చి బావిదగ్గరకు వెళ్లారు.

అప్పుడు బావిదగ్గరకి వచ్చేసరికి మాలక్ష్మి బుంగతో నీళ్లు పట్టుకుని నిల్చున్నది. ఆపిల్ల నీళ్లు పోస్తూఉంటగా చేతులూ, కాళ్లూ కడుక్కుంటున్నాడు అప్పుడు.

"ఏం మాలచ్మీ! గానిగెలో నీలు పోశావా?" అన్నాడు.

"ఆ, పోశా. సున్నానికి తొండికూడా కట్టాను." అన్నది.

పైటచెంగుతో ముఖం తుడుచుకుంటూ అప్పడూ, కడవ చంకన పెట్టుకుని మాలక్ష్మి బావిదగ్గరనుంచి ప్రక్కగానే ఉన్న మఱ్ఱిచెట్టుకిందకి వెళ్లారు.

చెట్టునీడన కూలీలు అందరూ తలాఒక చోట కూర్చుని అన్నం తింటున్నారు. మర్రిఊడకు కట్టిన రెండు మూటలు అప్పడు ఊడతీసి ఒకటి మాలక్ష్మికి ఇచ్చాడు. ఎవరి మూట వాళ్లు ముందుపెట్టుకొని తినటం మొదలుపెట్టారు.

"ఏం మాలచ్మీ! మీఅక్కేను

అన్నాడు తింటూ.

"అడిగా."

"ఏమన్నది?"

"అప్పన్న నెందుకే సేసకోటం? ఆడికి ఆ కొంపతప్ప గొడ్డూ గోడా ఏమీ లేదుగంద. రామయ్య కొడుకు చుబ్బన్నకు ఇయ్యమంటూ మొన్న ఆళ్ల అమ్మ అడిగిపోయిందే అన్నది."

"మరి నువ్వేం సెప్పావు?"

"చుబ్బయ్యా, గిబ్బయ్యా నేను. శేసకోను; అప్పయ్యను కాదంటే నాకు ఓరూ అక్కర్లేదన్నాను. అప్పుడు మాఅక్క అన్నదిగందా, మాకమాసం వచ్చిందాకా పెళ్లిసంగతి ఎందుకులే, అప్పుడు సూసుకుందాంలే అన్నది"

"ఊఁ." అంటూ అప్పయ్య లేచి నిలబడి గిన్నెల్ని తిరిగి మూటకట్టి చెట్టుకు వేలాడేశాడు.

"ఇయ్యాళ నువ్వు నీలు పొయ్యాల్సింది ఏ రమ్మలో ?" అని అడిగాడు అప్పడు.

"ఆ శివరిదాంట్లో" అన్నది మాలక్ష్మి.

"అయితే రా ; నాలుగుబుంగలు లాగి ఇత్తాను, పోసొత్తువుగాని."

"నే సేదుకుంటాలే."

"నీసేతులు సూసుకో ఎట్టా కాయలు కాశి నయ్యో. దబ్బున రా ; మల్లీ నేను థిమ్మిసాకు పోవాలి" అన్నాడు.

ఇద్దరూ బావిదగ్గరకు వెళ్లారు. అప్పడు తోడ బోతుంటే మాలక్ష్మి తోడుబట్టబోయింది. "అక్కర లేదులే. అవతలఉండ"మని చకచక నీళ్లు లాగి బుంగలకు పోస్తున్నాడు. మాలక్ష్మి రమ్మ నింపింది.

అప్పడు పనిలోకి పోతూఉండగా "ఇయ్యాల్టి నుంచి గుళ్లో దేవుడికి దణ్ణం పెట్టుకోవచ్చుగదూ" అన్నది మాలక్ష్మి.

"ఆ. మంత్రాలూ గింత్రాలూ పొద్దునే అయి పోయెగా."

"అయితే రాత్తిరికి బువ్వ తిని ఈడకు ఒకసారి ఒత్తావా ?"

"ఎందుకు ?"

"సెపుతాగా"

"సరేలే" అని పునాదులలో దిగాడు.

....................

రాత్రి పది కావచ్చింది. గుడిదగ్గర అంతా మాటుమణిగి ఉన్నది. దేవుడిముందు దీపారాధనతప్ప ఆ ఆవరణంలో దీపంగూడా లేదు.

ముందుగా గుళ్లోకి చేరుకున్నాడు అప్పడు. గర్భగుడికి చువ్వల తలుపులు బిగించి ఉన్నవి. నంది విగ్రహాన్ని నిమురుతూ దేవుడివంక చూస్తూ లబడ్డాడు. ఇక్కడికి ఎందుకు రమ్మన్నదీ పాలుపోవటంలేదు.

ఇంతలో మాలక్ష్మికూడ అక్కడికి వచ్చింది. చేతిలో ఒక కొబ్బరికాయా, ఒక చిన్న పొట్లం ఉన్నవి.

"ఏం మాలచ్మి ! వచ్చావూ ! అయ్యేందుకోయ్ ?" అన్నాడు.

మాలక్ష్మి ఏమీ మాట్లాడకుండా పక్కగా ఉన్న విభూతితొట్టిలో చెయ్యిపెట్టి ఇంత విభూతితీసి ముఖానికి రాచుకున్నది. చేతిలో ఉన్న చిన్నపొట్లం విప్పి కుంకం తీసి బొట్టు పెట్టుకున్నది. అప్పడుకూడ అదేవిధంగా చేశాడు. నిలుచున్న చోటనే తపీమని కొబ్బరికాయ పగలగొట్టింది. గర్భగుడి మెట్టు మీద ఆ కాయను వుంచి, దణ్ణంపెట్టుతూ నిలబడ్డది. అప్పడుకూడా అట్లాగే ప్రక్కన నిలుచున్నాడు.

"సామీ, బాలకోటేశుడా ! నన్నూ నా అప్పడినీ రచ్చించు. నేను ఈ అప్పన్నతప్ప ఇంకోరిని పెల్లాడను. సత్తెప్రమానంగా సెపుతున్నా. మా అవ్వ మా పెల్లికి ఒప్పకునేట్లు బుద్ధిపుట్టించు ఓ దేవుడా ! శివరాత్తిరికి ముడిపడాలని దీవించు సామీ!" అని మాలక్ష్మి ప్రార్థనచేసింది.

ఇది వినేసరికి అప్పడికి కళ్లలో నీళ్లు తిరిగినవి. వణుకుతున్న గొంతుతో "సామీ ! ఈ లోకంలో ఈ మా లచ్మితప్ప నాకు వోరూ లేరు. ఈ మాలచ్మే నాకు ఇంటిది కావాలి. మా మీన దయచూడు భగవంతుడా. మే మిద్దరం నీ గుడి కట్టినోళ్లం. మమ్మల్ని గూడ ఒక ఇంటివోళ్లనుగా సేసి రచ్చించు దేవుడా" అన్నాడు.

ఇద్దరూ చెంపలు వాయించుకుంటూ బయటికి వచ్చారు. గుడిమెట్లమీద కూర్చున్నారు. చెరి ఒక కొబ్బరిచిప్పా తీసుకొని నెమ్మదిగా తిన్నారు. తినటం పూర్తికాగానే బయలుదేరారు. "ఈ గోడకట్టటం ఇంకా ఎన్నాళ్లపడుతుందో ?" అన్నది నడుస్తూ మాలక్ష్మి.

"మళ్లీ వచ్చే అమావసికి పని పూర్తిఅవుద్ది."

"ఆమైన నువ్వు ఇంకేపనికో పోతావు కామాలు"

"రోడ్డుకి దగ్గిరగా ఇసుకోలుబడి కడతారంట. మనిద్దరికీ అడ పని దొరకొచ్చు."

"ఏమో, ఏం దొరుకుద్దో! నువ్వోసోటా, నేనోసోటా సెయ్యాల్సిఒత్తే ఎట్టాగా అని గుండెలో గుబులుగా ఉంటుంది."

"మన ప్యాప్తం ఎట్లా వుంటే అట్టా జరుగుద్ది. నువ్వుమాత్రం మాఅవ్వకు నచ్చచెపుతూఉండు."

"అది నువ్వు చెప్పాలా! ఇక నేను ఇంటికి పోతా"అన్నది.

ఒక నిమిషంసేపు ఇద్దరూ మాట్లాడకుండా నిలబడ్డారు. "సరే ఎల్లు"అన్నాడు అప్పడు. ఎవరి ఇంటికి వాళ్లు వెళ్లిపోయినారు.

శివుడి గుడిపని పూర్తికాగానే ఆవూళ్లో జిల్లా బోర్డుమిడిల్‌స్కూల్‌బిల్డింగు కట్టటం మొదలు పెట్టారు. అనుకొన్నట్లుగానే అప్పడికీ, మాలక్ష్మికీ అక్కడ పనిదొరికింది. ఎప్పటిమాదిరి ఆడుతూ పాడుతూ ఒకరి కొకరు చేదోడువాదోడుగా కూలిచేస్తున్నారు.

మూడునెలలయేసరికి గోడలు పైకిలేచినవి. పైన కప్పు వేయటంవరకూ వచ్చింది. కలపదూలాలు వేసి లాజు అతికే పద్ధతికాకుండా సిమెంటుకాంక్రీట్ శ్లాబ్ వెయ్యవలెనని నిశ్చయించారు. అందుకోసం కంట్రాక్టరు కాంక్రీట్‌మిక్సింగ్‌మెషినును తీసుకొని వచ్చాడు. ఆ మిషనులో కంకర, సిమెంటు, ఇసుక, నీళ్లు, కొన్ని పాళాలలో పోసి, ఆమొత్తాన్ని ఇంజను సహాయంతో పాకానికి వచ్చేదాకా మథించుతారు. ఈ తయారైన కాంక్రీటుముద్దను బొచ్చెలతో పైకి తీసుకొనిపోయి గోడలమీద అచ్చుగా పోస్తారు. అప్పడికి ఈ కంకరబొచ్చెలు చేరవేసే పని ఇచ్చారు. మాలక్ష్మిని కాంక్రీట్‌మిక్సర్‌లో నీళ్లుపోసే కూలీలలో ఒకతెనుగా నియమించారు.

వీరాసామి కాంక్రీట్ మిక్సర్ ఇంజనుకు డ్రైవరు. కేవలం బస్తీమనిషి. మెషీను స్టార్టుచెయ్యగానే కూలీలందరూ చుట్టూ మూగేవాళ్లు. అంతకు పూర్వం ఇటువంటి యంత్రం ఆవూరికి ఎప్పుడూ రాకపోవటాన అందరికీ చోద్యంగా ఉన్నది. నలుగురూ చూస్తూంటే వీరాసామికి అతిశయంగా ఉండి కత్తెరగిరజాలు ఆడిస్తూ, కోరమీసం సర్దుకుంటూ పటాటోపం చూపటం మొదలుపెట్టాడు. అదీగాక తక్కిన కూలీలు చొక్కాలంటూ లేకుండా, మూటలతో అన్నంతెచ్చుకొని తింటూ, బీడీలో చుట్టలో కాల్చుకుంటూ, లల్లాయిపదాలు పాడుకొంటూ పనిచేస్తుంటే వీరాసామి ఖాకీగుడ్డలు తొడుక్కొని, దసరాసిగరెట్లు కాలుస్తూ, పింగాణీటిఫిన్‌కారియరులో అన్నం తెచ్చుకొని తింటూ, సినిమాపాటలు పాడుతూ, ఆ మాయయంత్రాన్ని ఆడించుతుండేవాడు.

ఆ ఇంజనుదగ్గర పనిచేసే కూలీలుకూడ మాఅంత వాళ్లు లేరన్నట్టు ప్రవర్తించేవాళ్లు. మధ్యాహ్నం పూట అన్నం తింటూ, చుట్టూ కూలీలందరినీ కూర్చోపెట్టుకొని వీరాసామి తాను చిన్నప్పుడు ఇంటిదగ్గర నుంచి పారిపోయి రంగూను ఎట్లా వెళ్లిందీ, అక్కడ హార్బరులో పనిచేయటమూ, ఆ స్టీమర్ల రాకపోకలూ, బర్మాదేశపు ప్రజల ఆచారవ్యవహారాలూ, ఆకాశంలో తిరిగే విమానాలూ, సినిమాకంపెనీలూ మొదలైన అపరూపవిషయాలనుగురించి ఒడుపుగా డచ్చీలు కొట్టుతూ ఉంటే అందరూ నోరుతెరిచి వినేవాళ్లు. వాళ్లల్లో ఈ మాలక్ష్మి ఒకతె.

ఈ కాంక్రీట్‌మిక్సరూ, వీరాసామీ అక్కడికి వచ్చిన తరువాత మాలక్ష్మిలో కొంత మార్పు జరగటం మొదలయింది. ఒక్కపూట అయినా అప్పడిని చూడకుండా ఉండలేని మనిషి కాస్తా మధ్యాహ్నం పూట అన్నానికికూడ అతడికోసం ఎదురుచూడకుండా ఇంజనుదగ్గర కూలీలతోపాటు కూర్చోటం సాగించింది. అప్పడు అలవాటుచొప్పన ఏదైనా పనిలో సహాయం చెయ్యవస్తే నిరసనగా అక్కర్లేదని పంపేది. సాయంత్రంపూటకూడ వాడితో మంచీ చెడ్డా చెప్పకోటం

క్రమంగా తగ్గింది తక్కిన కూలీలతో పాటు చీకటిపడ్డ దాకా వీరాసామి చెప్పే రంగూన్ మైలీకథలను వింటూ కూర్చుని సరాసరి ఇంటికి వెళ్లేది.

ఇదంతా చూస్తూంటే అప్పన్నకి మనసు చివుక్కు మన్నది. మహాలక్ష్మి ప్రవర్తనవిషయంలో సంపూర్ణమైన విశ్వాసం ఉన్నప్పటికీ కష్టంగా మాత్రం తోచేది. కాని హృదయంలోని భావాలను తేలికగా వెలిబుచ్చే తరహావాడు కాడు అప్పన్న. కొత్తను చూస్తే వింత ఉండడం అందరికీ సహజమేలేనని సమాధానపరచుకొనేవాడు.

గోడలమీదికి ఎక్కి కంకర అందిస్తూ అనుకోకుండా ఇంజను వైపుకు చూసేవాడు. ఆ సమయంలో మాలక్ష్మి నవ్వుతూ మాట్లాడుతూ ఉంటే కుమిలిపోయేవాడు. ఎప్పుడూ తక్కిన కూలీలను తన పాటలతోనూ, మాటలతోనూ నవ్వుతూ నవ్విస్తూ ఉండేవాడు క్రమంగా మారిపోయి వాడిన ముఖంతో తలవంచి పని చేసుకోటం ప్రారంభించాడు.

ఒకనాటి మధ్యాహ్నం అప్పడు త్వరగా చెట్టుక్రింద అన్నం తిన్నాడు. వీరాసామి కూర్చున్న మురాదగ్గరకు వచ్చి దూరంగా చతికిలపడ్డాడు. ఆ షోకుదారుడు ఏదో సినిమా కథ చెప్తున్నాడు. "......ఆ వనదేవతను ఒక చెట్టుకింద కూసో పెట్టి కోయవాళ్లంతా చుట్టూ చిందులు తొక్కుతున్నారు. అప్పుడు ఆ వనదేవత సరిగ్గా ఆ పిల్లమాదిరి కూసుని ఉంది..." అని మాలక్ష్మిని చూపించాడు. అందరూ నవ్వారు. మాలక్ష్మి సిగ్గుతో తలవంచుకుంటూ మందహాసం చేసింది. ఈ దృశ్యం చూసేటప్పటికి అప్పన్నకి తారామండలంగా మండిపోయింది. ఏదో వేషాలేసే మనిషితో తన మాలక్ష్మిని పోల్చినందుకు వీరాసామిని గొంతుపట్టుకొని నులిమివేయాలనుకున్నాడు. ఇందుకు వాడిని అంటే ప్రయోజనమేమిటిలే అని ఊరుకొన్నాడు. అక్కడినుంచి చర్రున లేచిపోయినాడు.

ఆ సాయంత్రం కూలీలు అందరూ ఇళ్లకు పోబోయేటప్పుడు "మాలచ్మీ!" అని పిలిచాడు అప్పన్న.

"ఆఁ" అన్నది మాలక్ష్మి.

"నేనుకూడ మీ ఇంటిదాకా వస్తున్నాను, ఆగు."

"ఎందుకూ?"

"నిన్నొకటి అడగాలి."

"ఆ అడిగేదేందో ఇప్పుడే సెప్పరాదూ?"

ఇద్దరూ నడుస్తున్నారు. రెండునిమిషాలు పసాయించి అప్పన్న అందుకొన్నాడు:

"నువ్వు మునుపటిమల్లే ఉండడం లేదు ఎందుకని?"

"సచ్చేదాకా ఒకటేయినంగా ఉంటారా యేం?"

"అవును. ఉండరులే—అయితే మన పెళ్లిమాట మీఅవ్వ ఏమైనా తేల్చిసెప్పిందా?"

"నేను మళ్లీ అడిగితేగందా!"

"ఏం?"

"ఏమీ లేదు. ఉప్పుడేం తొందర?"

"మాకమాసం వత్తున్నదిగా"

"మళ్లీ రాదా యేం?"

"నీకేం దెయ్యం పట్టలేదుగందా?"

"పట్టిన దెయ్యం వదిలిందేమో."

"ఊఁ...సరే......అయితే......దేవుడిదగ్గిరి పెమానంకూడా మరసిపోతూ వన్న మాట!"

"అయ్యనీకి ఉప్పుడెందుకూ! నేను ఎల్తా."

అని మాలక్ష్మి గబగబా వెళ్లిపోయింది. అప్పడు దిగాలబడి నిలబడ్డాడు. ఆరోజునుంచి మాలక్ష్మిని పలకరించటానికికూడ ప్రయత్నించలేదు. గుండె రాయిచేసుకున్నాడు.

....................

మూడువారాలు గడిచినవి. ఒకరోజు పొద్దున్నే కూలీలు పనిలోకి వెళ్లేటప్పటికి అక్కడ కాంక్రీట్ మిక్సరు కనబడలేదు. ఆ కిందటిరాత్రి కంట్రాక్టరు

దానిని ఇంకో ఊరికి పంపా డన్నారు. దానితో పాటు వీరాసామికూడా ఎట్లా వచ్చాడో అట్లాగే వెళ్ళిపోయి నాడు. అదివరదాకా ప్రతిపూటా వాడిచుట్టూ చేరి, కబుర్లు వింటూ ఆనందించిన కూలీలే వీరాసామిని క్షణంలో మరచిపోయినారు. "చెప్పి అయినా పోలేదు, వట్టి దగాకోరు" అన్నారు. మాలక్ష్మి ఏమను కొంటున్నదీ ఎవ్వరికీ తెలియలేదు. మూకీభావంగా మాత్రం కనబడేది.

స్కూలుబిల్డింగు చాలావరకు పూర్తిఅయింది. చక్కసున్నం చెయ్యటం మొదలుపెట్టారు. మాలక్ష్మిని తిరిగి గానుగదగ్గర నీళ్లు పోయమన్నారు. అప్పడు సున్నపుబొచ్చెలు జేరవేస్తున్నాడు. ఎవరికి వారు యథోచితంగా ప్రవర్తిస్తూ, మాట్లాడేందుకైనా ప్రయత్నించటం లేదు. తక్కిన కూలీలకు ఇది ఆశ్చర్యంగా ఉండేది.

ఆనాడు మాలక్ష్మి, తానూ కలిసి గుళ్లో కొబ్బరి కాయ కొట్టినప్పటినుంచి అప్పన్న ప్రతిరాత్రీ అదే సమయానికి ఆ శివాలయానికి వెళ్ళేవాడు. దేవుడికి దణ్ణం పెట్టుకొని కాసేపు ఒంటరిగా అక్కడ జాగారం చేసి వస్తూఉండేవాడు. ఆవిధంగానే ఆరోజునకూడ గుడికి వెళ్లాడు. నందిదగ్గరకు వెళ్ళేటప్పటికి గుడిచువ్వల తలుపులనుండు ఎవరో కూర్చొని ఏడుస్తున్నట్లు కని పించింది. ఎవరా అని పరికించి చూశాడు. మాలక్ష్మి! నిజంగా మాలక్ష్మే! కాళ్లు తేలిపోయినవి. ఆ నంది విగ్రహానికి చేరగిలబడి తానూ ఒక శిలాప్రతిమవలె నిలబడిపోయినాడు. మాలక్ష్మి ఏదో మాట్లాడు తున్నది.

"సామీ, బాలకోటేసుడా! నేను ఏం పాపం చేశాను? ఎందుకిట్టా ఏడిపిస్తున్నావు నన్ను? నా అప్పడికీ, నాకూ ఇంతమారం సేశావు ఎందుకని? ఏదో మైకంలో పడ్డా. ఆ పోసికోలుకబుర్లు ఇంటుం టే నా అప్పడుకూడ ఒక మనిసేనా అనుకున్నా. సిన్నసూపు సూశా అప్పణ్ణి. నా మణుసు నాకు తెలి యక కారుకూతలు కూశా. ఆఖరికి నీదగ్గిర సేసిన పెమానంకూడ మరచిపొయ్యా. ఓ దేవుడా, నాగుండె పగుల్తుంది.—అయ్యో నా అప్పన్నా! అప్పన్నా" అంటున్నది.

ఇదంతా వింటున్న అప్పన్నకు కలగంటున్నట్టు తోచింది. తన పేరు పిలిచేసరికి అప్రయత్నంగా "ఆఁ" అన్నాడు.

మాలక్ష్మి ఉలిక్కిపడి వెనుకకు తిరిగిచూసింది. అప్పడా! అప్పడేనా? కళ్లు నులుముకుని మళ్లీ చూసింది.

ముందుకు అడుగు ఎవరు మొదట వేశారో చెప్పటం కష్టం. క్షణంలో అప్పన్నగుండెమీద తల వుంచి వెక్కివెక్కి ఏడుస్తున్నది మాలక్ష్మి. అప్ప డికి కన్నీళ్లు వరదలై మాలక్ష్మి తలనిండా రాలు తున్నవి. ఒక్కరూ మాట్లాడలేదు.

మాఘమాసం రాగానే ఇద్దరికీ పెళ్లి అయింది.

# 'గాథాసప్తశతి' నుండి

## = శ్రీ ఘట్టి లక్ష్మీనరసింహశాస్త్రి

వరిచేనిపంట సంతోషదాయకమే యైనను నయ్యది కతముగ నేడ్చుటంబట్టి లక్షితశాలి క్షేత్ర సంకేతస్థలయగు నొక కలికికి మఱొకతె యొకసక్కెముగ:—

పండి వెలివాఱి వరిపైరు లెండినంత
వంతబడు దేల యీలీల వ్రాల్చి మోము ?
పొలఁతి! హారితాలమంశితముఖము పొదల
సెనగచే నదె నటివలె న్నుమిఫులు.

ఒకతె తన యనుఁగుఁజెలితో:—

మ్రోల నడుగులపై వ్రాలి జాలి వేఁడు
కొనెడు చెలువుని వీఁపుపై నదుఁగుబుడుతఁ
డెగసి యెగఁబ్రాకు పనిఁగొన నగవుసయిత
మలిగియున్న యిల్లాలిలో నిలువదయ్యె.

కీచులాడుకొన్న దంపతులతో చెలి:

ఒఁసి పొలయుఁక నిశ్వాసములను జిక్క
బట్టి కదలక మెదలక పండి పీను
దోయి సడి మానముం దోడి దొంగనిదుర
మలయు నిరువురలోపల మల్లుఁ డెవఁడు ?

దుర్విదగ్ధుఁడగు నాయకునితో దూతి:—

ఎగసి యధికారముం బ్రకటింప రెవరు
కోపగించిన బ్రతిమాలుకొందు రెవరు
దాసులటులు వారలె నెలంతలకుఁ బ్రియులు
తక్కుగల దరిద్రులు మెడత్రాటి మగలు.

నాగరికుడు:—

దోసిలిం గొన్న వ్రేళ్ల సందులు వొనర్చి
కనులు పైకెత్తి తెరువరి మొనసి నీరు
ద్రావుకొలఁదిని సన్నని దార మిఫుల
సన్న మొనరించె బ్రపలోని చానమిన్న.

# భవిష్యత్తు

## = శ్రీమతి వట్టికొండ విశాలాక్షి =

జీవితావధి నెల్లెడ చిమ్మిరేగి
ఆత్మదాస్యతమిస్రమ్ము లలముకొనగ
ఏవినూతనవిశ్వసీమావధులను
చూపి వెలిగించె నొక వేగుజుక్క హృదిని.

అక్షయమ్మగు స్వాతంత్ర్యలక్ష్మి గోరి
ఎత్తునకు నిండుబ్రతుకునే ఎత్తుకట్టి
స్వీయ మొనరించుకొన్నాను—హేయమనక
అమ్ముకొన్నారు ఏ నిర్గుణాత్మపరులో !

తీరితీరని కోర్కెల తీవతీగ
తేనెల న్నింపుకొన్నట్టి యీ నిగూఢ
భావపరిమళపరిపూత భవ్యమృదుల
కుసుమజీవిత మేనాడొ! కోలుపోతి.

నవనవానందభరితనూత్నానురాగ
సుమపరాగోర్మి నోలాడు సుధల గురియు
జీవితోద్యానమును స్ఫురింపజేసికొనగ
నొక్క నిట్టూర్పు విడుచుచు నోర్వలేక.

అస్మదీయాత్మపరమైన ఆ మహోజ్జ్వ
లాశయోద్దీపకళిక లనంతవిశ్వ
మందు వెలయింపగల పవిత్రాత్మ గాంచి
ఏమి ఆత్మీయతయొ! వశీకృతి దనర్చు.

వెలుగుచీకట్ల సంఘర్షణలకు నిలచి
హృదయ మొక వర్తమానంపు టిరుసుమీద
భూతమును బాసి భవితవ్యమునకు నడచు
కాలచక్రమ్ముతో తిరుగాడుచుండె.



# మీ టెంపరేచరు

మీ టెంపరేచరు 102 కు ఎక్కువయిన ముందు బాధ పడునది మీ కేశములు. మీకు చిన్నమ్మవారయినను యిన్ఫ్లూయంజా, టైఫాయిడ్, అయినను లేక న్యూమోనియా జాడ్యమయినను మరేజాడ్యమయినను, పెద్ద జ్వరమునకు తరువాత శిరోజములు అమితముగా ఊడిపోవును. జ్వర మెంత కొద్దిదైనను జుట్టు రాలుట సహజము. దానిని నివారించు ప్రయత్నము చేయకపోయినచో అటులనే రాలుచుండును.

అట్టి పదల నాహ్వానింపకుడు. ఇప్పుడే కేశవర్ధినితో మీ తలవెండ్రుకలను రక్షించుకొనుడు. జాడ్యము మీకురులను ఎంత చిన్నవిగా చేసినను సరియే కేశవర్ధిని మీ కేశములను పొడవుగాను, సమృద్ధిగాను చేయును. 6

# కేశవర్ధిని

యిప్పుడెందులకు ఉపయోగించకూడదు

| | | |
|---|---|---|
| కేశవర్ధిని | అణాలు | 0-12-0 |
| కేశవర్ధిని షాంపూ | ,, | 0-12-0 |
| కేశవర్ధిని క్రీం | ,, | 1- 0-0 |

ప్యాకింగు పోస్టేజి అధికము.

వర్తకులందరివద్దను దొరుకును లేక

## సౌత్ యిండియా కెమికల్సు,

188, తిరువెంకటస్వామి రోడ్డు,

ఆర్. యస్. పురము — కోయంబత్తూరు.

గమనిక :— దీనినిపోలిన యితర యిమిటేషన్ నూనెలనుకొని మోసపోవద్దు. మీరు కొనుటకుముందు, దానిమీద, "కేశవర్ధిని" మరియు "సౌత్ యిండియా కెమికల్సు" అను పేర్లనుచూచి తీసికొనుడు.




**మొత్తముక్లెయిములు** పరిష్కరింప బడినవి రూ. 8·8 కోట్లు మించినవి.

**మొత్తముప్రీమియము** అమలులో నున్నది రూ. 19·32 కోట్లు.

**కొత్తప్రీమియము** 1944-లో పూర్తి అయినది రూ. 4·73 కోట్లు మించినది.

N.F.a/te-1

## ఇన్సూరెన్సు కంపెనీ లిమిటెడ్

7, కౌన్సిల్ హౌస్ స్ట్రీటు, కలకత్తా.

మద్రాసు బ్రాంచి :

నేషనల్ ఇన్షూరెన్సు బిల్డింగు,

362, చైనాబజారు రోడ్డు, ఎస్ప్లనేడ్.

సబ్ ఆఫీసులు :

బెంగుళూరు - మధుర.



# చాకలివానిచే బాగా చింపబడ్డది!

బట్టల ధరలు ఇంత ప్రియంగావున్నవి

బట్టల ధరలు మండిపోతున్న ఈ రోజుల్లో చాకలివాడు బట్టలను బండకేసి బాది ఈ విధంగా చింపుకు రావటం మీరు భరించలేరు. బట్టలు చాలకాలము మన్నునట్లు చేసుకొనుటకు, తొందరగా చిరగకుండావుండే పద్ధతిని తప్పక చూడాలి, ఇంటివద్ద సన్‌లైటు "సబ్బు-రక్షణ" పద్ధతిని వెంటనే మొదలుపెట్టుట మంచిది. ఒక్కదారపు పోగైనా చెడకుండా బట్టలను తేలికగా బాగా తెల్లగా చేయగలుగుటచే, ఈ సున్నితమైన మార్గం చాకలివాని మోటపద్ధతికంటె చాలమంచిది. సన్‌లైటుయొక్క స్వతసిద్ధమైన నురుగు, బండకేసి బాదనక్కర లేకుండా, బట్టలనుండి మురికిని తొలగించి శుభ్రపరచి చాలకాలము మన్నునట్లు చేయును. సన్‌లైటు "సబ్బు-రక్షణ" విధానాన్ని ఈ రోజునుంచే మీ పని మనిషికి బోధించండి.

## మీ పనివాడికి సన్‌లైటు "సబ్బు-రక్షణ" విధము నేర్పండి

1. గుడ్డలనుబాగా తడపండి. 2. తరువాత సబ్బు బట్టకుపట్టించండి. మరీమురికిగా వున్నచోట సన్‌లైటు బాగా పట్టించవలెను. 3. సబ్బు బట్టలకు బాగా అంటనివ్వండి. రాతికేసిగాని కఱ్ఱతోగాని బాదవద్దు. సన్‌లైటుయొక్క స్వతసిద్ధమైన నురుగు మురికినంతటిని వస్త్రమునుండి వదల్చును.



4. మురికి అంతయు పోయేటట్టు బట్టలను బాగా పుసమండి. బాగా మురికిగావున్న బట్టకు ఇంకొకసారి సబ్బు పట్టించుట అవసరము.

# సన్‌లైటు సబ్బు బట్టలను కాపాడును




S. 69-23 Tl.

LEVER BROTHERS (INDIA) LIMITED

# కాకతి గణపతిదేవుడు - కులోత్తుంగ రాజేంద్ర చోళుడు

శ్రీ నేలటూరి వెంకటరమణయ్య

[ గత సంచిక తరువాయి ]

పృథ్వీశ్వరుని మరణానంతరము వెలనాటివంశము గూర్చి విశేష మేమియు దెలియదు. పృథ్వీశ్వరునితో వీరి వంశమంతరించెనని పరిశోధకు లభిప్రాయపడియున్నారు. కాని ఇది పొరపాటు. పృథ్వీశ్వరునికి తరువాత వెలనాటివంశజు లగు కొందఱుండి రనియు, ఖిలమైన తమ రాజ్యమును బునరుద్ధరించుటకు వీరు ప్రయత్నము సల్పిరనియు, దైవదుర్విపాకముచే వీరికడక కొనసాగకపోవుటచే తుదకు కాకతీయులకు దలయొగ్గవలసినవా రైరనియు శాసనములవల్ల దెలియ వచ్చుచున్నది. 59 ఇట్లు పోయిన రాజ్యమును మరల ప్రతిష్ఠ సేయదలపెట్టినవారిలో ప్రముఖుడు కులోత్తుంగ రాజేంద్రచోళుడు. ఈ వంశమువారిలో నీ నామము వహించిన రాజులలో నితడు మూడవ రాజగుటచే నిటమీద నీవ్యాసమునందంతటను నితని ముమ్మడి కులోత్తుంగ రాజేంద్రచోళుడని పేర్కొందను. ఇతని పుట్టుపూర్వోత్తరమును గూర్చి మనకు తెలియదు; కాని ఇతడు కంచిపర్యంతము గల దేశముపై క్రీ. శ. ౧౨౩౦ ప్రాంతమున నొకమారును, ౧౨౫౬ ప్రాంతమున నొక మారును రెండుపర్యాయములు దండువెడలిపోయినట్లు తెలియవచ్చుచున్నది.

కడపజిల్లా సిద్ధవట గ్రామమున సిద్ధేశ్వరాలయమున నెల్లూరు తెలుగు చోడరాజుల తంత్రపాలుడగు పెద్దినాయకుడు క్రీ.శ. ౧౨౩౩–౪ సంవత్సరమున వ్రాయించిన శిలాశాసనములు మూడు కలవు. వీనియందు పై తంత్రపాల పెద్దినాయడు పై కులోత్తుంగ రాజేంద్ర చోళుని యుద్ధమున బరాజితుని గావించి యుత్తరమున దుంగభద్రానదివఱకును వెన్నంటితఱిమినట్లు చెప్పియున్నది. లెక్కకుమూడైనను నీశాసనములు భిన్నములు గావు. ఒక దానియందలి చరిత్రాంశములే యన్నిటియందును ప్రత్యేక భాషలయందు వర్ణింపబడినవి. మూడును నేకకాలమున వ్రాయించినవే. సర్కారు శాసనపరిశోధక శాఖవారు వీనికి ప్రతిబింబములను దీయించి యిందలి విషయము నింకను బయలుపఱచ లేదు. కాని మెకంజీ లిఖితపుస్తకసంచయము (౧౫-౪-౨౮) నందు వీనికి నకళ్లుకలవు. క్రిమిదష్టములై వ్రాతపుస్తకపు బత్రములు శిథిలములగుటచే శాసనాక్షరములు గొంతవఱకు చెడిపోయినవి; కాని చెడిపోగా మిగిలిన భాగమువల్లగూడ విషయము వ్యక్తపడుచున్నది. సంగ్రహముగ వీని నీ క్రింద వివరించుచున్నాను:

౧. స్థలము : సిద్ధవటములోని సిద్ధేశ్వరాలయము గోపురపు పట్టురాయిమీద. భాష: అఱవము. కాలము : శకాబ్దము ౧౧౫౫ (క్రీ. శ. ౧౨౩౩). విషయము : మనుమల్లిదేవుని జయించి, కాంచిపురమున గప్పము గొని,...పడమట తుంగభద్రవఱకు...ఉత్తరమున కులోత్తుంగ ... వల్లసిద్ధప్పసోదరుడు సిద్ధప్పపుత్రుడగు మధురాంతకపొత్తపిచోళ......గజసాహిణితంత్రపాల పెద్దినాయకుడు సిద్ధేశ్వరస్వామియాలయమునకు గోపురము గట్టించెను. (ఫలక ౧)

59. ARE 1936-37 Part II Para 15.

౨. స్థలము: వైశాసనమునకుప్రక్కన. కాలము: శకాబ్దము ౧౧౫౫ (క్రీ. శ. ౧౨౩౩). (పుట ౨) మరా. దీనికి మెకంజీగారి గుమస్తాలు సంపూర్ణమైన నకలు వ్రాయలేదు.

3. స్థలము: గోపురము తూర్పుముఖమున. కాలము: శకాబ్దము...పుష్యసంక్రాంతి. రాజు: త్రిభువనచక్రవర్తివీరరాజే ...... విషయము: పాకనాడు పొత్తపినాటిలో...మనుమల్లి దేవుని కొడుకు అలిమత్తు దేవుని జయించి, పడమట తుంగభద్ర...ఉత్తరమున కులోత్తుంగరాజేంద్ర చో......మధురాంతక పొత్తపి చోళని...... (పుట 3)

ఇందు మొదటి శాసనమున పేర్కొనబడిన నల్ల సిద్ధప్పసోదరుడను సిద్ధప్ప నెల్లూరు నేలుచుండిన తెలుగుచోళుడు మొదటి మనుమసిద్ధి. ఇతని పుత్రుడగు మధురాంతకపొత్తపిచోళుడు తిక్కరాజు. ఈ తిక్కరాజుయొక్క గజసాహిణి, యనగా ఏనుగుల దండున కధ్యక్షుడు తంత్రపాల పెద్దినాయకుడు. మూడవ శాసనమందు పేర్కొనబడిన త్రిభువనచక్రవర్తి వీరరాజే...అనునతడు చోళచక్రవర్తియగు ముమ్మడి రాజేంద్రచోళుడేకాని యన్యుడు గాడు; వీరరాజేంద్ర చోళడను నామాంతర మితని కుండినట్లు ప్రకటితములైన ఇతని శాసనములవల్ల దెలియుచున్నది. మఱియు నితడు క్రీ. శ. ౧౨౪౬ నుండి సామ్రాజ్య పరిపాలన సేయుట కారంభము జేసినను తత్పూర్వము పదునూఱేండ్ల నుండియు రాజకార్యములలో పాల్గొనుచు, చోళుల శత్రువులతో పోరుచుండెను. 60 చోళ చక్రవర్తికి నెల్లూరు తిక్కరాజు సామంతుడు. కావున సిద్ధవట శాసనములవల్ల ముమ్మడి రాజేంద్రచోళ చక్రవర్తియు, నెల్లూరు తిక్కరాజును గలసి ఏఱువమనుమల్లి దేవుని తోడను, నతని గూడిన మిత్రుడు వెలనాటి ముమ్మడి కులోత్తుంగ రాజేంద్రచోళునితోడను పాకనాటిలోను, పొత్తపినాటిలోను క్రీ. శ. ౧౨౩౩-వ సం. న కించుక ముందు యుద్ధము సల్పినట్లు తెలియవచ్చుచున్నది.

వెలనాటి రాజ్యము పృథ్వీశుని మరణముతో విచ్ఛిన్నమాయెనే; ముమ్మడి కులోత్తుంగ రాజేంద్రచోళునికి పాకనాడు పొత్తపినాడులపై నెత్తిపోవునంతటి సత్వ మెచ్చటినుండి వచ్చినది? అను ప్రశ్న యొకటి బయలువెడలవచ్చును. సమకాలిక శాసనములును, దరువాతి యాంధ్రవాఙ్మయమును బరిశీలించిచూడగా నీతడు దక్షిణదేశముపై నెత్తిపోవుచుండిన పూర్వగాంగరాజగు ననంతవర్మ రాహుత్తదేవు డను నామాంతరముగల ముమ్మడియని యంకభీమనృపాలుని గలసిపోయినట్లు తోచుచున్నది. చిన్నకంచియందలి యరుళాలనాథుని యాలయమున కళింగగాంగవంశజుడగు శ్రీమదనంతవర్మ రాహుత్తదేవుని ౧౯-వ రాజ్యవర్షమున వేయించిన శిలాశాసన మొకటి యున్నది. అందు అతడు అభినవ వారణవాసియందు మకాము జేసియుండగా సోమల మహాదేవి యను నామె యరుళాళనాథునికి అనంత రుద్రవిషయాంతర్గతమైన ఉడైయకామ మను గ్రామమును నిత్యనైవేద్య పూజాపురస్కారములను నడుపుటకొఱకు దానము జేసెననియున్నది. 61 ఈశాసనమునందు పేర్కొనబడిన "అభినవ వారణవాసి" కాంచీపురము గావచ్చునని మద్రాసు సర్కారు శాసనశాఖవారు ౧౯౨౦-వ సంవత్సరపు నివేదికయందు వ్రాసియున్నారు. అనంతవర్మ రాహుత్తదేవుడు సుప్రసిద్ధ శూరశిఖామణి. అనియంకభీము డని యతనికి నామాంతరము. అతడు క్రీ. శ. ౧౨౧౧-వ సం. న రాజ్యాభిషిక్తుడగుటచేత నతని ౧౯-వ రాజ్యవర్షము క్రీ. శ. ౧౨౩౦కి సరిపోవుచున్నది. అప్పుడే కారణమున నతడు కాంచీపురమునకువచ్చి యచట మకాము జేసియుండెనో

---

60. Ecl. v. Ak123 క్రీ. శ. ౧౨౩౪ నాటి శాసనమునందు ముమ్మడి రాజేంద్రుడు హొయ్సల సోమేశ్వరుని కొట్టి యాతని శరణుజొచ్చెనని యున్నది:

"హరణభరణక్షమం రా|యరొళికలి సోవిదేవనుఱ దాంతిరె పం|గరదొళ్బేరింకె శ్ఠం| శరణెనె రాజేంద్రచోళనం పాలిసిదం||"

61. ARE 444 of 1919.

శాసన గ్రంథమువల్ల దెలియవచ్చుట లేదు. కాని యప్పటి హొయ్సలశాసనములను బరికించి చూడగా ననియంకభీముని యాగమనమునకు హొయ్సలులకును, కళింగగంగరాజులకును గల పూర్వవైరమే కారణమని తెలియుచున్నది. ఈ రెండిండ్లవారికిని విరోధము క్రీ. శ. ౧౨౨౨ ప్రాంతమున బొసగినట్లు శాసనములలో సూచనలు గానవచ్చెడిని. క్రీ. శ. ౧౨౨౩ నాటి యొక మైసూరు కన్నడ శాసనమున హొయ్సలఇమ్మడివీరనరసింహుడు త్రికళింగ భూపాలురను జయించి వారి యేనుగులను నిజగజశాలలోనికి దోలి కట్టివేసుకొనెనని వ్రాసియున్నది.

"అదియమచేరపాండ్యమకరోద్ధతకాడవరంకవత్తెఁగొం
డుదనదనేకెబంణిసువె బంణిసు చోళననెత్తికక్కొదం
దుదనెళెనేతుముట్టి బెసకెయ్దియుదనా త్రికళింగభూపర
ట్టిద కరిసాలెవొక్కసమసాహసమం నరసింహభూప
నా॥"62

ఇందు పేర్కొనబడిన త్రికళింగభూపతి నెల్లూరుపాలకుడగు చోడతిక్కరాజని మైసూరుగజెట్టీరురచయితలు చెప్పియున్నారు. 63 ఇది యొప్పుకొనదగిన యభిప్రాయము గాదు. తిక్కరాజునకుగాని, మఱి యేతెలుగుచోడరాజునకుగాని 'త్రికళింగభూప' రను పేరు చెల్లదు. వీరికీపేరుండినట్లుగాని, త్రికళింగదేశమును వీరు పాలించుచుండినట్లుగాని తెలుపునాధారము లెవ్వియు లేవు. ఈకాలమున త్రికళింగాధిపు లను పేరు పూర్వగంగవంశజులకే చెల్లుచుండినందువల్లను, మఱియు త్రికళింగము నప్పుడు అనంతివర్మఱారాహుత్తనామాంతరుడైన ముమ్మడి యనియంకభీమభూపాలు డేలుచుండినందునను నతడే హొయ్సలఇమ్మడివీరనరసింహునిచే బరాజయమును బొంది యేనుగులను గోలుపోయిన త్రికళింగభూపాలుడని యెంచవలసియున్నది.

62. El v Cn 203.

63. Mys. Gaz. vol. ii. P. 1380.

కాని హొయ్సలఇమ్మడివీరనరసింహు డెచట ననియంకభీమునితో బోరి యతని నోడించి యేనుగులను స్వాధీనపఱచుకొనెనో పై శాసనమువల్ల దెలియవచ్చుట లేదు. క్రీ. శ. ౧౨౦౫-వ సంవత్సరము నుండియు నిమ్మడి వీరనరసింహుడు తన తండ్రియగు నిమ్మడి బల్లాలునికి రాజ్యపాలనయం దొత్తాసియై సర్వకార్యములను నిర్వహించుచుండెను; కాని క్రీ. శ. ౧౨౨౩ నకు ముందు అతడుగాని, యతని తండ్రిగాని త్రికళింగముపై నెత్తిపోయినట్లుగాని, త్రికళింగాధిపుల నెచటనేని దారసిల్లి యుద్ధమొనర్చినట్లుగాని శాసనములందు గాని, వాఙ్మయమందుగాని యెచ్చటను సాక్ష్యము గానరాదు. అప్పటి దాక్షిణాత్య రాజకీయపరిస్థితినిబట్టి చూడ నిమ్మడివీరనరసింహునికి క్రీ. శ. ౧౨౨౩ లో త్రికళింగమువంటి దూరదేశముపై నెత్తిపోవుట కవకాశ ముండినట్లగపడదు.

ముమ్మడికులోత్తుంగచోళచక్రవర్తి క్రీ. శ. ౧౨౧౮ వఱకు దాదాపు నలువదియేండ్లు మహావైభవముతో సామ్రాజ్యాధిపత్య మొనర్చెను. కాని యవసానదశయందు కడగండ్లపాలై పితృపైతామహమైన స్వకీయసామ్రాజ్యవినాశనమును కన్నులగాంచవలసినవాడాయెను. క్రీ. శ. ౧౨౧౬ తో చోళసామ్రాజ్యమున కంత్యదశ ప్రారంభమాయె నని చెప్పవచ్చును. సామ్రాజ్యవినాశనహేతుభూతము లగు చరిత్రాంశములు కొన్ని యాయేట పొడమినవి. ఇందు ముఖ్యమైనవి మూడు: (౧) ముమ్మడికులోత్తుంగచక్రవర్తి తన కుమారు డగు ముమ్మడి రాజరాజును పట్టబద్ధుని గావించి సామ్రాజ్యపాలనయందు భాగస్వామిగ జేసి తన యనంతరము చక్రవర్తిపదమున కధిపతిగ నియమించెను. ఇత డొక యంబేద. సామ్రాజ్యపాలనమున భాగస్వామి యగుటవలన నితని తండ్రికి గాని, ప్రజలకు గాని కలిగిన లాభ మేమియు లేదు. సత్వహీను డగుటచే నితని యేలుబడి రాజ్యవినాశమునకు గారణ మాయెను. (౨) మఱియు నీసంవత్సరమునవో, లేక యించుకపూర్వమో వేంగియందు ఇమ్మడి

రాజాధిరాజు మృతినందెను. ఇతనిస్థానమున త్రిభువన చక్రవర్తి రాజాధిరాజదేవు డనునత డచట రాజ్య పాలనము సేయ నారంభించెను. రాజాధిరాజనామధారు

64. ముమ్మడి రాజాధిరాజుశాసనములు పెక్కు ద్రాక్షారామమున గానవచ్చుచున్నవి. కొన్ని శిథిల మైనవి. కొన్నిటియందు కాలము దెలుపు భాగము మాసిపోయినది. శకాబ్దమును, రాజ్యవర్షమును రెంటిని దెల్పు శాసనములను మాత్రమే యీ క్రింద నుదాహరించు చున్నాడను:

| | నెంబరు | శకాబ్దము. | రాజ్య వర్షము. | రాజ్యారంభ కాలము. |
|---|---|---|---|---|
| SII. IV | ౧౦౪౩ | ౧౧౭౪ | ౩౬ | ౧౧౩౮ |
| ,, | ౧౦౪౫ | ౧౧౭౫ | ౩౭ | ౧౧౩౮ |
| ,, | ౧౦౩౩ | ౧౧౭౫ | ౩౭ | ౧౧౩౮ |
| ,, | ౧౩౭౧ | ౧౧౭౫ | ౩౭ | ౧౧౩౮ |
| ,, | ౧౨౩౦ | ౧౧౭౬ | ౩౮ | ౧౧౩౮ |
| ,, | ౧౦౩౨ఎ. | ౧౧౮౦ | ౪౩ | ౧౧౩౭ |
| ,, | ౧౩౭౩ | ౧౧౯౭ | ౫౯ | ౧౧౩౮ |
| | ౧౧౫౨ | ౧౨౦౦ | ౬౨ | ౧౧౩౮ |
| | ౧౦౩౮ | ౧౨౧౦ | ౭౨ | ౧౧౩౮ |
| | ౧౩౦౭ | ౧౨౧౫ | ౭౬ | ౧౧౩౯ |

ఈపైశాసనములు పదింటిలోను ఎనిమిదింటివల్ల నీ త్రిభువనచక్రవర్తిముమ్మడిరాజాధిరాజుశకాబ్దము ౧౧౩౮ (క్రీ. శ. ౧౨౧౬)న రాజ్యముసేయ నారంభించినట్లు తెలియవచ్చుచున్నది. నెం ౧౦౩౨-ఎ. వల్ల శకాబ్దము ౧౧౩౭ నందును, నెం ౧౩౦౭ వల్ల శకాబ్దము ౧౧౩౯ యందును రాజ్యారంభమైనట్లు కానవచ్చుచున్నది. ఈ వ్యత్యాసమునకు వ్రాయసకాని యపరిజ్ఞతయే కారణమని తోచుచున్నది. శాసనములన్నిటి సాక్ష్యమును సమిష్టిమీద నంగీకరించిన, ముమ్మడిరాజాధి రాజురాజ్యారంభకాలము శకాబ్దము ౧౧౩౮ (క్రీ. శ. ౧౨౧౬)అనియే చెప్పవలసివచ్చును. రాజ్యాధిపత్యమును వహించి క్రీ. శ. ౧౩౦౩ వఱకును (SII. IV. No. 1183) ఎనుబదియేండ్లేలినట్లు గానవచ్చుచున్నను మొదటి ముప్పదియైదేండ్లలో నొక్కశాసనమైన గానరాకపోవుట చిత్రము. మఱియు నిత డంతటి లగు చోళరాజులలో నితడు మూడవవాడగుటచే నితనిని ముమ్మడి రాజాధిరాజని యందము. ఇతని పుట్టుపూర్వోత్తర మేమియు దెలియరాదు. శకాబ్దము ౧౧౩౮ వ సరియైన క్రీ. శ. ౧౨౧౬ ఇతని రాజ్యారంభవర్ష మగుట చేత నాడును, ముమ్మడికులోత్తుంగ చోళుని పుత్రుడగు ముమ్మడి రాజరాజును నేకకాలమునరాజ్యపాలనసేయ దొడగిరని తెల్లమగుచున్నది. ఇరువురికిని 'త్రిభువనచక్రవర్తి'యను బిరుదుండుటచే నిరువురును చక్రవర్తిపదము తమదే యని ప్రకటించుకొనిరని స్పష్టమగుచున్నది. కాని ఇతని శాసనముల సాక్ష్యమును బట్టి ఈ ముమ్మడి రాజాధిరా జెనుబదియేడేండ్లు రాజ్యపాలనము జేసినట్లు తేలుటవల్ల నిత డత్యంతతరుణ వయస్కుడుగ నుండగనే యెవ్వరో కార్యవాదు లితని మఱుగున స్వార్థమును సాధింప నుద్దేశించి ఇతని చోళసామ్రాజ్యపీఠము నెక్కించు మిషపై నింకను చోళసామ్రాజ్యమునం దంతర్గతమైయుండిన దక్షిణాంధ్రమును జయించుటకును ద్రావిడదేశముపై దండయాత్ర వెడలుటకును ననుకూల పడునని యితని పట్టబద్ధుని గావించి చక్రవర్తి యని ప్రకటించి రని నిశ్చయించి చెప్పవచ్చును. ఈ కాలమున నడచిన కళింగగాంగరాజుల దక్షిణదండయాత్రలకును, నీముమ్మడిరాజాధిరాజు పట్టబంధమునకు నేదో సంబంధముండినట్లు తోచెడిని.64 (౩) మఱియు నీ సంవత్సరముననే పాండ్యదేశాధిపతి మారవర్మ సుందరపాండ్యుడు ముమ్మడి కులోత్తుంగచోళుని మీద తిరుగుబాటు చేసి ప్రచండసైన్యముతో జోళదేశముపై నెత్తివచ్చి ముమ్మడికులోత్తుంగచోళుని బరిభవించి సకుటుంబముగ నాతని జెఱపట్టుకొనియెను. ఆ వార్త యెఱిగి యతనికి మిత్రుడును, బంధుడును నైన హొయ్సలాధిపతి ఇమ్మడి బల్లాలుడు దనపుత్రుడగు నిమ్మడి వీరనరసింహుని సైన్యముతో గూడ చోళచక్రవర్తిని సంరక్షించుటకై దక్షిణదేశమున కంపెను. వీరనరసింహుడు పాండ్యసైన్యమును దారసిల్లి హోరాహోరిగ బోరి పాండ్యుల నోడించి తఱుమగొట్టి చోళచక్రవర్తిని అతని రాజ్యమున బునఃప్రతిష్ఠితుని గావించి చోళ రాజ్యప్రతిష్ఠాపనాచార్య యను బిరుదును వహిం

చెను.[65] తరువాత నల్పకాలమునకే ముమ్మడికులోత్తుంగ చోళుడు కాలగతి నందగా నతని పుత్రుడు ముమ్మడి రాజరాజు చోళసామ్రాజ్యమునకు సర్వాధిపతి యాయెను. ఇతని దౌర్బల్యమును గుర్తెఱిగి సామంతులును, మాండలీకులును దిరుగబడి స్వతంత్రపతాకము లెత్తి యుద్ధమునకు గడగిరి. వీరి దుండగములవల్లనో, పరరాజుల దండయాత్రవల్లనో ముమ్మడి రాజరాజు ఐదవ రాజ్యవర్షమున (క్రీ. శ. ౧౨౨౧) న చోళమండలమున మహాసంక్షోభము కలిగినది.[66]

ఈ విషమపరిస్థితియందు తన బంధుడును నాశ్రితుడును నగు ముమ్మడిరాజరాజును శత్రులబారిని ద్రోసి కారణము లేకయే హొయ్సళ ఇమ్మడి నరసింహుడు కళింగముపై నెత్తిపోవుట యసంభవము; కావున త్రికళింగాధిపతి యనియంకభీముడు ద్రావిడదేశముపై నెత్తిరాగా ఇమ్మడి వీరనరసింహు డాతని నెదుర్కొని తఱిమియుండవలయును. ఇదియే వాస్తవమని క్రీ. శ. ౧౨౨౫ నాటి దొక శ్రీరంగశాసనము రుజువు సేయుచున్నది. అందలివిషయమును సంగ్రహముగ నీక్రింద వివరించుచున్నాడను:

శ్రీరంగనాథస్వామి యాలయపు పశ్చిమరాజ మహేంద్రావరణమునందు సభకూడిన దేవాలయాధికారులు మున్నగువారు ఏర్పఱచుకొనిన వ్యవస్థ:— దేవాలయమునకు సంరక్షకులుగ వంశపారంపర్యముగా ప్రవర్తించుచుండిన దళవర్గములవారును ఒడ్డవారితో నేకీభవించి వారికి ఒడ్డకాసు, (ఒడ్డెవారికిచ్చు పన్ను)ను దేవాలయ ద్రవ్యమునుండియు నుత్సవాదులకు వినియోగించు ధనమునుండియు మిక్కుటముగ నిచ్చుటయే కాక వారు దేవాలయ రక్షకభటవర్గమని చెప్పి చాల ధాన్యమును గొలిచిరి. ఇట్టి చెయ్దములవల్ల దేవాలయ భూస్థితి చాలవఱకు నష్టమైపోయినది. రెండుసంవత్సరములనుండియు దేవాలయమునం దొకదినమునకు సరివచ్చు సామగ్రి పెక్కుదినములకు వాడుకొనవలసి వచ్చెను. పెక్కునాళ్లు పూజయే లేకపోయెడిది. ఆయాస్థలములయందు గల దేవాలయభూములను దళవర్గములవారు స్వాధీన పఱచుకొని తమకొలువుగాండ్ర నంపి వానినుండి దేవాలయమునకు జెందవలసిన పన్నుపర్యాయములను వసూలుజేసుకొని లభించిన ద్రవ్యమును ఒడ్డలును, దామును పంచుకొని యనుభవించుచుండిరి. ఈ యకృత్యముల నెఱిగి జను లాగ్రహపరవశులై యాక్రోశించదొడగిరి.

ఇప్పుడన్నో ఒడ్డలకాలము గతించిపోయినది. రాజపరిపాలనయేర్పడి మనసేనాపతులు దేవాలయమును వశపఱచుకొని దేవాలయపు సొత్తును దేవాలయమునకు మరల నొప్పగించి, దేవాలయమునందు కైంకర్యములను క్రమముగా నడపుచున్నారు. పూర్వము ఒడ్డలతో జేరి యన్యాయకారులై యుండినవారిని పదునెనిమిది మండలముల జనులు నియమించిన సభవారు తొలగించి యితర యేర్పాటులను గావించిరి.[67]

---

ప్రబలుడు గాకపోయినను గాకతిగణపతి (SII. IV. No. 1045), రుద్రాంబ (Ibid No 1152), ప్రతాపరుద్రుని మంత్రి ఇందులూరి అన్నయ (Ibid No.1305) మున్నగువారు ఇతని రాజ్యవర్షమును దమ శాసనములయందుదాహరించుకొనుటను జూడగా వీ రీతని యాధిపత్యము నంగీకరించినట్లున్నది. కారణము దురూహ్యము. సమాధానము నెదురుచూచు మధ్యయుగాంధ్రచారిత్రకసమస్యలలో నిది యొకటి.

65. ఆచార్య కె. ఎ. నీలకంఠశాస్త్రిగారు: చోళులు, సం. ౨ పుటలు ౧౮౭-౮౯; ఎ. కృష్ణమూర్తి: హొయ్సళులు (అప్రకటితము).

66. ARE 213 of 1925, 14 of 1926, 309 of 1927.

67. SII. IV. 500. ఈశాసనమును నాదృక్పథమునకు దెచ్చినందుకు మా డిపార్టుమెంటులో శ్రీరంగనాథుని దేవాలయ చరిత్రను పరిశోధించి వ్రాయుచుండు శ్రీ వి. యన్. హరిరావు ఎం. ఏ. గారికిని, దీని తాత్పర్యము నాంగ్లమున వ్రాసియిచ్చినందుకు తమిళ శాఖాధ్యక్షుడు శ్రీ రావుసాహెబు యస్. వైయ్యాపురిపిళ్లె బి. ఏ., బి. యల్. గారికిని నా వందనములు.

ఈశాసనమువల్ల ఒడ్డెలు, అనగా ఓఢ్రు, లేక ఉత్కళదేశమువారు చోళమండలముపై నెత్తివచ్చి శ్రీరంగప్రాంతదేశము నాక్రమించుకొని యచట రెండేండ్లు అధికారముసేయుచుండి రనియు, తరువాత పాండ్యరాజు మారవర్మ సుందరపాండ్యుని కీ ప్రాంతము స్వాధీనపడెననియు, నటుపిమ్మట క్రీ.శ. ౧౨౨౫ జనవరి ౧౬-వ తేదీనాడు శ్రీ రంగనాథుని దేవాలయాధికారులు సభకూడి యీ శాసనమును వేయించి రనియు తెలియుచున్నది. కళింగోత్కళదేశము లీకాలమునందు ముమ్మడి యనియంకభీమనృపాలుని పాలన క్రింద నుండినందుచేత నీ శాసనమున బేర్కొనబడిన యొడ్డెలతని సైనికులని వేఱుగ చెప్పనక్కర లేదు. మఱియు నీ శాసనకాలమునకు ముందు రెండేండ్లపర్యంతము ఒడ్డెవారు శ్రీరంగమునం దుండినట్లు చెప్పియుండుట చేత వారు క్రీ. శ. ౧౨౨౩ ప్రారంభముననో, ఇంకనంతకుపూర్వమో అచ్చటికి వచ్చి యుండవలయు ననియు, క్రీ. శ. ౧౨౨౩ నకు ముందు హొయ్సాల ఇమ్మడి వీరనరసింహునిచే బరాజితు లైన త్రికళింగాధిపులు వీరే కావలయు ననియు దోచుచున్నది. క్రీ. శ. ౧౨౨౨ నాటి యొక మైసూరు కన్నడ శాసనమున "హొసణ శ్రీవీరబల్లాళ దేవనమగ వీరనారసింహదేవను తెంకలు రంగనమేలెనెడవందు...బిళిగూరునాడకాళెగదందు..." 68 అని యుండుటచేత ఇమ్మడి నారసింహు డా సంవత్సరము శ్రీరంగముపై దండునడపి బిళిగూరునా డనుచోట నెవ్వరితోడనో యుద్ధము సల్పెనని విదిత మగుచున్నది. శ్రీరంగమున హొయ్సాల వీరనరసింహునికి బ్రతిఘటించి నిలిచియుండిన శత్రు వెవ్వరో శాసనమునందు పేర్కొనబడకపోయినను నతడు ముమ్మడియనియంకభీము డనుటకు సంశయింప బనిలేదు. వీరనరసింహునిచే బరాజితుడై స్వరాజ్యమునకు మరలిపోవుటకు పూర్వము అనియంకభీముని సైన్యము శ్రీరంగమున రెండుసంవత్సరములు తానె యుండుటచేత నతడచటికి క్రీ. శ. ౧౨౨౦-వ సంవత్సరమున వచ్చియుండవలయును.

పైచర్చవలన త్రికళింగోత్కళాధిపతియగు ముమ్మడియనియంకభీముడు క్రీ. శ. ౧౨౨౦-వ సంవత్సరమున దక్షిణదేశముపై నెత్తివచ్చి శ్రీరంగప్రాంత దేశము నాక్రమించుకొని రెండేండ్లకాల మచట నుండెనని తెల్లమగుచున్నదికదా. ఇక నితడు దక్షిణ దేశమునకు రా గారణమేమో విచారించవలసియున్నది. ఇతని యాగమనమునకు గారణము రెండువిధములుగనుండ వచ్చును: ౧. దక్షిణదేశమందలి యరాజకస్థితిని గాంచి రాజ్యకాంక్ష యాద్వారా దిగ్విజయార్థమై ముమ్మడి రాజాధిరాజును చోళసామ్రాజ్యపీఠముపై స్థాపించు నెపమున వచ్చిన వచ్చియుండవచ్చును; లేక, ౨. స్వాతిశయమును గోరి యొండొరులతో బోరుచుండిన దాక్షిణాత్య ప్రభువులయం దెవ్వరో సాయ మపేక్షింపగా వారి పక్ష మవలంబించి వారికి తోడువచ్చినను వచ్చియుండవచ్చును. వీనియందు రెండవదియే సరియైన కారణమని తోచెడిని.

దక్షిణదేశమునం దప్పుడు పోరుచుండిన రాజులలో బ్రముఖులు నలుగురు. వీనియం దగ్రగణ్యుడు ముమ్మడిరాజరాజు. లయమైపోవుచుండిన నిజకుల క్రమాగతమైన సామ్రాజ్యాధిపత్యమును నిలబెట్టుకొనుట కితడు ప్రయత్నపడుచుండెను; ఇతనితో గూడ పరిగణించవలసినవా డితని సంరక్షకుడైన ఇమ్మడి వీరనరసింహుడు. ముమ్మడియనియంకభీముడు వీరికి తోడువచ్చెనని యనుకొనుటకు వీలుపడదు. పైనుదాహృతమైన కన్నడశాసనములు వీరికి వైర ముండినట్లు తెలుపుచున్నవి. అనియంకభీముడు ముమ్మడిరాజరాజునకే తోడువచ్చియుండిన నతనితో హొయ్సాలఇమ్మడినరసింహుడు పోట్లాడుట సంభవించియుండదు. వీరికి తరువాత పేర్కొనవలసినవాడు పాండ్యరాజు మారవర్మసుందరపాండ్యుడు. చోళసామ్రాజ్యమును గూలద్రోసి దక్షిణదేశమునంతటిని దన యాధిపత్యముక్రిందికి దెచ్చుకొనవలయునని

68. E. C. VI. cm. 56.

యతడు ప్రయత్నము సేయుచుండెను. క్రీ.శ. ౧౨౧౬-వ సంవత్సరమున మమ్మడికులోత్తుంగ చోళ చక్రవర్తి నోడించి యతనికడ కప్పము గొని యతని రాజధాని యందు వీరాభిషేకము గావించుకొనెనని యింతకు ముందు చెప్పియున్నాను. మఱియు హొయ్సలులు చోళచక్రవర్తిపక్ష మవలంబించి యతనిని నిజరాజ్యమున బునః ప్రతిష్ఠితుని గావించిరనియు నుడివియున్నాను. కావున తన యుద్దేశమును స్వప్రయత్నములవలమున నెరవేర్చుకొనజాలక యొకవేళ యనియంకభీముని సాయము నపేక్షించియుండవచ్చును; అనియంకభీము డందు కంగీకరించి సైన్యముతో గదలి చోళదేశము నకు వచ్చియుండవచ్చును. కాని పైనుదాహృతమైన శ్రీరంగశాసనము దీనికి విరోధించుచున్నది. అందు ఒడ్డెలు శ్రీరంగమునుండి తరలిపోయిన పిమ్మట నే పాండ్యరాజసామంతు లచటికి ప్రవేశించినట్లు చెప్పియున్నది. ఒడ్డెలు పాండ్యరాజుపక్షముననే వచ్చియుండిన నిట్టిసంఘటనమున కెడ ముండియుం దు. కావున అనియంకభీముడు పాండ్యునికి సహాయ మొనర్ప నెత్తివచ్చెననుట పొసగదు. ఇక మిగిలియుండువాడు కొప్పెరుఞ్జింగడు. ఇతడు పల్లవవంశజుడు; బహుపరాక్రమశాలి; నయజ్ఞుడు; మాయావి. తరతరములనుండియు దన పూర్వీకులు చోళచక్రవర్తులకు సామంతులై వారి యాజ్ఞానుసారము ప్రవర్తించుచు వచ్చినను, ఇతని హృదయమందు రాజభక్తికి ఈషణ్మాత్రమేని తావులేదాయె. తొల్లి కంచియందు రాజ్య మొనర్చిన మహాపల్లవులవలె తానును స్వతంత్రుడై ద్రావిడదేశమునంతటిని దనచేతిక్రిందికి దెచ్చుకొనవలెనని ఇతనికి గోరిక; కావున మమ్మడిరాజరాజు సింహాసనము నధిష్ఠించినప్పటినుండియు ఇతడు దన యుద్యమమును నెరవేర్చుకొన నిశ్చయించెను; కాని తలపెట్టిన కార్యము సులభసాధ్యము గాదు. ఎంత శక్తిసామర్థ్యములు గలవాడైనను నత డొక చిన్న మాండలికుడే; అర్థబలసంపదలు చాలవు. ప్రతిపక్షులు పెక్కురు. అధిపతియగు చోళచక్రవర్తిమాట యటుండనిచ్చి తోడిమండలీకు లతని యభ్యుదయమును సహింపరు. పడైవీటి సంబువరాయనితోడను, చంద్రగిరి యాదవరాయనితోడను పలుమారు డ్లాతడు కయ్యము చేయవలసివచ్చెడిది. అంద ఱొకయెత్తు, అగస్త్యుడొకయెత్తన్నట్లు వీరందఱిని మించినవాడు నెల్లూరు తెలుగుచోడ తిక్కరాజు. మన్నేరు మొదలు కంచి వఱకును, సిద్ధవటము మొదలు సముద్రమువఱకును గల తీరదేశముపై నితని యధికారము జెల్లుచుండినది. ఏఱువ యేలేశ్వరముల మధ్య నుండిన మన్నెవా రితని యాజ్ఞానుసారము ప్రవర్తించుచుండిరి. మఱియు చోళతిక్కరాజు స్వామిభక్తిపరాయణుడు. అట్టివాడు కొప్పెరుఞ్జింగని చెయ్దములను సహించి యూరకుండడు. కావున చోడతిక్కని నిరోధించి తన సంకల్పమును నెరవేర్చుకొనుటకు దోడ్పడగల మిత్రు డొక్కడు కొప్పెరుఞ్జింగనికి గావలసియుండెను. కాలకలభకృత గద్యకర్ణామృత మను గ్రంథమున మ్లేచ్ఛదేశజులును, వైదేశికులును కొప్పెరుఞ్జింగనికి సహాయులై యుద్ధము జేసినట్లు చెప్పియున్నది. కావున నత డనియంకభీముని సహాయము నపేక్షించియుండవచ్చును. కీర్తికాముడగు నత డందుల కియ్యకొని దండువెడలి వచ్చియుండవచ్చును.

ఇది కేవల మసంగతము కాదు. హొయ్సల ఇమ్మడివీరనరసింహుడు కొంచె మించుమించుగ ద్రికళింగాధిపులను జయించిన కాలముననే కొప్పెరుఞ్జింగని దేశముపై నెత్తిపోయి పాడుచేసియున్నాడు. దక్షిణ ఆర్కాటు మండలము వృద్ధాచలం తాలూకాకు జెందిన తిరువడత్తురై యను గ్రామమందలి క్రీ. శ. ౧౨౨౨ నాటి యొక శాసనమున హొయ్సల నరసింహుడు దత్ప్రాంతదేశమును బాడుచేసెననియు, దేవాలయములను జెడగొట్టి యందలి విగ్రహములను గొనిపోయెననియు జెప్పియున్నది. 69 ఈసందర్భమున దిక్కనామాత్యుడు చోడతిక్కరాజును "చేదిమండలము గాసిగజేసి కాడవపతి నియ్యకొలుపదేపలచమునకు." 70 అని ప్రశంసించు సీసపాదము ననుసంధించుకొనవల

69. **ARE. 1928-29, part II para 48.**

70. నిర్వ. ౧-౩౩.

యును. ఈ చేదిమండలము ద్రావిడదేశములోనిది. ఇప్పటి యుత్తర ఆర్కాడుజిల్లా తిరువణ్ణామలతాలూకాకు దక్షిణభాగమున, దక్షిణ పెన్నయుత్తరతటమున నుండు అవూరను గ్రామము చేదిమండలాంతర్గత మని క్రీ. శ. ౧౨౭౨ నాటి యొక శాసనమువల్ల దెలియుచున్నది. 71 మలాడు రెండువేల కధిపతులైన సామంతులకు చేదియరాయర్, లేక చేదియొక్క రాజను బిరుదు కలదు. ఈచేదియరాయలకు దక్షిణపెన్నకు దక్షిణమందుండు తిరుక్కోయిలూరు రాజధానిగ నుండినందువల్ల జేదిమండలము దక్షిణపెన్నకు దక్షిణమున గూడ వ్యాపించెనని మనము నిశ్చయించవచ్చును. ఆవూరునకును, దిరువడత్తురైకిని గల దూరము వాయస ప్రచారపథము ననుసరించి యేబది యైదు మైళ్లు. కావున హొయ్సల ఇమ్మడి వీరనరసింహుడును, చోడ తిక్కరాజును పాడుగావించిన దొక్కసీమనే. చేదిమండలమునకు గాడవపతి (కొప్పెరుఞ్జింగడు) యధిపతియగుటచేతను, తిరువడత్తురై యతని రాష్ట్రమునకు జెందిన గ్రామమగుటచేతను చోడతిక్కరాజును, హొయ్సల ఇమ్మడి వీరనరసింహుడును నతని రాజ్యమును నాశనమొనర్చిన దేకకాలముననే కావలయును. కావున కొంచెమించుమించుగ నేకకాలమున హొయ్సల వీరనరసింహుడు త్రికళింగాధిపులను, కొప్పెరుఞ్జింగని జోళదేశముననే యోడించియుండుటచే వారొండొరులయెడ మైత్రిగలిగియుండిరనియు, కొప్పెరుఞ్జింగని పక్షమున యుద్ధముసేయుటకే త్రికళింగాధిపతి ముమ్మడి యనియంకభీముడు దక్షిణదేశమునకు దండెత్తివచ్చెనని యు దోచుచున్నది.

ఇట్టి రాజకీయసంఘట్టనయే ద్రావిడదేశమున మరల క్రీ. శ. సంభవించినది. శత్రుబలమును, నిజదౌర్బల్యమును బరిగణించక ముమ్మడి రాజరాజు పాండ్యులతో దన తండ్రి గావించుకొనిన సంధినియమముల నుల్లంఘించి పాండ్యరాజ్యముపై దండువెడలెను; కాని యుద్ధభూమిని పాండ్యబలముల నోర్వజాలక పరారియై హొయ్సల సేనావారమున దలదాచుకొను నుద్దేశముతో బోవుచుండగా మార్గమధ్యమున కొప్పెరుఞ్జింగనిచే జిక్కి బందీకృతుడాయెను. పాండ్యరాజు మారవర్మసుందరపాండ్యుడు చోళరాజధాని బ్రవేశించి యచట విజయాభిషేకము గావించుకొనెను.

హొయ్సల నరసింహుడు చోళసంరక్షణార్థము మరల కత్తిగట్టవలసివచ్చినది. 'చోళస్థాపనాచార్య' యను బిరుదును నిలుపుకొనవలసిన యావశ్యకత యొక ప్రక్క, ద్రావిడదేశమున గ్రమక్రమముగ బెంపొందుచుండు నిజాధికారమును స్థిరపఱచుకొనవలయునను పేరాస యొకప్రక్క లాగుచుండ యుద్ధప్రయత్నము సేయక ఊరక యెట్లుండగలడు? కావున ముమ్మడి రాజరాజు బందీకృతుడాయెనను వార్త యాతని చెవిసోకినంతటనే యుద్ధమునకు గడగి తన సైన్యములను మూడు పాయలుగ విభజించెను. ఒక్క పాయను స్వయముగ నడపించుకొని పాండ్యులపై బోవనిశ్చయించుకొనెను; మఱియొక పాయను అప్పయగోపయలను నిజదండనాయకుల యాధిపత్యముక్రింద కొప్పెరుఞ్జింగని మీది కంపెను; కాని యతనిపై విజయమునందుట సులభమైన కార్యము గాదు. స్వబలమునకు దోడతనికి మిత్రబల మధికము; అనియంకభీముడు ముందటివలె నతనికి దోడురాగలడని నరసింహు డెఱుగును. మార్గము నరికట్ట మిత్రుడు చోడ తిక్కరాజు గలడు. అతడు పెక్కుయుద్ధములందారితేఱిన ప్రోడయే; కాని శత్రుబలము నతడొంటరిగ నోర్వగలడో లేడో? కావున భేరుండు లను శూరనికాయమును నెల్లూరు చోడరాజుల ద్వితీయరాజధానియైన కాంచీపురమున తాణ్యముంచెను. ఈ విషయము క్రీ. శ. ౧౨౩౦ నాటి యొక హొయ్సల శాసనమున నిట్లు చెప్పియున్నది:

"తతః పట్టాభిషిక్తో వీరనారసింహభూపః సకలదిగ్విజయార్థం ప్రవృత్తః పూర్వదిశావరం గత్వా ప్రతిప్రావృత్తః మగరరాజ్యం నిర్మూల్య శరణాగత చోళరాజ్యం ప్రతిష్ఠాప్య శ్రీమదల్లాలనాథం దృష్ట్వా

71. ARE. 221 of 1930-31.

దుష్టనిర్యాత్రశనార్థం తత్ర భేరుండనగ్గణం స్థాపయిత్వా నివర్త్యతా సుఖేన రత్నకూటరాజధానీం ప్రవిష్టేసతి” 72

ఇమ్మడి వీరనరసింహుడు మారవర్మ సుందర పాండ్యునిమీద నడచెను. కావేరీతీరమున మహేంద్ర మంగలమను తావున నిరువాగులవారికిని ఘోరమైన యుద్ధము జరిగెను. పాండ్యు డోడి వెన్నుచూపెను. ఇమ్మడి నరసింహుడు పాండ్యరాజ్యమును ప్రవేశించి సేతుపర్యంతము కూచిచేసెను. ఇట్లు తమ రాజు పాండ్యదేశమున దండయాత్ర సాగించుచుండిన కాలముననే యప్పయగొప్పయలు కొప్పెరుజింగనితో యుద్ధమునకు గడగి పెక్కుతావుల నతని సైన్యముల నోడించి యతని రాష్ట్రమును చూఱగొని సర్వనాశనము గావించి తుద కతని రాజధానియగు సెందమంగలమునకు ముట్టడివేయ దలపెట్టిరి. కొప్పెరుజింగడు అనుండి వదలి ఇమ్మడి వీరనరసింహుని శరణువేడెను.

ఉ తరరంగమున రాజకీయకారణాంతరముల వల్ల శత్రుపక్షమువారికి బలము హెచ్చి మొదట వారికే యుద్ధ మనుకూల మగునట్లు తోచెను. హొయ్సల వీర నరసింహు డూహించిన ట్లనియంకభీముడు కొప్పెరుజింగనికి సాయము పోదలచినను, ముందటివలె బయనము నిరాటంకముగ సాగునట్లు తోచదాయె. క్రీ.శ. ౧౨౨౨ సంవత్సరమున నతడు చోళదేశమునుండి వచ్చినపిమ్మట కాకతిగణపతి వెంగిదేశమును జయించి నిజరాజ్యమున గలుపుకొనెను. తత్పూర్వ మొండొరులతో స్వాతిశయమునకై పోరుచుండిన చిన్నసంస్థానాధిపతుల స్థానమున వెంగి యొకరాజు యేలుబడి క్రిందికి వచ్చెను. ఈ స్థితియందు వెంగిగుండ సైన్యమును నడపుకొనిపోవుట సులభసాధ్యమైన కార్యము గాదు. గణపతి బలవంతుడైన రాజు; తన సైన్యమునకు మార్గ మిచ్చువాడు గాడు; తగు యత్నము లేక యతనితో దగవుపెట్టుకొనుట యుక్తము గాదు. స్వయము సైరవేర్ప జాలని కార్యము మిత్రసహాయమువల్ల సాధించవచ్చును గదా. అట్టి మిత్రవర్గమును శత్రువు యొక్క శత్రుకోటినుండి యెన్నుకొనుట రాజనీతి. వెలనాటిరాజులకు గాకతీయులతో నొక ప్రక్కను, నెల్లూరు తెలుగుచోళులతో మఱియొక ప్రక్కను తరతరములనుండియు వైరము గలదు. మును పేకులోత్తుంగ చోళచక్రవర్తి నెల్లూరు తెలుగుచోళు ప్రోత్సాహముమీద పృథ్వీశ్వరుని జంపి వెలనాటిరాజ్యము గూల్చివేసినది మొదలు వెలనాటి రాచకుటుంబమువా రచట నచట చిన్నచిన్న సంస్థానముల నేర్పఱచుకొని కాలము గడపుచుండిరి. వారి రాజ్యమున పశ్చిమభాగము తెలుగు చోళుల యధీనమున నుండెను. వెంగిమండల మంతయు గాకతీయులు గబళించిరి. ఈ రెండువర్గములవారితో గయ్యమునకు దొడగినవారికి వెలనాటివారికంటె మించిన సహజమిత్రు డుండడు. కావున ముమ్మడి యనియంకభీముడు వెలనాటికుటుంబమునకు నాయకుడైన ముమ్మడి కులోత్తుంగ రాజేంద్రచోళుని జేరదీసి యతనికి రాజ్యమును దీసి యిచ్చెద నని యాసచూపి సఖ్యము గావించుకొనెను. మఱియు నేలుబడిసీమను పాలించు తెలుగు చోళులు నెల్లూరు చోళుల యాధికారము సహింపక వారి యాధిపత్యమును దొలగద్రోసి పుచ్చి నిజస్వాతంత్ర్యమును ప్రకటింప దరివేచియుండిరి. వారును దం దక్షిణయాత్రయందు దమూల్యమైన సహాయము సేయగలవారే. వెలనాటి ముమ్మడి కులోత్తుంగరాజేంద్రచోళుడును, వారును నిరుగుపొరుగు వారగుటచే నెల్లూరు తెలుగుచోళులను, గాకతీయులను వారిరువురును గలసి యిక్కట్టుల బెట్టగలరు. కావున ఏలువదొరలతో సఖ్యము గూడ లాభకరమే. వారిని చేరదీయవలసినదే. ఇట్లు యోచించి యేలువమన్నె వారిని నెల్లూరుచోళరాజుపై దిరుగుబాటు సేయ బురికొల్పి దండువెడలెను.

ఈ యుద్ధయాత్రయందు జరిగిన రణవివరమును నుడివిన వృత్తాంతము విశేషముగ లభ్యము గాలేదు; కాని దండు వెడలినపిమ్మట అచిరకాలమున కేయనియంకభీముడు కాంచీపురమును జేరుటను జూడగా దన

72. EC. V. Cec. 221.

మిత్రులు శత్రురాజ్యమునం దల్లరులు రేపి కలతబెట్టగా వారీతని నష్టుబెట్ట జాలక పోయి యుందురనియు దత్కారణమున నతఁడు సులభముగ ద్రావిడదేశమును జేరగలిగె ననియు దోచుచున్నది. ఈ దండయాత్ర యందు ప్రథమఘట్టము వెంగియాక్రమణము. శ. ౧౧౫౫ నకు సరియైన క్రీ. శ. ౧౨౩౩ నాటి యొక ద్రాక్షారామ శాసనమున గంగవంశజుఁడును, ననియంకభీముని పౌత్రుఁడును, రాజరాజుపుత్రుఁడును నగు ననియంకభీముని (దండనాథుఁడగు) ప్రసాదుఁడు వేంగిమండలము జయించె నని చెప్పియున్నది. 73 కాని యీ శాసనకాలమునకు మూఁడుసంవత్సరముల మునుపే ప్రసాదుఁడు వేంగిని ప్రవేశించినట్లున్నది. శకాబ్దము ౧౧౫౨ నకు సరియైన క్రీ. శ. ౧౨౩౦ నాటి మఱి యొక ద్రాక్షారామశాసనమునం దనియంకభీమన్రుపాలుని దండాధీశ్వరకల్లభుఁడును, ఖడ్గసింహుని పుత్రుఁడును నగు జప్రసాదుఁడు భీమనాథుని దేవాలయమునకు సున్నము పూయించినట్లున్నది. 74 అల్లాళనాథుని దేవాలయమునఁ గానవచ్చెడి యనియంకభీముని శాసనము గూడ నతని ౧౯-వ రాజ్యవర్షమునకు సరియైన క్రీ. శ. ౧౨౩౦ నాటిదే యగుటచేత అనియంకభీముని

73. SII. IV. No. 1252 'ప్రసాదేన జితవిలస ద్వేంగిభూమణ్డలేన'

74. Ibid. No. 1360.

75. EC. V. Cn 211. ఇందుకల్ల ఇమ్మడి నరసింహుని యాజ్ఞానుసారము భేరుండవర్గము పరబలమును, వింధ్యపర్వతమును జయించినట్లు తెలియుచున్నది. పరబలమును వింధ్యాద్రితో జోడించుట చేత నీ పరబల ముత్తరదేశసంబంధియని సూచన. ఈ కాలపు శాసనములలో కళింగమునకవ్వల వింధ్యాద్రి యందున్నట్లు పెక్కింటియందు గానవచ్చెడిని. మేఖల పర్వతపంక్తి కాపేరు ప్రాచీనకాలమున జెల్లుచుండె నని యాధునికపరిశోధకపండితు లభిప్రాయపడి యున్నారు. కావున వింధ్యాదితో జోడింపబడిన పరబలము కళింగబలమే కావలయును.

సైన్యము లాసంవత్సరమునందే వేంగిని స్వాధీనపఱచుకొని కంచిని బోయి చేరిరని నిశ్చయమగుచున్నది.

కంచియందు హొయ్సళ వీరనరసింహుఁడు తాన్యమునిలిపిన భేరుండులచటనే యుండగనే యని యంకభీముఁడును, నతనిపక్షమువారును నచట దండెత్తుబిడిసిరో తెలియదు. ఎట్లు విడిసిననేమి, వారచట దీర్ఘకాల మాగజాలరైరి. భేరుండులు వీరి నోడించి వింధ్యాద్రివఱకు బోయివచ్చినట్లు హొయ్సళశాసనములు దెల్పుచున్నవి.

"ఇతో భేరుండవర్గ స్తదాజ్ఞయా కాంచీపురే కియంతం కాలం స్థిత్వా,—

శ్రీమత్కాంచీపురేశం
జగదభయకరం పూజ్య మల్లాళనాథం
దృష్ట్వా తచ్ఛిన్నవేద్యే
నిజవిజయభుజద్వంద్వకే సంవిధాయ
భృత్యా నిర్గత్య తస్మా
త్పరబళ మతులం వింధ్య మద్రిం విజిత్వా
ప్రత్యాగా న్యస్య కీర్తి
ర్విజయతి భువనే వీరభేరుండవర్గః" 75

ఇచట వింధ్యాద్రితోగూడ పేర్కొనబడిన పరబలము కళింగబలము; వింధ్యాద్రిని జెప్పుటవలన దత్పాంతసీమవఱకును భేరుండులు శత్రుల వెన్నంటి తఱిమిరని ధ్వని. హొయ్సళశాసనములం దిట్లనియంకభీముని సైన్యము నోడించి తఱిమిన కీర్తి యంతయు భేరుండులకే యారోపింపబడినను, నీకార్యమున వీరొక్కరే నిస్సహాయులై నెరవేర్చియుండలేదు. శత్రువులను దోలుటయందు వీరికి చోడతిక్కరాజును, భావిచోళచక్రవర్తి మ్ముమ్మడిరాజేంద్రచోడుడును దోడ్పడిరని పైనుదాహృతములైన స్థితవటశాసనముల వల్ల దెలియవచ్చుచున్నది. శిథిలములై యొట్టి దుస్థితి యందున్నను ఈ శాసనముల మూలమున మూఁడువిషయములు వ్యక్తములగుచున్నవి.

(౧) మనుమల్లి దేవుఁడు, అలిమల్లదేవుడు: "కాఞ్చీపురత్తిల్ కప్పమ్కొణ్డు మనుమల్లి దేవనైయుం

అలిమల్లిదేవనైయుం జయమ్సణ్ణి" అని సిద్ధకటశాసన గ్రంథము. వీరెవ్వరో తెలియదు. అప్పటి శాసనము లను బరిశీలించిచూడగా శకాబ్దము ౧౧౯౯ (క్రీ. శ. ౧౨౭౭) నాటి యొక్క త్రిపురాంతక శాసనమున ఏఱువ మనుమల్లిదేవు డొక్కడు గానవచ్చుచున్నాడు. 76 చోడ తిక్కరాజు "ఏఱువమన్నీల నెఱవుట్టగా నేలె" నని కేతన 77 చెప్పియుండుటచేతనీమనుమల్లిదేవుడును, ఏఱువమనుమల్లిదేవుడును నొక్కపురుషుడే కావచ్చును. అలిమల్లిదేవుని పొడ శాసనములందుగాని, వాఙ్మయమందు గాని మఱియెచ్చటను గానరాదు.

(౨) తుంగభద్రానదివఱకు దాడి: "మేకఱ తుఙ్గబద్ధిరై యళవు న్చెల్ల...ణ్డు" అని సిద్ధకటశాసనము. ఇందువల్ల పశ్చిమదిశయందు తుంగభద్రానది పర్యంత మెవ్వరిమీదనో దాడివెడలినట్లు తెలియుచున్నది. తుంగభద్రాతీర దేశమంతయు నీకాలమున సేవుణరాజు సింహణదేవుని యేలుబడిక్రింద నుండెను. సేవుణులకును, నెల్లూరు చోళులకును వైరముండినట్లు సమకాలిక వాఙ్మయమువలన దెలియుచున్నది. కేతన దశకుమార చరిత్రమందు చోడ తిక్కరాజు "సేవణకటక సామంతుల గర్వ మణచె" నని చెప్పి, సిద్ధయబాచని శౌర్యమును గొండాడుచు నీవిషయమునే,

"ఉరువడి నుగ్రసేవణప
యోనిధి బాడబవహ్నిచాడ్పునన్
దరికొని కుంభజన్మక్రియ
దాగి రఘుక్షితినాథుమాడ్కి న
చ్చెరువుగ నింక జేసెనని
చెప్ప జనప్రకరంబు విక్రమా
భరణుని సిద్ధనార్యసుతు
బాచని నన్నదగంధవారణున్."

అని విపులీకరించి వర్ణించియున్నాడు. 78

నెల్లూరు రాజ్యమునకు సేవుణరాజ్యము పశ్చిమమున గడిదేశముగుటచేతను, అనియంకభీముని దండయాత్రకల్ల గలిగిన నెల్లూరు రాజ్యమున గలిగిన సంక్షోభముచే సమయ మనుకూలపడగా పరస్పరవిరోధభయాలమున సేవుణులు నెల్లూరు రాజ్యముపై నెత్తివచ్చియుండవచ్చును. ఇందు సంగతముకాని దేదియు లేదు; కాని వాస్తవమును గనుగొనుట కింకను పరిశోధన యవశ్యము.

(౩) కులోత్తుంగ రాజేంద్రచోళుని దోలుట: "వడక్కు దిక్కుకులోత్తుఙ్గ రాజేన్దిరచో......వెట్టి పోక" అని సిద్ధకట్ట శాసనము. గ్రంథపాతముకల్ల 'వెట్టిపోక' అనుమాటలకు, దత్పూర్వ వాక్యమునకు గల సంబంధ మెట్టిదియో తెలియుటలేదు. ఈ కులోత్తుంగ రాజేంద్రచోళుడు క్రీ. శ. ౧౨౭౭ వఱకును జీవించియుండినట్లు కాకతీయ శాసనములవల్ల దెలియుట వల్ల గిత డీదండయాత్రాసందర్భమున మృతినందలేదనుట నిశ్చయము. 'వడదిక్కు' అని యుండుటచే కులోత్తుంగ రాజేంద్రచోళునితో యుద్ధ ముత్తరదిక్కున, నగా వెలనాడుప్రాంతమున జరిగెనని తోచుచున్నది.

పై చర్చవలన ముమ్మడికులోత్తుంగరాజేంద్ర చోళుడు ద్రావిడదేశమున కేల పోయెనో కొంతవఱకు విశదము కాగలదు. పోయిన రాజ్యమును మరల సంపాదించుకొనుటకు దన కులక్రమాగతశత్రువు లైన కాకతీయులకును, నెల్లూరు చోడులకును శత్రువైన కళింగ భూపాలు డగు ముమ్మడి యనియంకభీము నాశ్రయించి యతని వెంబడి ద్రావిడదేశమునకు బోయెను; కాని హొయ్సల చోళ నెల్లూరుచోళ సైన్యము లేకీభవించి యుద్ధముసేయగా నెదుర్కొనజాలక పరాజయము నంది కళింగసైన్యములతో గూడ వెనుదిరిగి స్వదేశమునకు బోయిచేరెను.

76. ARE. 190. of 1905.

77. దశ. ౧-౧౬.

78. దశ: ౧4౧౬, ౭౯.

# నామకరణం

= శ్రీ వేరుసోమయాజుల వరహాలు =

నామకరణం అనగా పేరుపెట్టడం. జీవధారణకు ప్రాణవాయువు యెంత అవసరమో వ్యవహారణకు నామకరణంకూడా అంత అవసరమే. అసలు మానవజీవితంలో నామకరణం అవసరములేని వ్యవహారమే లేదు. కేవలం వ్యక్తిగతంగానే కాకుండా సర్వత్రాకూడా నామకరణం కానిదే యేవ్యవహారమూ సాగలేదు. మానవుడు సంఘజీవి. ఇద్దరు మనుష్యులు ఒకదగ్గర చేరగానే ఓ సంఘం యేర్పడుతోంది. వెంటనే దానికో నామకరణం కానిదే కథ నడవదు. కలం చేతబుచ్చుకొని రెండు గీతలు గీసేసరికి వెంటనే దానికో నామకరణం కానిదే చలామణీ కాదు. పిల్ల పుట్టగానే పేరుపెట్టాలి. ఈలాగ్గా మానవజీవితంలో అడుగుదీసి అడుగుపెట్టేసరికి తుగుపుసవారిలాగు ముందుగా సిద్ధమౌతోంది నామకరణం. ఇంకా యిందులో వుండే చిదంబరరహస్యమేమిటంటే నామకరణంలో యెంత కళాకౌశలం వుంటే ఆపదార్థానికి అంత చలామణీ జాస్తీగా వుంటుంది.

గర్భాధానము, పుంసవనము, సీమంతము మొదలైన హైందవుల షోడశకర్మలలోనూ యీ నామకరణంగూడా ఓకర్మగా వుంటోంది.

సాధారణంగా శిశువు జన్మించిన పదకొండో రోజున బారసాలమహోత్సవం జరిగించడం సంసారుల కర్మకాండ. ఆ దినం మాతాశిశువులు, జనకుడు శుచిస్నాతులై బంధుమిత్రపరివార సమక్షంలో అభ్యుదయపరంపరాభివృద్ధికోసం వినాయకపూజ, పుణ్యాహవాచనం జరిపిన యనంతరం పళ్ళెంనిండా బియ్యం (సాధ్యమైనంతవరకూ ఉప్పుడుగాకుండా పచ్చివి) పోసి అందులో ఓ పొడుగాటి పసుపుకొమ్ముతో శిశువుతండ్రి ఆ జన్మించిన శిశువుపేరు ఫలానా అని వ్రాస్తాడు. తరవాత ఆ బియ్యం కాస్తా పురోహితుడు అంగవస్త్రంలో మూటకట్టేసుకున్నా, ఆ వ్రాసినపేరు, అనగా చేసిన నామకరణంమాత్రం సంఘంలో చిరస్థాయిగా నిలిచిపోతుంది. (శూద్రాదుల్లో ఇంతతంతూ జరగకపోయినా నామకరణం మాత్రం అందరికీ జరిగేతీరుతోంది)

ఈలాగు కర్మకాండానుసారంగా వ్యక్తికి జరిగే నామకరణం ఒకటి ఆలా వుండగా కొంతకొంతమందికి జీవితకాలంలో మధ్యమధ్య పునఃపునః నామకరణాలు కూడా తదితరవ్యక్తులచేత వారి వారి ప్రవర్తనలకొద్దీ, ప్రఖ్యాతికొద్దీ, గుణాతిశయాలకొద్దీ, తెలివితేటలకొద్దీ, ప్రయోజకత్వాలకొద్దీ, తుదకు ప్రారబ్ధం కొద్దీకూడా ప్రసాదింపబడుతూ వుంటున్నాయి. ఇంకా ఒక్కొక్కప్పుడు ఓ విధమైన బుద్ధిజాడ్యజనితోన్మాదంవల్లా వ్యక్తి తనకుతానే ప్రత్యేక నామకరణాలు కూడా చేసుకుంటున్నాడు. అందువల్ల యీ నామకరణంలో భిన్నభిన్న జాతులు యేర్పడ్డాయి. వాటి నన్నింటినీ ప్రధానమైన అయిదు తరగతులుగా విభజింపవచ్చు.

## ౧. సాంప్రదాయానుసారంగా తల్లిదండ్రులు శిశువుకు పెట్టే పేర్లు

## (Traditionals)

సాధారణంగా వ్యక్తికి ప్రథమసంతానం పుత్రుడైతే తండ్రిపేరు, పుత్రిక అయితే తల్లిపేరు నామ

కరణంచేయడం హిందూమతాచారం. కొందరు చిరకాలం అనపత్యులుగా వుండి సంతానంకోసం తపిస్తూ యెన్నో దేవుళ్ళకు మ్రొక్కి, యెన్నో నోములు నోచి తుదకు యేదేవుని కరుణాకటాక్షవీక్షణలచేతనో, యే నోము ఫలముచేతనో సంతానం కలగగానే ఆ సంతానానికి ఆదేవుని పేరు కృతజ్ఞతాసూచకంగా నామకరణంచేయడం ఓ ఆచారంగా వుంటోంది. బహుళంగా సంతానం కలవారు యిటు పితృదేవతలవి, అటు విశ్వేదేవుళ్ళవి నామకరణలు తమ సంతతికి చేసి చరితార్థులవుచున్నారు. కాని యీ పని అందరికీ అనుబాటులో వుండదు. లేకలేక ఒకే సంతానం కలిగినప్పుడూ, కేవలం సంతానం లేకుండా దత్తత చేసుకోవలసిన దౌర్భాగ్యం తటస్థించినప్పుడూ యిటు విశ్వేదేవుళ్ళను, అటు పితృదేవతలనూ కూడా తృప్తి పరచలేకపోతున్నారు. ఇట్టి పరిస్థితులలో యే ఒక్కరినీ కూడా త్రోసిరాజనడానికి వీలులేక ఆ వొక్క శిశువుకే అన్ని పేర్లూ పెట్టి "అప్పలజోగి సూర్య సుబ్రహ్మణ్య వేంకటదుర్గా నృశింహసాహేబ్ హరనాథ తాజోద్దీన్ దయాళ్ సత్యనారాయణ మూర్తి" అని జానెడు శిశువుకు బారెడు నామకరణం చేస్తున్నారు. ఇట్టి నామధేయాలను శుద్ధించి వ్రాసినప్పుడు కూడా ౫౬ అక్షరాలు గల తెలుగుభాష యేదోలాగు దేవులాడుతోందిగాని ౨౬ అక్షరాలే గల మన రాజభాష దివాలా (Bankruptcy of letters) తీయవలసి వస్తోంది. పానుగంటివారు సంస్కృతంవరకూ పరిగత్తి "హగుంసస్సుచిషద్వసురంతరిక్షసత్" అనే బుక్కను పలకమని పాశ్చాత్యుల్ని సవాలుచేసేరుగాని యీ మన తెలుగునామకరణలనైనా శ్వేతముఖులు పూర్తిగా నోట నుచ్చరించగలరా అని నా అనుమానం.

కొందరికి ప్రారబ్ధవశాత్తూ సంతానం కలుగుతూ వుండడం, ఆ కలిగిన సంతానం శైశవంలోనే నశిస్తూ వుండడం, తన్మూలంగా ఆ తల్లిదండ్రుల జీవితం కరాళాంధకారబంధురం అవుతూ వుండడం మనం కళ్ళారా నేటికీ చూస్తూనే వున్నాం. అట్టివారికి కొన్ని పిచ్చినమ్మకాలు ఆవిర్భవిస్తున్నాయి. కలిగిన శిశువుకు యే అంగరక్షలూ, యే ముద్దుముచ్చటలూ లేకుండా యేహ్యంగా చూస్తే ఆ బిడ్డ మరి చచ్చిపోకుండా తమకు దక్కుతుందన్న ఓ ఆశయం, అందుకు కొన్ని తార్కాణలు వారికి లభిస్తున్నాయి. అందుచేత శిశువు కలగగానే ఆ శిశువును పెంటకుప్పపై కొంతసేపు పరుండబెట్టి తిరిగి యింట్లోకి తెచ్చుకొని "పెంటమ్మ"లేక "పెంటయ్య"అని తంతులేని నామకరణం చేస్తున్నారు. మరికొందరు కలిగిన శిశువును నిచ్చెనమెట్లకు మధ్య గల కన్నములగుండా యిటూ అటూ మూడుసార్లు లాగి"కన్నయ్య"లేక "కన్నమ్మ" అని నామకరణంతంతు లేకుండాచేస్తున్నారు. బైరాగి, పిచ్చయ్య, గుండుగాడు యిత్యాదులు యీతెగలోనివే. ఈ వింతఆచారం ఒక్క మన ఆంధ్రులలోనేగాకుండా తదితరభారతజాతులలో కూడా అమల్లోవుంది. తమిళులు యీపరిస్థితులలో బిడ్డకు "కుప్పుస్వామి"అని నామకరణం చేస్తున్నారు. (కుప్పై అనగా అరవంలో పెంట అని అర్థం) ఉత్తర హిందూదేశంలో యీ ఆచారం ఓ వింతపరిణామంతో వ్యవహారంలో వుంది. ఔత్తరాహులు యిట్టి పరిస్థితులలో బిడ్డ కలుగగానే ఆ శిశువును ఓ కడుపు చలవగల స్త్రీచేతికి అందిస్తారు. తరవాత ఆ శిశువును కన్నతల్లి ఆ శిశువును పట్టుకొనివున్న స్త్రీకి ప్రణమిల్లి అతిదీనంగా పుత్రభిక్ష పెట్టమని శతవిధముల బ్రతిమాలుకొని ఒకటో మూడో అయిదో యేడో గ్రుడ్డిగవ్వలు ఆశిశువుకు మూల్యంగా ఆమెకిచ్చి ఆ బిడ్డను కొనుక్కొని పెంచుకుంటుంది. అట్లు యెన్ని గవ్వలకు శిశువును కొనుక్కుంటే అంత సంఖ్య గల నామకరణం ఆబిడ్డకు తంతులేకుండా చేస్తారు. ఈ విధంగా చేయబడ్డవే "తీన్‌కౌడీలాల్", "పాంచ్‌కౌడీ మిత్రా", "సాత్‌కౌడీబెనర్జీ" యిత్యాదులు. (కౌడీ అనగా గ్రుడ్డిగవ్వ అని అర్థం.)

అగోచరులై మనవెంట "తథాస్తుదేవత"లని కొందరు దేవత లుంటున్నారనీ, వారు అదేపనిగా

మన నోటినుండి వెలువడిన ప్రతీమాటకూ "తథాస్తు" అని ఆశీర్వదిస్తూవుంటారనీ హైందవమతావలంబకుల గాఢవిశ్వాసం. (బహుశా చర్చిల్ గారి "వి"కూడా యీలాంటి విశ్వాసంతో నెలకొల్పబడ్డదే అనుకుంటాను) అందుచేత ముఖ్యంగా క్షత్రియులు తమ సంతతికి "శత్రుమర్దనుడు" "అరిభయంకరుడు" "సంగ్రామజిత్తు"అని నామకరణాలు చేస్తే యీపేరులు వారిని పిలిచినప్పుడెల్లా "తథాస్తు"అని తథాస్తుదేవతలు ఆశీర్వదించడంవల్ల ఆశిశువులు పెరిగి నిజంగా అంతటి వాళ్లు కాగలుగుతారన్న నమ్మకంతో అట్టి నామకరణలు చేస్తూవచ్చేరు.

ఇప్పుడిప్పుడు "బాలగంగాధరతిలక్" "గోపాలకృష్ణగోఖలే" మున్నగు నామకరణలుకూడా తెలుగువారిలో వినబడుతున్నాయి. ఆ మహనీయుల స్మారక చిహ్నంగా తమ పిల్లలకు తెలుగువారు నామకరణలు చేయడం ప్రశంసనీయమేగాని ఆ మహనీయుల యింటిపేరుకూడా మనవాడికి పేరుగా పెట్టడం యెంతైనా అసందర్భం అనకతప్పదు. ఇట్టిపని తెలిసే చేస్తున్నారో, తెలియకే చేస్తున్నారో నాకు బోధపడలేదు. ప్రతీవ్యక్తికీ పేరు, యింటిపేరు అని రెండు వ్యవహారణలో వుంటున్నాయి. వాటి క్రమంకూడా సర్వత్రా ఒక్కలాగే ముందు పేరు, తరువాత యింటిపేరుగా వుంది. ప్రపంచకంలో ఒక్క మన తెలుగునాటనే యీక్రమం అక్రమమై ముందు యింటిపేరు, పిమ్మట పేరు వ్యవహరించబడుతోంది. మహారాష్ట్రులలో పేరు ముందు, యింటిపేరు పిమ్మట వ్యవహరింపబడుతుంది. "తిలక్" "గోఖలే" యిత్యాదులు వారిలో యింటిపేర్లు. అందుచేత "బాలగంగాధరుడు" అని నామకరణం చేస్తే బాగుంటుందిగాని, "బాలగంగాధరతిలక్"అంటే మనకు యింటిపేరు మొదట వుండడంచేత పేరు రెండు యింటిపేర్లకు మధ్య బడుతోంది.

## ౨. పురపులు, ముద్దుపేర్లు

## (Alias and Petnames)

పైనుదాహరించినప్రకారం సాంప్రదాయానుసారంగా వ్యక్తికి జరిగిన నామకరణం ఒకటి అలా వుండగా ఓ ప్రత్యేకతకోసమో, ముద్దుకోసమో క్రొత్తక్రొత్త నామకరణలు వ్యక్తికి చేయబడుతూ వుండడంకూడా మనలో అలవాటుగా వుంది.

హిందూస్త్రీ తన భర్తపేరు బాహాటంగా నోట నుచ్చరింపరాదు. అట్టి తరుణంలో తన భర్తపేర నామకరణం చేయబడ్డ ముద్దులకుమారుని ముదుసలి అవ్వ యెట్లు యెగ్గొత్తి పిలవగలదు? అందుకు తరణోపాయం ఒకటి ఆఅవ్వ కనిపెట్టింది. ఆబాలునిని "తాతమ్మ"అని పిలుస్తుంది. కొంతకాలానికి పారపాటైన పరిపాటితో అందరూ ఆబాలుని "తాతమ్మ" అనే పిలుప నారంభిస్తారు. ఈ"తాతమ్మ" అన్న రెండవ పేరే ఆశిసువుకు పురపు పేరుగా వ్యవహరింపబడుతుంది. ఇంకా ఒకేస్థలంలో వుండే వ్యక్తులలో ఒకరికంటే యెక్కువమందికి ఒకే నామకరణం తటస్థించినప్పుడు వారివారి ప్రత్యేకతను రూపించడానికి చిన్న, పెద్ద, పొట్టి, కర్రి యిత్యాది పురపులుకూడా నామకరణం చేయబడుతున్నాయి. కొందరికొందరి ప్రత్యేకత రూపించడానికి వారివారి తల్లిదండ్రుల పేర్లు వారివారి పేర్లకు ముందు పురపులుగా వ్యవహరింపబడుతున్నాయి. ఉదా: "బుచ్చన్నగారి రామన్న", "అచ్చమ్మగారి బాలామణి"యిత్యాదులు. ఆధునికంలో, ముఖ్యంగా పారిశ్రామికకేంద్రాలలో వ్యక్తుల హోదాలు, పనిచేసే డిపార్టుమెంట్లు పురపులుగా వాడబడుతున్నాయి. ఫస్టుహేండురామారావు, యింజినీరురాజు, ఓవర్‌సీరునాయుడు, లేబరేటరీశాస్త్రి, స్టోర్సురావు, ట్రాఫిక్‌శర్మ, కంట్రోలు పంతులు యిత్యాదులు.

తల్లిదండ్రులు తమ సంతతికి విధ్యుక్తంగా పేరుపేరు నామకరణలు చేసికూడా వారిని ఆయాపేర్లతో పిలువక ముద్దుకోసం అమ్మాజీ, అమ్మడు, బాజ్జీ,

# నటీమణులవలె మీశరీరసౌందర్యమును కాపాడుకొనుడు!



## శోభన సమర్త్

శోభన ప్రతి దినము తన అందమును కాపాడు ఒక పద్ధతి అవలంబించు తుంది. ప్రొద్దున సాయంత్రము ఆమె లక్స్ టాయిలెట్ సబ్బుయొక్క చురుకైన నురుగుతో రుద్దుకొని నిర్మలమైన నీళ్లతోకడుగుకొనును. "ఎల్లప్పుడుచేసే ఈ స్వల్పమైనపని నా చర్మాన్ని అందంగా మృదువుగా, నిర్మలంగా వుంచుతుందని" చెపుతుంది. చాలమంది మన నటీమణులీ విధంగానే అంటున్నారు.




## లక్సు టాయిలెట్ సబ్బు

LTS. 127-111-40 TL

LEVER BROTHERS (INDIA) LIMITED

# అతడు ధృడంగ వుండేటట్లు నీ వంతు!






ప్రతి గృహిణి ఏ ఆహార పదార్థములు శక్తి నిచ్చునవో తెలుసికొనవలెను. డాల్డా పాకశాస్త్రమను పుస్తకము (ఇంగ్లీషులో అచ్చువేయబడినది) 150 ఇండియన్ వివిధ తినుబండారములు తయారుచేయు పద్ధతులతో కూడినది. మిక్కిలి వుపయోగకరమైన విషయములు గలవు. మీకు ఒక కాపీ వుండుట ముఖ్యావసరము. 4 అణాల బిళ్లలు Dept. B110 P. O. Box No. 153, Bombay, పంపుడు.

తల్లులారా! మీ సంసారానికి వంట వండేటప్పుడు మీ ంత బాధ్యత
వున్నదో మీరు గ్రహించారా? మీరు తెచ్చిన వంట ్గ్రిని వండే
విధానంతో మీ పిల్లలకు మీరు శక్తిని ప్రసాధించి బలముగల
వారినిగానైనా చేయగలరు — లేక ఎందుకూ ప ండా వుండే
దుర్బలులుగాను, నీరసంగా వుండే వారిలాగానైనా త చేయగలరు.

ఆహార పదార్థములు "బలము నివ్వగలుగుటలో" రకములుగా
వుంటవి — మీరు బాగా గమనించండి. కొన్ని మంచి పుష్టినివ్వగలవు — మరికొన్ని ఆకలిమాత్రం ఆపి, రుచికరంగా వున్నట్లుండి, బలముమాత్రం ఇవ్వలేవు. అందుచేతనే బాగా యింతో అంతో తిన్నప్పటికీ చాలా మంది నిస్సత్తువగా వుంటానికి కారణం. అయితే అన్ని ఆహారపదార్థములు ఎక్కువ సత్తువ నిచ్చునట్టివిగా చేయుటకు వీలున్నది. విటమిన్లతో నిండిన డాల్డాతో ఆహారంవండుట యీ విషయంలో తప్పక తోడ్పడును. ప్రకృతి సిద్ధంగా కావలసిన ముఖ్యమైనటువంటివన్నీ, శక్తినివ్వగలిగి నటువంటివన్నీ "ఆహార పదార్థములు" డాల్డా యివ్వగలదు.

డాల్డా ఆహారాన్ని ఎక్కువ బలమును యిచ్చునట్లు చేయగలదని మేము నిర్ధారణ చేసితిమి.



విటమిన్లతోనిండిన  బలమునకు

RING CO., LTD.

బాబూరావు, చిట్టి, బుచ్చి, నాన్ని యిత్యాది పేర్లతో పిలుస్తూవుండడం, ఆ పేర్లే యిరుగుపొరుగు వారికికూడా పరిపాటిఅయి ఆశిశువులు పెరిగి పెద్దలైనతరువాతకూడా వాడుకలోవుండి వురఫులుగా వ్యవహరింపబడుతూవుండడంకూడా మనలో అమల్లో వుంది.

### ౩. ప్రశంసాలబ్ధాలు (Distinctions)

వ్యక్తి తన జీవితకాలంలో అసాధారణమైన ప్రజ్ఞాప్రకర్షలను యెందులోనైనా చూపించినప్పుడూ, త్యాగం, పరోపకారపారీణత మున్నగు సుగుణములను వ్యక్తీకరించినప్పుడూ ప్రజానీకం వారు వ్యక్తీకరించిన యోగ్యతలకు, మహనీయతకు, విశిష్టతకు ప్రశంసా సూచకంగా వారికి "కవితిలక" "నటశేఖర" "కళాప్రపూర్ణ" "దేశోద్ధారక" "లోకమాన్య" "మహాత్మ" యిత్యాది క్రొత్తనామకరణాలు ప్రసాదిస్తున్నారు.

### ౪. వేళాకోళంవెక్కిరింతల పేర్లు

### (Nicknames)

సంఘంలో కొందరు యే విషయంలోనైనా వెనుకబడి, విధ్యుక్తధర్మం మాని, క్రమపథం తప్పి, అసందర్భంగాను అవకతవకగాను ప్రవర్తిస్తే వారిని మిగిలినవారు హేళనజేస్తూవింతవింతవికారపు నామకరణాలు చేసి కమ్మగడుతూ వుండడం కూడా ఓ అలవాటుగా వున్నది. చెడుగు చూచి సహించుకోలేని మానవునిలో గల ఓ వింతతత్వమే దీనికి మూలకారణం. కాళిదాసంతటి ఘనమనీషే ఓ సందర్భంలో కాశీలో వున్న వేదవ్యాసుని శిలావిగ్రహం చూచి హేళనగా "చకారకుక్షీ" అని పొట్టపై వేలుతో పొడిచేడట. భట్టుహర్షుని శృంగారనైషధం తెలిగించిన తరువాత శ్రీనాథకవిసార్వభౌమున్నే ఆంధ్ర పండితులు "డు. ము. వు. లు" గా మన్నారట.

ఆర్యాంధ్రులు మన దేశంలో ప్రబలకపూర్వం "నాగులు" అనే తెగవారు యిక్కడ నివసించేవారట. వారిని అనాగరికులని, ఆటవికులని, పరమశుంఠలని ఆర్యాంధ్రులు చాలా యేహ్యంగా చూస్తూవుండేవారట. తమలో యే ఒక్కడైనా యేసందర్భంలోనైనా కొస్త అసందర్భంగాను, అవకతవకగాను ప్రవర్తిస్తే వాడిని "ఓరి నాగన్నా" అనో, "ఓరి నాగమ్మా" అనో నాగులతో సరిపోల్చి తట్టాబాజీ చేసేవారట. ఆనాటి అలవాటే యీనాటికీ ఆంధ్రులలో అమలు జరుగుతోందని శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు తమ ఆంధ్రుల చరిత్రలో ప్రవచించేరు. ఇట్టి వాఙ్మయం యిప్పటిలో యెంతగా పెచ్చుపెరిగిపోయినదీ అందరకూ

### ౫. కృత్రిమనామకరణాలు

### (Non-de-Plumes)

పైనుదాహరించిన నాలుగురకాల నామకరణాలు వ్యక్తికి తదితరవ్యక్తులచేత చేయబడతవి. ఈ అయిదో రకపు కృత్రిమనామకరణంమాత్రం వ్యక్తి తనకుతానే చేసుకుంటున్నాడు. ప్రాచీనకాలంలో అజ్ఞాతంగా వుండవలసివచ్చినప్పుడు తదనుగుణ్యంగా వుండేటందుకుగాను వ్యక్తి తన నిజనామధేయాన్ని మరుగుపరిచి ఓ కృత్రిమనామకరణం తనకుతానే చేసుకొనేవాడు. పంచపాండవులు వనవాసం గడపి అజ్ఞాతవాసానికి ప్రారంభించినప్పుడు ధర్మజ, భీమ, అర్జున, నకుల, సహదేవులు అన్న తమ నిజనామధేయాలను మరుగుపరిచి కంకుడు, వలలుడు, బృహన్నలు, దామగ్రంథి, తంత్రీపాలుడు అని కృత్రిమనామకరణాలను తమకు తామే చేసుకున్నారు.

ఆధునికంలో యీ కృత్రిమనామకరణాలు విపులంగా రచయితలు, విమర్శకులు, విలేఖరులు చేసుకుంటున్నారు. ఓ విషయంమీదనో, ఓ గ్రంథం మీదనో, ఓ వ్యక్తిమీదనో దెబ్బదీసేటప్పుడు రచయిత తన నిజనామధేయాన్ని (incognito) మరుగుపరచి ఓ కృత్రిమనామకరణం తనకుతానే చేసుకుని పత్రికలలో ప్రవేశిస్తున్నాడు. "సురుచి" "దేశదిమ్మరి", "విహారి" "శేడియో" యిత్యాదులు యీ సంబంధాలే.

ఇక్కడికి వ్యక్తికి యితరులు చేసేవి, వ్యక్తి తనకుతాను చేసుకునేవి నామకరణాలు పరిశీలించేము. ఇక కొత్త స్థాలీపులాకంగానైనా వ్యక్తి వ్యక్తికి గాకుండా తదితరసృష్టిసంతానానికి చేసే నామకరణాలు గూడా పరిశోధిద్దాం. మొదటినుండీ నామకరణాలు చేయించుకోవడం, చేసుకోవడం, చెయ్యడం అన్న త్రివేణీసంగమంలో మునిగి తేలుతూ వున్న మానవుడు స్వీకృతమైన ప్రతీకర్మకు, నిజ పోష్యవర్గంలో వున్న ప్రతీదానికి కూడా యేదో నామకరణం చెయ్యనిదే వ్యవహరించ లేకపోతున్నాడు. దర్జీవాడు చేతులులేకుండా ఓ చిన్న జుబ్బా కుట్టి దానికి "జహ్వారీవేస్టు" అని నామకరణం చేస్తున్నాడు. మంగలి ఓరకంగా తల కత్తిరించి దానికి "విఠల్ క్రాపు" అంటున్నాడు. చాకలి "పేరిస్ మడత" అంటున్నాడు స్వర్ణకారుడు "స్వస్తికగాజులు" అంటున్నాడు. సాలీడు"అత్తాకోడలి"అంచు నేస్తున్నాడు. యిత్యాదులు యింకా అనేకం వున్నాయి. మన పోష్యవర్గంలో వున్న జంతువులకు, చెట్లకుకూడా నామకరణం జరుగుతోంది. మనుష్యులలో వున్న పేర్లు అన్నీకూడా యించుమించుగా కుక్కలకు, క్రోటన్సుమొక్కలకు, పచ్చగడ్డి తిప్పలకు కూడా నామకరణాలు చేయబడి వున్నాయి. ఇట్టి విధంగానే హంసలకు, చిలకలకు, గోరింకలకు, పావురాలకు అంతఃపురస్త్రీలు ముద్దులొలుక నామకరణాలు చేసినట్టు మన వాఙ్మయంలో రుజువులు కొల్లలుగా వున్నాయి. ఈ అలవాటుకూడా ఆదినుంచీ వస్తోంది. యమునాతీరంలో చెదిరి మేస్తూ వున్న ఆవుల్ని వాటివాటికి యిదివరకు చేసిన నామకరణాలతో గోపాలకృష్ణుడు యెట్లు యెలుగెత్తి పిలిచేడో చూడండి.

సీ. "రా! పూర్ణచంద్రిక, రా! గౌతమీగంగ
రమ్మ! భగీరథరాజతనయ
రా! సుధాజలరాశి, రా! మేఘమాలిక
రమ్మ చింతామణీ, రమ్మ సురభి
రా! మనోహారిణి, రా! సర్వమంగళ
రా! భారతీదేవి, రా! ధరిత్రి
రా! శ్రీమహాలక్ష్మి, రా! మందమారుతి
రమ్మ! మందాకిని రా! శుభాంగి

ఆ. గీ. యనుచు మరియు గలుగు నాఖ్యలు గల గోవు
లవవిలోన దూరమందు మేయ
ఘనగభీర భాష గడు నొప్ప జీరు నా
భీరజనులు వొగడ బెంపు నెగడ"

(పోతనభాగవతము, దశమ స్కంధము)

ఇట్టి విధంగానే వ్యక్తికి చెప్పబడ్డ తదితర సత్త సంతానాల నామకరణాలలోనూ గొడవ లున్నాయి. వాటి నన్నింటినీ యిక్కడ విశదీకరింప వీలులేదు యిక్కడికే వ్యాసం పెరిగిపోయింది.



# పారిశ్రామిక పంటలు

## పరిశ్రమాభివృద్ధి

= శ్రీ గూడూరి వెంకటచలం

ఇది పారిశ్రామికయుగం. ఈపారిశ్రామికరథచక్ర నేమిస్వనం ప్రపంచాన్నంతా సంక్షోభపెడుతోంది. నిముషానికి కొన్నివేలసార్లు తిరిగే చక్రాల హోరుకూ, ప్రశాంతంగా భూమిమీద పచ్చని శాలువను కప్పే పంటలకూ సంబంధం చాలా చిత్రంగా ఉంటుంది. మనం చక్కగా చలువచేసిన గ్లాసుగో మల్లు కట్టుకుని మన నాజూకుతనానికి మనం గర్వపడుతున్న క్షణంలో ఆ మల్లులోని ప్రతిదారానికీ చాళ్లు దున్ని, పేడా బూడిదా వేసిన మన్నులోనుంచి ప్రత్తిమొక్క లేచి, పుష్పించి ఫలించి వికసించిన కాయలాధారభూతాలని తలపుకువస్తుందా అని సందేహం. మనం ప్రాతస్సాయం సమయాల్లో స్నేహితులతో సేవించే కాఫీ తేనీరులలో తియ్యదనాన్ని తెచ్చే, స్వచ్ఛంగా స్ఫటికంలాగా మెరుస్తున్న పంచదారకణాలకు ఎండకూ వానకూ నవ్వుతూ ఇంకా కొత్తఆకు తొడుగుతున్న చెరుకుమొక్క ఎంతబాధ్యత వహిస్తుందో గ్రహించాలి. అనగా మన భాగ్యభోగ్యాలను లభింపజేసేవి పరిశ్రమలు. ఆ పరిశ్రమలను నడిపించే ముడిపదార్థాలను ఇచ్చేవి పంటలు. ఈపంటలు పండిన చోట్ల పరిశ్రమలు వెలుస్తాయి. పండించిన రైతుల నట్టిల్లు బంగారము అవుతుంది.

ఒకప్పుడు మనదేశంలో పరిశ్రమలు విశేషంగా లేని రోజుల్లో కూడా మనకు ఆహారపదార్థాలకు అక్కరకురాని అనేకపంటలను రైతులు పండిస్తుండేవారు. ఈపంటలు విదేశాలకు ఎగుమతి అవుతుండేవి. రైతుకు చేతిలో డబ్బుపడేది. అయితే వీళ్ల లాభనష్టాలన్నీ ఇతరదేశాల పరిశ్రమలమీద ఆధారపడివుండేవి. కారణం మనదేశంలో పరిశ్రమలు వృద్ధికాకపోవడమే. అనగా విదేశాల్లోని పారిశ్రామికులకు మనం ముడిసరుకుల సరఫరాదార్లుగా వుండేవాళ్లం. మన ముడిసరకువిడుదల విదేశపారిశ్రామికుల దయాధర్మబిచ్చములపై ఆధారపడిఉండేది.

మనం యుద్ధానికి పూర్వం రమారమి ౧౫౦ కోట్ల రూపాయల ముడిసరుకులను ఎగుమతిచేస్తుండేవాళ్లం. ఇందులో ౧౨౦ కోట్ల రూపాయల ఎగుమతులు మన రైతు పండించిన పంటసరుకులే. కేవలం ఎగుమతులనే నమ్ముకొని, ఇతరదేశాలను నమ్ముకొని ఎంతకాలం రైతులు పండించగలరు? దీనివలన రైతులు ఒకప్పుడు విపరీతమయిన నష్టాలకు పాలవుతారు.

దీని కొక చిన్న ఉదాహరణం. ౧౯-వ శతాబ్దంనుంచీకూడా మన దేశంలో నీలిమందుపంట పండిస్తుండేవారు. ౧౮౯౬లో సుమారు ౧౭ లక్షల ఎకరాలలో ఈ నీలిమందుపంట సాగుబడిఅవుతుండేది. పదివేలటన్నులదాకా ఎగుమతి అవుతుండేది. ౧౮౯౭లో జర్మనీలో రసాయనికరీత్యా నీలిమందుచేయుడం కనిపెట్టారు. ఈపాతికముప్ఫయిఏళ్లలో మన నీలిమందుఎగుమతి పదివేలటన్నులనుంచి పాతికటన్నులయిపోయింది. ఇక ధరంటారా? టన్ను ౨౧౦ వేలు అమ్మేది రు. ౩౭౦౦ అయిపోయింది. దీనివలన

చాలామంది రయితులు నష్టపోయి, ఈపంటను మాని వేయవలసివచ్చింది. అయినా మన దేశంలో చిన్న చిన్న నీలిమందుఫ్యాక్టరీలు తయారయి పంటనీలి మందును వాడుకచేయడంమూలాన అధమం ౯౦ వేల ఎకరాల్లో అయినా ఈపంట సాగుబడిఅవుతోంది.

మనం ఎగుమతిచేసే ౧౨౦ కోట్ల రూపాయలలో ౪౨ కోట్ల రూపాయలు నార, ప్రత్తిపంటల ద్వారా వస్తోంది. మన ప్రత్తిసంగతి చూడండి. యుద్ధానికి పూర్వం ౨ కోట్ల ౪౦ లక్షల ఎకరాల ప్రత్తిపంట సాగుబడిలో వుండేది. సుమారు ౪ కోట్ల ౭ లక్షల బేళ్లు(నాలుగువందలపౌనులవి) ప్రత్తిపండేది. ఇందులో మన బట్టలమిల్లులు ౨౯ లక్షలబేళ్ల ప్రత్తి మాత్రమే ఉపయోగించేవి. ఇతరత్రా ఇంకో ౪౭ లక్షల బేళ్లు ఉపయోగపడేది. ఇక మిగిలిన ౩ కోట్ల ౪౫ లక్షల ప్రత్తిబేళ్ల విడుదలకోసం విదేశాల ఆగ్రహానుగ్రహాలపై ఆధారపడిఉండాలి. ఆఖరుకు ఈ ముడి సరకువిడుదలకోసం ౧౯౩౪ జనవరిలో జపానుతో వాణిజ్యసంధికూడా చేసుకోవలసివచ్చింది. ఈ సంధి ఫలితం ఒక సంవత్సరంలో మనం జపానుకు పదిలక్షల బేళ్లను ఎగుమతిచేస్తే వాళ్లు మనకు ౩౨౭ కోట్ల గజాల గుడ్డ దిగుమతిచేస్తారు.

మనం ఈవిధంగా ముడిసరుకులను పంపి తయారయిన సరుకులను దిగుమతిచేసుకుంటే దేశంసిరి సంపదలు ఎప్పటికిన్నీ వృద్ధికావు. ప్రజాసామాన్యపు దైనికజీవితప్రమాణంకూడా వృద్ధికాదు. ముడిసరుకుల పంటలతో కూడా వానిని వినియోగించే పరిశ్రమలు కూడా వృద్ధికావాలి. అప్పుడే వానిని పండించిన రైతు, వినియోగించిన పారిశ్రామికుడు, పనిచేసిన కార్మికుడు అందరూ సర్వతోముఖంగా సంతృప్తి పొందుతారు. దీనికి పంచదారపరిశ్రమయే ప్రబల తార్కాణం.

చెరకుప్రత్తినారపంటలు, పొగాకు, నూనె గింజలు, అనగా వేరుశనగ, నువ్వులు, సీమఅవిశె మున్నగునవి—ఇవి మన దైనికజీవనానికి ముఖ్యంగా అవసరం. ఇవి అధికంగా పండించి, ఉన్న పరిశ్రమల ఉత్పత్తి ఎక్కువచేయడానికీ, కొత్త పరిశ్రమలు స్థాపించడానికీ నైసర్గికవాతావరణపరిస్థితులు మనకు చాలా అనుకూలంగా ఉన్నాయి.

పన్నెండుపదమూడేళ్ల క్రిందటిదాకా మనంవాడుకునే ప్రతిచెమ్చాపంచదారకూ మనం జావాఫ్యాక్టరీదార్లకు ధన్యవాదాలు చెబుతూఉండేవాళ్లం. ౧౯౩౧-౩౨ లో దేశంలో ఒక లక్షన్నరటన్నుల పంచదార తయారయేది. దాదాపు ఆరులక్షల టన్నుల పంచదార దాకా విదేశాలనుండి దిగుమతిచేసుకొనేవాళ్లం. మన దేశంలో ప్రతిమనిషీ సగటున ౨౩ పౌనుల బెల్లం గాని, పంచదారగాని తింటాడు. ఇందులో ౧౪ పౌనులు బెల్లం రూపంగాను, ౯ పౌనులు పంచదార రూపంగాను తింటారు. బెల్లమే లేకపోతే మన దిగుమతులు ఇంకోమూడురెట్లు వుండేవి. అప్పుడు దేశంలో ౩౨ ఫ్యాక్టరీలు వుండేవి. ౧౯ వేలమంది జనం పని చేసేవారు. వాళ్లకు ఒక పదిలక్షల రూపాయలు ముట్టేవి. ఇక చెరకు పండించిన రైతులకు దాదాపు రెండుకోట్ల రూపాయలు వచ్చింది. ఇప్పుడో? ౧౫౨ ఫ్యాక్టరీలు. పంచదారదిగుమతి సున్న. మూడువేల మందివిద్యాధికులకు, ౧ లక్షజనానికి పనిదొరికింది. చెరకు పండించిన రైతులకు ౧౧ కోట్ల రూపాయలు చేతిలో గలగలలాడాయి. ౩౩ కోట్ల రూపాయలు ఈ పరిశ్రమలో పెట్టుబడి పెట్టారు. ప్రపంచమంతటిలోను పంచదారపరిశ్రమల్లో మనదే పెద్దది.

పురాణకాలంనుంచీ చెరకును పండిస్తున్న మన దేశంలో ౧౯౩౨ దాకా పంచదారపరిశ్రమ తలెత్తలేదేమని సందేహం. ౧౯౩౨ ఏప్రియల్‌లో ప్రభుత్వమువారు పంచదారదిగుమతులపై రక్షణసుంకం విధించి ఈపరిశ్రమకు ప్రాణంపోశారు. అంతేగాదు. అంతవరకు మన దేశంలో పండే చెరకుపంట ఫ్యాక్టరీలకు అంత పనికివచ్చేది కాదు. ముఖ్యంగా ఎకరానికి వచ్చేపంట, చెరకులో పంచదారభాగం తక్కువగా వుండేవి. చెరకునుంచి బెల్లం తయారుచేసి, ఆ బెల్లంలో నుంచి పంచదార తయారుచేసేవారు.

# పారిశ్రామిక పంటలు

ఈ సమయంలోనే సర్ టి. ఎస్. వెంకట్రామన్ గారు జొన్నకూ, చెరుకుకూ సంయోగం చేసి కోయంబత్తూరు చెరుకు అనుపేరుతో క్రొత్తచెరుకులను తయారుచేశారు. ఈ చెరుకులు భారతదేశంలో నాల్గుమూలలా వ్యాపించాయి. అయితే వాని గొప్పదనం ఏమిటి? ఇవి చాలాగట్టిగా వుంటాయి. తినడానికి వచ్చిన నక్కపళ్లు ఊడవలసినదేగాని కొరుకుడు పడవు. పంచదారభాగం నాటు చెరుకులకంటే ఎక్కువ. ఎకరానికి పంట అధికం. అన్నిటికంటే ఎక్కువయిన సంగతి మెరకపంటజొన్న సంయోగం చేత నీరు తక్కువ ప్రదేశాల్లోకూడా వీనిని పండించడానికి వీలవుతోంది. అందుచేతనే ఆసేతుహిమాచల పర్యంతం రైతులు సాదరపూర్వకంగా వీనిని సాగుబడి చేస్తున్నారు. నాటుచెరుకుకంటె ఒకటిన్నర రెట్లు ఎక్కువగా పండి ఎకరానికి అధమం ౫౦ రూ. అయినా అధికలాభం వస్తోంది. దీని ప్రత్యక్షనిదర్శనం చెరుకు పంటక్రింద వున్న భూమి ఇరవైలక్షల ఎకరాలనుండి వలభైలక్షలదాకా పెరిగింది. అందులో ముప్ఫయి లక్షల ఎకరాలు కోయంబత్తూరు చెరుకులే.

మనకు కావలసిన పంచదారను మనం పండించమంటున్నాం. అయినా ఈ పరిశ్రమను ఇంకా వృద్ధి చేయవలసిన అవసరం వుంది. దీనికి రెండుకారణాలున్నాయి. ఒకటి మన పంచదార పరిశ్రమకు ప్రబలమైన పోటీదారు జావా. ఇప్పుడు శత్రువులచేతిలో పడి నలిగిపోయివున్నా యుద్ధానికి పూర్వం మణుగు ౧ కి ౭ రూ. రక్షణసుంకం ఇచ్చుకొని దాదాపు మన దేశంలో తయారయే పంచదారధరకే అమ్మేవారు. దీనికి కారణం వాళ్ల ఉత్పత్తిఖర్చు తక్కువకావడమే. జావాలో నూరుటన్నుల చెరుకులోనుంచి ౧౨ టన్నుల పంచదార తీస్తారు. మన దేశంలో తొమ్మిదిటన్నులు తీస్తారు. జావాపంచదార ఫ్యాక్టరీలు ఏటికి ఏడు నెలలు పనిచేస్తాయి. మన దేశంఫ్యాక్టరీలకు మూడు నెలలా పదిరోజులదాకా పని దొరుకుతుంది. అక్కడి రైతు ఎకరానికి అధమం పాతికటన్నులయినా కళ్లజూస్తాడు. మనకు ౧౭ టన్నులు పండేసరికి కళ్లుతిరిగిపోతాయి. ఉత్తరోత్తరా జావాపోటీకి నిలబడాలంటే పూర్వోక్తలోపాలన్నీ సరిచూచుకోవాలి.

రెండవ కారణం ఆహారశాస్త్రప్రకారం మనం ప్రస్తుతం తింటున్న పంచదార చాలదు. మనిషికి అధమం ౪౬ పౌనుల పంచదార అయినా కావాలి. అనగా మనం ప్రస్తుతం తింటున్న ౨౩ పౌనుల పంచదారను రెట్టింపుచెయ్యాలి. ఇంగ్లాండులో మనిషి ౧ కి ౧౦౬, అమెరికాలో ౯౭ పౌనుల పంచదార తింటారు. ఇంగ్లాండు అమెరికా దేశాలతో చూస్తే చాలా తక్కువే. మన ఆహారాన్ని పుష్టికరంగా చేయడానికి అధమం ఇప్పుడు తయారుచేస్తున్న పంచదారను రెట్టింపు అయినా చెయ్యాలి. అదిగాక భవిష్యద్రాజ్యాంగనిర్మాణంలో మనకు రవాణాసౌకర్యాలు ఏర్పడితే ఈజిప్టు, అరేబియా, ఆఫ్ఘనిస్థానం, పర్షియా రాజ్యాలకు పంచదార ఎగుమతికూడా చేయగల్గుతాం.

ఈ పరిశ్రమ అభివృద్ధికిగాను కోయంబత్తూరు చెరుకులను ఇంకా ఎక్కువగా పండించి చెరుకు పంటను వృద్ధిచెయ్యా, అధమం అక్టోబరునుంచి ఏప్రియల్ వరకు కోతకువచ్చే అనేకరకాలను పండించి మన ఫ్యాక్టరీలు ఏడాదికి అధమం ఏడునెలలైనా పని చేయునట్లు చూడాలి. ఈ పరిశ్రమలో పొల్లుపోయే పదార్థాలను సొమ్ముచేయాలి. ప్రతి ఫ్యాక్టరీదగ్గరా ఒక విధమయిన బెల్లంపాకం మిగిలిపోతూ ఉంటుంది. దీనిలోనుంచి సారాను తయారుచేయవచ్చును. ఈ మధ్యనే ప్రభుత్వంవారు మోటారుకార్లకు నాలుగుపాళ్లు పెట్రోలు, ఒకపాలు ఈ సారాను కలిపి వాడాలని చట్టంచేశారు. దీనివలన ఏటేటా మనకు పొల్లుపోయే కొన్నిలక్షల టన్నుల ఈ బెల్లంపాకంలోనుంచి సారా తీసి పెట్రోలులో కలుపవచ్చును. ప్రస్తుతం చెరుకుపిప్పినంతా కాల్చివేస్తున్నారు. ఈ పిప్పిలోనుంచి మంచిరకం అట్టలు తయారుచేయవచ్చునని డెహరాడూను పరిశోధనాలయంవారు చూపించారు. చెరుకుపరిశ్రమ భవిష్యత్తంతా ప్రభుత్వంవారి ప్రోత్సాహం, దేశీయుల కార్యనిర్వాహకశక్తి వీటి మీద ఆధారపడివుంది.

## ౫ పరిశ్రమ

ఇక ప్రత్తిపరిశ్రమ. అయిదువేలఏళ్ల క్రిందట మొహెంజోదారోశిథిలాల్లో కొన్ని గింజలతో చిన్న చిన్న గుడ్డపీలికలు, దారాలు దొరికాయి. ఈ గుడ్డ పీలికలో దారాలు ౩౪-వ నంబరువని తేలింది. ఈ దారానికి వుపయోగించిన ప్రత్తి ఇంచుమించుగా ఇప్పుడు పంటలో ఉన్న ప్రత్తిజాతులవే. మన ఢక్కా మజ్లిన్లు, మూర్షిదాబాదు సిల్కులూ ఖండఖండాంతరాలలోని అంతఃపురాంగనల శిరీషకుసుమకోమలశరీరాలకు వన్నె తెచ్చాయి. బందరుకలంకారీలు రాజసౌధాలను చైతన్యానికి తెచ్చాయి. ఇదంతా చరిత్రాత్మకం.

ఒకటవ శతాబ్దంనుంచి ౧౯-వ శతాబ్దందాకా, అనగా అవిచ్ఛిన్నంగా ౧౭ వందల ఏళ్లు మన దేశం విదేశాలకు సాటిలేని, సున్నితమైన వస్త్రాలను ఎగుమతి చేసి, రాగి, టిన్ను, సీసం మొదలైన లోహాలను దిగుమతి చేస్తుండేది. ౧౮-వ శతాబ్దంలో పార్లమెంటు భారతదేశంనుంచి వచ్చే వస్త్రాలమీద ఆంక్ష వేసింది. యూరపులో నూలువడుకు యంత్రము కనిపెట్టినదాకా ఢక్కా, సూరతు నేతగాండ్రతో పోటీచేయలేమని నిస్పృహ చెందిపోయారు. ౧౭౫౦ దాకా ఏటా మన దేశీయులకు ౩౫ కోట్ల రూపాయలనగదు ఎగుమతి చేసిన బట్టలకుగాను చేతిలో పడేది.

౧౯-వ శతాబ్దంనుంచి కాలం మారిపోయింది. మనం ఎగుమతిచేసిన సరుకులనే దిగుమతిచేసుకుంటున్నాం. ౧౯౧౩ నాటికి ఏటా ౧౫౮ కోట్ల రూపాయల గుడ్డలు దిగుమతిచేసుకునేవాళ్లం. ఈ గ్రంథం ౧౯౧౯ దాకా నడిచింది. అప్పుడు మన దేశంలో ౨౩ కోట్ల ఎకరాల్లో ప్రత్తి పండిస్తుండేవారు. సుమారు ౫౦ లక్షలబేళ్లు (నాలుగువందల పౌనులవి) పండేవి. తరువాత కథ అడ్డంగా తిరిగింది. దేశంలో ప్రత్తిపంటకూ, స్వదేశవస్త్రానికీ ఉత్సాహం ఎక్కువయింది. ప్రభుత్వంవారు కూడా చిన్నచిన్న రక్షణసుంకములు వేసి ప్రత్తిపంటపరిశోధనలో సహాయం చేశారు. దీనితో ౧౯౩౫ నాటికి దిగుమతులు ౧౫౮ కోట్లనుండి ౧౭ కోట్లకు పడిపోయాయి. ఈ పరిశ్రమ దినదినాభివృద్ధి అవుతోంది.

ఈ వస్త్రపరిశ్రమలో ముఖ్యంగా మూడులోపాలున్నాయి. మొదటిది మనకు ఎకరానికి వచ్చే పంట. ఈజిప్టులో ఎకరానికి ౫౩౦ పౌనులు; పెరూలో ౫౦౮ పౌనులు; రష్యాలో ౩౨౨ పౌనులు పండితే మన దేశంలో ౯౯ పౌనులు పండుతాయి. అనగా మనం సరిగా పండిస్తే ప్రస్తుతం పండుతున్న ౬౦ లక్షలబేళ్లను నాలుగురెట్లుఅయినా వృద్ధిచేయవచ్చును. దీనికిగాను ఉత్తమజాతులను వుపయోగించి, ప్రత్తితరువాత భూసారాన్ని వృద్ధిచేసే పంటలను పండించు భూమికి కావలసిన ఎరువులను వేస్తే మన ప్రత్తిపంట వృద్ధికాకతప్పదు.

ఇక రెండవది. పొట్టిపింజగల జాతులను పండించటం. ఈపింజపొడుగుమీదనే మన పరిశ్రమ ఆధారపడివుంది. పింజ ఎంత పొడుగుగా, త్రాణగలిగివుంటే అంత సన్నని దారం, సున్నితమైన వస్త్రం వస్తుంది. ఈపింజపొడుగు పాతికఅంగుళము మొదలుకొని ఒకటింబాతికఅంగుళందాకా ఉంటుంది. మన దేశంలో ఒకఅంగుళంరెండువీసాలకంటె పొడుగైన పింజగల జాతులు లేవు. మన ౬౦ లక్షల బేళ్లలో ఒకలక్ష బేళ్లు సుమారు అంగుళంవీసంపొడుగు పింజ గల్గివుంటాయి. ౨౫ లక్షల బేళ్లు అంగుళం పొడుగు పింజగలిగివుంటాయి. మిగిలినవన్నీ అరంగుళంలోపు; అంతకంటె కొంచెం ఎక్కువ. అసలు ఈమాత్రం వృద్ధి రావటంకూడా వ్యవసాయశాఖవారు ఉత్తమజాతులను సృష్టించడానికీ, దోహదం చేయడానికీ చేసిన నిరంతరాయకృషిఫలితమే. ౧౯౧౩ లో నలభైయవ నెంబరుపైనెంబరునూలు మన దేశంమిల్లులు పొడుగు పింజగలప్రత్తి లేకపోవడంచే తయారుచేయలేకపోయినందున విదేశాలనుండి నూటికి ౮౫ వంతు నూలు దిగుమతిచేసుకునేవాళ్లం. ౨౫ వంతులు దేశంలో తయారయేది. ౧౯౩౫ నాటికి నలభై పైనెంబరునూలు

నూటికి ౭౫ వంతులు దేశంలోనే తయారవుతుంది. ౨౫ వంతులుమాత్రమే పైదేశాలలోనుంచి వస్తోంది.

మూడవవిషయం. కాయప్రత్తిలోనుంచి తయారయే, గింజలుతీసిన ప్రత్తి చాలా తక్కువగావుంటుంది. పొడుగు తక్కువ పింజగల ప్రత్తిచాలా తక్కువగా వుంటుంది.పొడుగు తక్కువ పింజ గల ప్రత్తిరకాల్లో నూటికి ౩౦ మొదలు ౪౦ పౌనులదాకా వస్తోంది. కాని అంగుళముపొడుగు గల పంజాబుఅమెరికను ప్రత్తిజాతులనుండి నూటికి పాతికముప్ఫయిపౌనులకంటె ఎక్కువ రావటంలేదు.

మనం ముఖ్యంగా ప్రత్తిపంటలోపాలు సరిచేసుకుంటేగాని మన బట్టలమిల్లులు సన్నని దారం, మంచి బట్టలు తయారుచేయలేవు. అయినా ఈఇరవయిసంవత్సరాల్లో ఒక వందమిల్లులు ఎక్కువయాయి (మొత్తం ౩౪౪). ౫ లక్షల జనానికి పని దొరికింది. ౭౬ కోట్ల పౌనుల గుడ్డ తయారయింది. ఇంకా చేతిమగ్గాలమీద మరియొక ౩ కోట్ల గజాల గుడ్డను తయారుచేయడానికి నూలును అందిచ్చింది. మన పరిశ్రమకు జపాను తీవ్రమయిన పోటీదారుగా వుండేది. అట్టి జపానునేతపరిశ్రమ క్రుంగిపోయింది. మనం ఈఅదను తీసుకొని మన పరిశ్రమను వృద్ధిచేసుకోవాలి. శీఘ్రకాలంలోనే మన ప్రాచీనఔన్నత్యాన్ని పునరుద్ధరణచేసి, మన వస్త్రకళానైపుణ్యాన్ని ప్రపంచానికి చూపెట్టగలం.

## జ్యూటు పరిశ్రమ

ప్రత్తితరువాత జ్యూటునార మనకు ముఖ్యమైన పంట. వంగదేశం ఈనారను పండించి ఎగుమతి చేస్తుంది. సుమారు ౩౩ లక్షల ఎకరాల్లో ఈ పంట సాగుబడి అవుతోంది. ౧౯౨౬ లో బేలు ధర ౧౨౩ రూపాయలదాకా పెరిగిపోయింది. ౧౯౩౫ నాటికి ౪౦ కి పడిపోయి మళ్లీ ఈ యుద్ధంలో బాగా పెరిగింది. ఈ నారతో ముఖ్యంగా గోనెసంచులు, చవకరకం తివాసీలు, టార్పలీనులు తయారుచేస్తారు. మన దేశంలో పండే ౯౦ లక్షల బేళ్లలో ౭౦ లక్షల బేళ్లు మన మిల్లులే సంచులు, గోనెగుడ్డ, దారం తయారుచేయడానికి ఉపయోగిస్తాయి. గత ఇరవైసంవత్సరాల్లో ఈ పరిశ్రమ ఒకటిన్నరరెట్లు వృద్ధి అయింది. ౯౯ మిల్లులు పనిచేస్తున్నాయి. ౨౪ లక్షలజనం పనిచేస్తున్నారు. పూర్వ ఫ్లాక్సునారతో కాన్వాసు తయారుచేసేవారు. ఇప్పుడు జ్యూటుతో ఈ కాన్వాసు తయారుచేస్తున్నారు. నితో మన జ్యూటు నారకు చాలా ప్రోత్సాహం కలిగింది. ఈ పంటలోకూడా జ్యూటు పరిశోధనసంఘంవారు వుత్తమజాతులను తయారు చేశారు. నత్రజని, పోటాషియము, కాల్షియము కలిపిన ఎరువులు వాడి, ఎనిమిదిమణుగులు పండేచోట ౨౦ మణుగులదాకా పండించారు. ఈ నార పండే భూముల్లో సాలువిడిచి సాలుకు వరికూడ పండించవచ్చునని చూపించారు. జ్యూటుమొక్కలను కుళ్లబెట్టి నార తీసే విధానం మనం ఇంకా వృద్ధిచెయ్యాలి. తెలుగుజిల్లాలలో గోగు, జనపనారకుకూడ మంచి భవిష్యత్తు వుంది. తెలుగు జిల్లాలనుంచి గోగునార ౭౦ లక్షల రూపాయల సరకు ఎగుమతి అవుతోంది. ఈ పంటకు జ్యూటువలె విశేషంగా నీరు, అంత మంచి భూమి అక్కరలేదు.

## పొగాకు

పొగాకు ౧౩ లక్షల ఎకరాల్లో పండుతోంది. మన దేశంలో రెండురకాల పొగాకు పండుతోంది. ఇందులో మూడువంతులు సిగరెట్టు పొగాకు; ఒకవంతు మామూలుచుట్టలు, పొడుం, గుడాకు మొదలైనవాటికి పనికివస్తుంది. వస్త్రపరిశ్రమవలెనే ఇందులోకూడ ముడిపొగాకును ఎగుమతిచేసి, తయారైన సిగరెట్లను దిగుమతిచేసుకుంటున్నాం. యుద్ధానికిపూర్వం దాదాపు ౩ కోట్లపౌనుల పొగాకు ఎగుమతిచేసేవాళ్లం. ఇందుకు ప్రత్యామ్నాయంగా ౫౫ లక్షల పౌనుల సిగరెట్లు మనకు దిగుమతిఅయేవి. ఇప్పుడిప్పుడే అక్కడక్కడ సిగరెట్ల ఫ్యాక్టరీలు వెలిశాయి. మంచిరకం సిగరెట్లన్నీ మనదేశంలో పొగాకుతోనే తయారవు

తున్నాయి. ఈసిగరెట్లపొగాకుపంటకు గుంటూరు జిల్లా ప్రాముఖ్యం వహించింది. ప్రస్తుతం ఎకరానికి సగటున ౯౦౦ పౌనులు తయారైన ఆకు పండుతోంది. ఇప్పుడిప్పుడే దోహదంచేస్తున్న క్రొత్తజాతులను, ఆయాభూములకు సరిపోయే ఎరువులను వాడితే పంటను బాగా వృద్ధిచేయవచ్చును. పొగాకుపంటకు శత్రువు ముఖ్యం టొకరా (orabanche) అనే ఒక జాడ్యపుమొక్క వుంది. ఇది పొగాకుమొక్కలోని సారమంతా లాగివేసి పంటను నాశనంచేయడమేగాక భూమిని మరేపంటకూ పనికిరాకుండా చేస్తుంది. ఈజాడ్యపుమొక్కను నాశనంచేయడానికి తీవ్రమయిన పరిశోధన జరుగుతోంది. ఫలితాలు ఆశాకరంగా ఉన్నాయి. ఏటేటా వృద్ధిఅవుతున్న సిగరెట్టుపొగాకు పంటతోపాటు మన దేశీయులు సిగరెట్లఫ్యాక్టరీలను గూడా స్థాపించాలి. అప్పుడే ఈపంట పదహారణాలు ఫలించిందని చెప్పవచ్చును

## నూనెగింజలు

ఇక, నూనెగింజలు: పాతికముప్ఫయిసంవత్సరాలనుంచి నూనెగింజలపంట ఎదుగుపొదుగు లేకుండా ఉంది. సుమారు పదిహేనురకాల గింజల్లోనుంచి నూనె తీస్తాము. వీనిలో వేరుశనగ, నువ్వులు, ఆముదాలు, సీమఅవిశె ఈజాతుల గింజలు ముఖ్యమైనవి. దాదాపు రెండుకోట్ల ఎకరాల్లో నూనెగింజలు పండిస్తున్నాము. ౭౦ లక్షల టన్నులు పండుతున్నాయి. ౭౫ కోట్ల రూపాయలు ధరకట్టారు. ఇందులో ౮ కోట్ల రూపాయల గింజలను ఎగుమతి చేస్తున్నాం. ప్రపంచంలో అన్ని దేశాలలోనుంచి వచ్చే ఎగుమతుల్లో నాల్గవవంతు మనది. ఈ పంటలో గూడ ముడినూనెగింజలను ఎగుమతి చేయడమేగాని, తయారయిన నూనెగింజలను ఎగుమతిచేయడానికి మనం నోచుకోలేదు. ఇంతపంటకూ మనం సుమారు ౩౦ లక్షల రూపాయల నూనెను ఎగుమతిచేస్తాం. దీనికి కారణం మన దేశంలో నూనెగింజలనుంచి నూనెను తీసే మిల్లులు విస్తరించి లేకపోవడమే. నూనెగింజల మూలంగా మన పశువులకు, భూములకు పనికివచ్చే కొన్ని లక్షల టన్నుల నూనెగింజలపిండి విదేశాలకు పోవడమేకాక దేశంలో నూనెలతో వృద్ధికావలసిన పరిశ్రమలకు ఆస్కారం లేకుండాపోతోంది. సీమ అవిశెగింజలు వార్నిషులరంగులు తయారుచేయడానికి ప్రధానం. మనం సుమారు ఏటేటా ౫౩కోట్ల రూపాయల రంగులూ, వార్నిషులూ దిగుమతిచేసుకుంటున్నాం. ౩౮ లక్షల ఎకరాల్లో ౪ లక్షల టన్నుల సీమఅవిశె గింజలను పండిస్తున్నాం. ఇందులో ౮౦. వేల టన్నులదాకా ఎగుమతిచేస్తూన్నాము. మనం ఎగుమతిచేసే సీమఅవిశెనూనె చాలా తక్కువ. ౨౫ లక్షల రూపాయల ఖరీదుకూడా ఉండదు. సీమఅవిశెగింజలలో చాలారకాలున్నాయి. గోధుమరంగు, పసుపుపచ్చరంగు, కాఫీగింజరంగు లున్నాయి. వీనిలో పసుపుపచ్చరంగుగింజలలోనుంచి వచ్చేనూనె ప్రశస్తం. ఈ నూనె రంగు తక్కువగా ఉండి త్వరగా ఆరిపోతుంది. ఈ పంటను మధ్యరాష్ట్రాలలోను, సంయుక్తరాష్ట్రాలు, పంజాబులలోను పండించడానికి చాలా అవకాశం ఉంది. ప్రస్తుతం ఎకరానికి అయిదువందల పౌనులు వస్తూన్నాయి. వ్యవసాయశాఖవారు దోహదం చేసిన ఉత్తమజాతుల సీమఅవిశెగింజలను పండించిన ఈ పంటకు భవిష్యత్తు ఉంది. వార్నిషురంగుపరిశ్రమ ఈ పంటపై ఆధారపడి ఉంది. వేరుశనగకూడా చాలా ముఖ్యమైన పంట. విదేశములనుండి వనస్పతినెయ్యి దిగుమతి ఆగిపోయిన తర్వాత దేశంలో వనస్పతి నెయ్యిని తయారుచెయ్యడానికి వేరుశనగనూనెను విశేషంగా వాడుతున్నారు. సుమారు ౫౮ లక్షల ఎకరాల్లో ౧౯ లక్షల టన్నుల వేరుశెనగను పండిస్తూన్నాము. సగానికిపైగా మన దేశంలోనే ఖర్చు అవుతుంది. నూనె రూపంగాగాని, గింజల రూపంగాగాని ౭ లక్షల టన్నులు ఎగుమతిచేస్తాం. ఈ ౭ లక్షలలో ౫ లక్షలు గింజలుగాను, ౨ లక్షలు నూనెగాను ఎగుమతి చేస్తున్నాం. ఈ మధ్య ఖనిజతైలాలు తగ్గిపోయినతర్వాత మద్రాసుప్రభుత్వం

వారు వేరుశెనగనూనెతో యంత్రాలు నడపడానికి ప్రయోగించి చూచారు. ఈ పరిశోధనఫలితాలు అంత ఆశాకరంగా లేవు. అయినా వాల్గయినుకోట్ల రూపాయల వనస్పతి నెయ్యిదిగుమతిని వేరుశెనగనూనె అరికట్టగలదు. అన్నిపంటలవలెనే ఈపంటలోగూడ మనకు ఎకరానికి వచ్చే ఫలితం చాలా తక్కువ. మనకు ఎకరానికి సుమారు ౮౦౦ పౌనులు పండు తోంది. చైనా, అర్జింటైనా, స్పెయినులలో ఇంచు మించుగా దీనికి రెండురెట్లు పండుతోంది. ఈపంటకు అంతగా ఎరువులు అక్కరలేదు. సరియైన అదనులో వ్యవసాయశాఖవారి ఉత్తమజాతులను పండిస్తే పంట చాలామట్టుకు వృద్ధికావచ్చును. యుద్ధానంతరం రాబోయే అంతర్జాతీయ రాజకీయపరివర్తనలలో ఇప్పు డున్న పారిశ్రామికపంటలు తారుమారుకావచ్చు. మన వేరుశెనగనూనెఎగుమతి సగపాలు పంచుకొనే జర్మనీ యుద్ధానికి రెండుమూడుసంవత్సరాలకు పూర్వం సోయాచిక్కుడుగింజలనూనెకు పరుగెత్తి మన నూనె దిగుమతి ఆపుచేసింది. వెంటనే వేరుశెనగల ధర పడి పోవడం, రైతుల గోల ప్రారంభమయింది. ప్రస్తుతం మన ప్రత్తిపంటకుకూడా ఆనుప్పు రావచ్చును. జపాను పతనంతో మన తక్కువపింజగల ప్రత్తికి విడుదల ఉండదు. ఇప్పటినుంచి మనం యిల్లుసవరించుకోవడం మంచిది.

## క్రొత్తపంటల అవకాశాలు

బొప్పాయిమొక్కకు రోజులు బాగుపడ వచ్చును. దీనిలోనుంచి పెపియినుఅనే జీర్ణకారకమయిన మందును పళ్లరసంలోనుంచి తీస్తారు. ప్రస్తుతం సిలోను వారు సుమారు ౨౦ వేల పౌనులదాకా ఎగుమతి చేస్తు న్నారు. దీనికి పెద్ద యంత్రసామగ్రి అక్కరలేదు. బొప్పాయిమొక్క చాలా త్వరగా పెరుగుతుంది. పెద్దపెద్ద తోటలు వేసి ఈపరిశ్రమను లేవదీయడానికి చాలా అవకాశం ఉంది.

మలేరియాతో కృషించిపోయే మన దేశానికి క్వైనా చాలా అవసరం. మన దేశానికి కనీసం ౨౨ లక్షల పౌనల క్వైనాఅయినా కావాలి. దేశంలో బాధపడే పదికోట్లమందికీ క్వైనా ఇవ్వాలంటే ౬ లక్షల పౌనులు కావాలి. మన దేశములో ౨౦ వేల పౌనుల క్వైనా తయారవుతుంది. మిగిలినదానికోసం జావాకు చెయ్యిజాపేవాళ్లం.

ప్రస్తుతం క్వైనామొక్కలు సాగుచెయ్యడానికి ౩౮ వేల ఎకరాలున్నాయి. బెంగాలు, ఒరిస్సా, మద్రాసురాష్ట్రాల్లోని మన్యప్రదేశాలు పనికివస్తాయి. ముఖ్యంగా విశాఖపట్నం కోరాపుట్టి, గంజాంజిల్లా మన మంచి అవకాశాలు ఉన్నాయి.

మనం ప్రస్తుతంఉన్న పంటలుగాక కొత్తవానికి దారితీకాకాలి. ఉన్న కొన్నిటినీ వృద్ధిచేసి ప్రపంచ ములో పోటీకి నిలబడగలిగిఉండాలి. దీనికి వ్యక్తి సంఘం, ప్రభుత్వం పూనుకోవాలి. ఆధునిక పారి శ్రామికయుగంలో తప్పటడుగులు వేస్తున్న భారత దేశానికి భవిష్యత్తు ఆశాజనకంగా వున్నప్పటికీ మార్గం మాత్రం కంటకకర్కశమని ఒప్పుకోవాలి. ఈమార్గాన్ని మనం ఇనుపజోళ్లతో తొక్కకపోతే పొంచుకున్న అవకాశాలకోసమూ, చరిత్రాత్మకమైన ఔన్నత్యం కోసమూ తరువాత చింతించాలి.*

---

*ఆలిండియా రేడియో-ఢిల్లీ వారి అనుమతితో.

# ప్రకృతిశాస్త్ర సిద్ధాంతములు



**'విద్యార్థి'**

## ౧. కార్య కారణ న్యాయము

మనిషి భూమిమీద అవతరించి ఉన్నంతకాలమూ ప్రకృతీపరివేష్టితుడై ఆ ప్రకృతి శక్తులవల్ల కొంత అపకారము, కొంత ఉపకారమూ పొందుతూ వచ్చాడు. ఎండలు కాసి, వానలు కురియగా భూసారంవల్ల పంటలు పండించి తన ప్రాణాలు నిలుపుకుంటూ, పశువులను మేపి పెంచాడు; నిప్పు చేశాడు, అన్నం వండుకున్నాడు; చలి కాచుకున్నాడు. వాయుశక్తిని, జలశక్తిని ఉపయోగించుకునే ఉపాయాలు అనేకం తెలుసుకున్నాడు. కాని తుపానులు వీచి, వరదలు ముంచుకొనివచ్చి చిందరవందర చేసినవి, చూస్తూ నష్టపడ్డాడు. వేసవిలో ఎండవేడికి తాళలేకను, శీతకాలంలో చలికి తట్టుకోలేకను అవస్థపడ్డాడు. నిప్పు అంటుకొని, తగలబెట్టి, మసిచేసి, బుగ్గికావడం చూచాడు. భూకంపాలు భూతలాన్ని అతలకుతలం చేయగాను, అగ్నిపర్వతాలు నిప్పుల ప్రవాహాలను కక్కగాను చూచాడు; వాటివలన నష్టపడ్డాడు.

మనిషి స్వతః ఆలోచించుకోగలడు, వివేచన చేయగలడు. ఇతర పశుజాతికీ, మనిషికీ ఉన్న భేద విశేషం ఇదే.

మనిషి ఆదిమస్థితినుంచి వికసిస్తూ కాలక్రమేణ కొంచెం కొంచెం నాగరికుడవుతూరాగా ప్రకృతి చేష్టలకు హేతువులు ఏవేవో చెప్పుకున్నాడు. ఆ చెప్పుకున్న హేతువులు నిజం కావు. అయినా ఏదో ఒక కారణం చెప్పుకోవలసిన అవసరం మనిషికి అప్పట్లోనే తోచింది కనుక ప్రకృతిలో ప్రధాన నియమం ఒకటి కలదనే సంగతి మసక మసకగా, లీలగా వానికి ఆ మొదటిరోజుల్లోనే తోచిఉంటుందని తేలుతున్నది. దాన్నే కారణ-క్రియా న్యాయము అంటున్నాము.

మనకు తెలిసినంతలో ప్రాకృత (ప్రకృతికి సంబంధించిన) హేతువు లేకనే ఏ కార్యమూ సంభవించదు. ఏ హేతువూ లేకుండా, ఏ శక్తివల్లనూ కాకుండా సంభవించేది ఇంకా మనకు తటస్థపడలేదు. ప్రకృతివ్యాపారాలు "ఏదో ఊరికే అలా" జరిగిపోవు. వరసగా ఒకదానివెంట ఒకటిగా కొన్ని సంగతిసందర్భాలు కలిగి జరుగుతున్నవి కనుకనే ఆ వ్యాపారాలు జరుగుతున్నవి. కార్యకారణన్యాయానికి ఇదే తాత్పర్యము.

## ౨. ప్రకృతి విజ్ఞానము-తొలిఊహలు

ఏవో కొన్ని ఫలితార్థంగా కంటబడినపుడు అర్ధనాగరీకస్థితిలో ఉన్న మనిషి అందుకేదో హేతువు ఉండవలెననుకోక తప్పిందికాదు. వానిచుట్టూ నిత్యం ఎన్నో జరిగేవి. కాని తెలియనితనంచేత వాటికి సరియైన అనుపూర్వి చెప్పుకోలేకపోయాడు. ఏవో దేవతారూపాలు తలపోసుకొని, వాటికి జనకత్వం ఆపాదించి తత్త్వం తెలిసిందనుకునేవాడు. ఇలా అనుకోటం కష్టం కాదు, చాలా సులువు. ఇందుకు ఎక్కువ యోచన చేయనక్కర్లేదు. కనుక యిలా వివరించుకున్న దండాన్వయం వానికి నచ్చేది. సామాన్యంగా దేవతలను, దయ్యాలను చూపెట్టుకుంటూ ఉండేవాడు. ప్రకృతిశక్తులను, ప్రాణుల జీవాలను ఏవో దేవతలు నియమిస్తున్న వనుకొని, వాటికి ప్రీతికర మనుకొనేవి చేస్తూ విశేషకాలం వెళ్లదీసేవాడు.

లోకంలో ఇప్పటికీ కొన్నిచోట్ల ఇలాటి నమ్మకాలు ఉంటూన్నవి. బర్మాలో కొన్నిచోట్ల నీటిఊటలపక్కన వేదికలు కట్టి, ఆ నీరు చలగా, స్వచ్ఛంగా ఉండవలెనని కోరుకుంటూ జలదేవతను సుముఖం చేసుకుంటున్నామని సంతోషిస్తారు. నీటిజల ఇంకిపోయినా, లేక ఆ నీరు తాగి ఎవరైనా జబ్బ

పడినా జలదేవతకు ఏదో మనస్తాపం కలిగిఉంటుందని వారు నమ్ముతారు. దానికి పరిహారంగా బలి ఇవ్వవలె నంటారు. ఈ విధంగా మన పూర్వులు సామాన్యవిష యాలను అన్వయించుకునేవారు.

అయితే పిచ్చినమ్మకా లున్నది బర్మాలోనే కాదు. అమెరికావంటి అగ్రేసర నాగరిక దేశంలోకూడా విద్యావంతు లనేవారు ఎన్నెన్నో పిచ్చినమ్మకాలు పెట్టుకుంటారు. గుర్రపు నాడా దొరికితే అదృష్ట సూచక మని, అద్దం పగలగొడితే దురదృష్టం వ్రాసి పెట్టిఉందని అనుకుంటారు. కొయ్యమీద తట్టికొడితే హాని తొలిగిపోతుం దంటారు. ప్రకృతిశాస్త్రం సిస్తూ ఇలాటి ఊహలన్నీ మూర్ఖమనీ, నైసర్గికమైన కారణం లేకుండా క్రియలో ఏమీ వాటిల్లవనీ మనం గ్రహించుకోవాలి. ఒకానొకటి ఎందువలన సంభవిం చిందీ తెలియకపోయినా అది ప్రకృతిసహజమైన హేతు ఫలమేనని విద్యావంతులమైన మనం సాకల్యంగాను, నిక్కచ్చిగాను రూఢిచేసుకోవలెను.

## 3. ప్రకృతి శక్తులు-మనిషివశిత్వము

ఈ మన లోకాన్ని పాలిస్తున్న మహాశక్తులను గూర్చి కొంతైనా నేర్చుకోవలెను. మనచుట్టూ ఉన్న శక్తిస్వరూపాలను గురించి తెలుసుకోవలెను. మనిషి వాటిని ఎలా వాడుకున్నదీ—ఎలా నిప్పుచేసి, దీపాలు వెలిగించి, చలి కాచుకున్నదీ, బిచాణాతో ఒకచోటినుంచి మరొకచోటికి ఎలా కదిలిపోగలిగిందీ గ్రహించాలి. శక్తి ప్రతిఫలించే నానా స్వరూపాల కును, సకలశక్తికీ నికేతనుడైన సూర్యునికిని ఎలాటి సౌలి కారం ఉన్నదో తెలుసుకోవలెను.

## ర. ద్రవ్యము-శక్తి

ద్రవ్యమంటే సాధారణంగా కొంతమేర ఆక్ర మించేదనీ, బరువుతూగేదనీ చెబుతారు. ద్రవ్యం మూడురూపాలలో కన్పిస్తున్నది. రాయివంటి ఘన (గట్టి)రూపాలు; నీళ్ళవంటి ద్రవరూపాలు; గాలివంటి వాయురూపాలు. లోకంలోని వస్తుసముదాయానికి ఏదన్నా వాటిల్లి వస్తువుల పరస్పరస్థాయిల్లో మార్పు కలిగినా, లేక వాటి స్వరూపంలో మార్పువచ్చినా అందుకు హేతువు శక్తిప్రచోదన మనేది నిశ్చయము.

ద్రవ్యము, శక్తి ఒక్కటేనని ఇటీవలి బయ ల్పాటులవల్ల తేలుతున్నది. ద్రవ్యము శక్తిస్వరూపం పొందిన సందర్భా లున్నవి. శక్తి ద్రవ్యమూ కావ చ్చును. పొయ్యిమీద నీళ్లు పొంగే క్షణంలో మంచుగా పేరుకుపోయి గడ్డకట్టేప్పటికన్న కొంచెం ఎక్కువ బరువు తూగుతున్నవి. అంటే మామూలు నీళ్లు పొంగులు వచ్చేవరకు కాగటానికైన శక్తి, ద్రవ్య మైన ట్లున్నది. నక్షత్రాలలో ద్రవ్యవస్తువు తరుగుతూ ఉండవచ్చుననీ, తరుగుతూఉండగా అది శక్తిగా మారి సెగరూపం తాల్చుతుందనీ తలుస్తున్నారు. కోటానుకోట్ల సంవత్సరాలనుంచీ ప్రాణాధారంగా ఉన్న సూర్యశక్తికిన్నీ ఇదే మూలం కావచ్చును.

శక్తి అంటే పనిచేయగల సత్తా. పని అంటే మనిషివల్ల నయ్యేదే కాదు. ప్రకృతిశక్తుల కార్య ఫలితాలూ పనులే. ద్రవ్యంవినా శక్తిని గూర్చి తలుచు కోటం కుదరదు. ద్రవ్యము, శక్తి ఎంతో ఒద్దికగా ఉండి పూర్తిగా ఒకదానిపై ఒకటి పలుకుబడి చూపు కుంటూ ఉంటవి.

గాలి, నీరు కదులుతూఉండే స్థితిలో కొంత పని జరుగుతుంది. కదలిక అనేది వస్తువువంటిది కాదు. అది శక్తిస్వరూపము. ఎత్తునుంచి కిందకు పడే నీటి దెబ్బకు విద్యుత్తు పుడుతున్నది. వెలుతురు, వేడి, విద్యుత్తు—ఇవి ద్రవ్యములు కావు; శక్తి స్వరూపాలు. బజారు పోయి డబ్బాడెడు పెట్రోలు కొన్నట్టుగా పీపాడెడు వెలుతురుగాని, వేడిగాని, కదలికనుగాని, మెరుపునుగాని కొనేవీలులేదు. ఈ శక్తిస్వరూపాలను గురించి ఇంతవరకు ఎవరూ నికరంగా తేల్చలేదు. వీటినిగురించి ఏవో సిద్ధాంతాలు లేకపోలేదు. కాని వాటి కార్యం చూస్తున్నాము కనుక అవి ఉన్నవనేది తెలుసుకుంటున్నాము. నీరు కాగబెడితే అదొక గాలిగా మారిపోతుంది. విద్యుత్తువల్ల నీళ్లల్లో మార్పు కలుగుతుంది. హైడ్రోజన్, ఆక్సిజన్ అనే పదా ర్థాలు లీనమై నీరు ద్రవిస్తున్నది. కాని విద్యుత్తు సోకగానే రెండూ విడిపోతవి. వెలుగువల్ల అనేక పదార్థాలలో మార్పులు కలుగుతున్నవి. లోకంలోని వస్తువుల్లో నానాశక్తి స్వరూపాలవల్లను మార్పులు కలుగునని ఇదేవిధంగా వందలకొద్దీ ఉదాహరణలు చూపవచ్చును.

## ౧. ప్రాణుల శక్తి

ఆదికాలంనుంచి మనుష్యుడు పశువులను పూన్చి వాటివల్ల పనులుచేసుకుంటూ వచ్చాడనవచ్చును. తాను చేయవలసిన పనికి పశువుల బలాన్ని ఆధారం చేసుకునేవాడు. కుక్క, తోడేలు ఒకే కుటుంబానికి చెందినవంటారు కాని మొదట్లో కుక్క మచ్చిక అయింది. ఆర్కిటిక్, అంటార్కిటిక్ శైత్యప్రాంతాలలో అన్వేషణకు పోయినవారికి కుక్కలెంతో సాయపడినవి. తిండి లేకుండా వరసాగ్గా పదిరోజుల పాటు బాగా భారమైన బండీని మంచులో లాగగల బలం వాటికి ఉంటుంది. గుర్రాలు, ఎద్లు, గాడిదలు, గొడ్లు, ఏనుగులు, ఒంటెలు మొదలైన జంతువులను మనిషి ఇంతకాలంనుంచి మచ్చికచేసి పనులుచేయించుకుంటూ వచ్చాడు.

మొక్కలకు కూడా అపారమైన శక్తి ఉంది. మొక్కల వేళ్లు నేలలోకి పాకిపోయి చాలా వరకు నేలను సడలిస్తున్నవి. పెద్ద బండరాయిచంటిదికూడా చెట్టువేరు వచ్చి చీలలాగా బొరియలోకి తన్నుకున్నపుడు రెండుగా బద్దలైపోవటం చూస్తున్నాము.

## ౨. అచేతనాల శక్తి

అయినా ప్రాణులవల్లనేనా పని కాగలిగింది? ఏదైనా జలపాతం చూస్తే తెలుస్తుంది; సముద్రమంతటి నీరు ఎంతో ఎత్తున పై అంచునుంచి గర్జిస్తూ కిందికిదూకి పడి అట్టడుగున చీకురాళ్లను కొట్టటంచూస్తే దిగ్భ్రమ చెందుతాము. ఆ భీకరధ్వనికి చెవులు గింగురుమంటవి. అంతటి నీటివల్ల పుట్టకువచ్చే మహాశక్తిని తలుచుకుంటూ వెనకతట్టున నివ్వెరపోయి నిలబడిపోతాము. అయితే ఇంత శక్తిగల జలపాతంకూడా ప్రకృతం కొంతవరకే ఉపయోగపడుతున్నది.

కనుక శక్తి ప్రాణుల సొత్తే కాదనటానికి యీ ఒక్కదృష్టాంతం చాలును. అచేతనపదార్థాలకు శక్తి ఉందనటానికి ఎన్నైనా ఉదాహరణలు చూపవచ్చును. అగ్నిపర్వతంలోని కరిగిన రాయి, విసవిసపోయే జలాంతర్గామి, ఎగిరిమూసుకుపోయే ఫిరంగిగుండు, మోటరులోని పెట్రోలు ఇవన్నీ శక్తివంతాలే.

## ౩. చలనశక్తి

క్రికెట్ ఆటలో బంతిని విసిరివేసే ఆటగాడు బంతికి కొంత త్రాణ కల్పిస్తున్నాడు. అది ఎగురుకుంటూపోయి ఎదటి మూడుకొయ్యలకు ఊతంగా తగిలి వాటిని పడగొట్టుతున్నది. అలా కాక బంతి దారిలోనే పడిపోయి కొయ్యలు పాటున నిలినిఉంటే స్వతః బలంలేదు. కదలికవల్లనే చేష్ట కవసరమైన శక్తి వస్తున్నది.

ఆకాశంలో వీస్తూఉండే గాలికి మరలను ఆడించగల శక్తి ఉన్నది; పెద్ద పెద్ద ఓడలను సముద్రాలమీద తేల్చి నడుపుతూ ప్రపంచంచుట్టూతా తీసికొనిపోగల శక్తి ఉన్నది. ఒకొక్కప్పుడు దీని బలం మితిమీరిపోయి మంచిబదులు చెరుపుకలుగుతుంది. కొన్నిచోట్ల పెద్ద గాడ్పులతో తుపానులు వస్తూఉంటవి. ౧౯౦౬ లో అట్టి తుపానువల్ల హాంకాంగు ఎంతో నష్టపడింది. ౫ వేలమంది చనిపోయారు. ౬౦౦ లక్షల రూపాయల ఖరీదైన ఆస్తి నాశనమైనది. ౧౯౨౬ లో అలాగే ఫ్లారిడా తుపానువల్ల చాలా నష్టపడింది. పడమటి దిక్కునుంచి ఏదో తుపానులురావటం, ఆస్తి, జననాశమవటం అమెరికావైపున 'తద్దిన' వ్యవహారంగా ఉన్నది. పెద్ద సుడిగాల్లు వీచి ఆస్తిపాస్తులు ధ్వంసంకావటం సామాన్య విషయం.

మోటరు, మంచుబండి, టెన్నిస్ బంతి, ఎంజిన్‌లోని కడ్డీ—వీటి కన్నిటికీ బలం ఉన్నది కాని ఆ బలం కదలికవల్లనే ప్రయోగానికి వస్తున్నది. దీన్నే చలనశక్తి అంటాము. ఈ భూగోళం మహాకాశంలో తిరుగుతూ ఉన్నపుడు చలనశక్తి బ్రహ్మాండంగా సంక్రమిస్తున్నది.

## ౪. కుంభితశక్తి

పలకలోకి గుచ్చుకుపోయేటంత ఊతంతో పైకెత్తిన సుత్తి మేకుతలమీద కొట్టుతున్నది. ముక్కలుముక్కలు చేసేటంత ఊతంతో పెద్దగుండు రాతిబండలమీద పడుతున్నది. గడియారపు తీగెచుట్టను బిగుతుగా తిప్పగా అది వదులవుతుంది, చక్రాలను తిప్పుతుంది. స్థాయినిబట్టి కుంభించిఉండే శక్తికి ఇవి దృష్టాంతాలు. ఇలాటి పదార్థాలన్నీ ఆ శక్తికి విడుపు వచ్చినపుడే పని సాధించగలవు.

# ప్రకృతిశాస్త్ర సిద్ధాంతములు

## ౯. శక్తి స్వరూపాలు

శక్తిస్వరూపాలలో వేడి ఒకటి. వేడివల్ల పని జరుగుతుందని అందరికీ తెలుసును. వేడివల్ల నీరు ఆవిరిగా విస్తరిస్తుంది. అందువల్లనే థర్మామీటర్ (తాపసూచిక)లోని పాదరసం పైకి లేస్తుంది. నిప్పు దానివల్లనే పుడుతున్నది.

వెలుగు మరొక స్వరూపము. దీని శక్తివల్ల చాలా పనులు అవుతున్నవి. వాటిలో ఆహారోత్పత్తి ఒకటి. మొక్కల్లో నేవళమైన కణా లుంటవి. వెలుతురుశక్తివల్ల వికసించే లక్షణం వాటి కున్నది. ఇవే సునూక్ష్మమైన పసుపుఇసుములు. వీటివల్ల పచ్చిపదార్థాలు, బొగ్గుపులుసు, నీరు మొదలైనవన్నీ కలిగి లోకానికి ప్రాణధారకమైన అన్నపదార్థం పుడుతున్నది. ఫొటోగ్రాఫులుకూడా వెలుతురువల్లనే సిద్ధిస్తున్నవి. వెలుగువల్లనే రసాయనక్షారాలు మారిపోయి ప్లేట్ మీద నెగెటివ్ సరిగ్గా దిగుతున్నది.

విద్యుచ్ఛక్తి లేకుండా లోకం ఎలా ఉంటుందో ఊహించుకోటం కష్టం. సామాన్యసౌకర్యాలు, వినోదాలు ఎన్నో అందువల్ల కలుగుతున్నవి. అన్నిపనుల్లోకీ విద్యుచ్ఛక్తి చేసే పనికి విస్తుపోతాము. దీనివల్లనే ఖండఖండాంతరాలకు ఇట్టే కబుర్లు పోయి చేరుతున్నవి. జలపాతాలు పుట్టించే విద్యుచ్ఛక్తివలన దూరదూరపు నగరాల్లో యంత్రశాలలు, శకటాలు నడుస్తున్నవి.

ఫిరంగినుంచి విసిరికొట్టే గుండుయొక్క విధ్వంసక శక్తి దాని గతి-శక్తివల్ల నేకాక గుండులో కుంభించుకొని ఉన్న రాసాయనిక శక్తివల్లకూడా కలుగుతున్నది. గుండు బద్దలుకాగానే అందులోని వస్తువులు వాయురూపమై అసలు గుండుకన్న విస్తారం మేర వ్యాపిస్తున్నవి. అంతమేరా ధ్వంసంచేస్తున్నవి. ఇది రాసాయనికశక్తికి దృష్టాంతము.

మైదాపిండి మొదలైనవాటిని కలిపినందున వండుటనే అప్పచ్చులు ఉబ్బుతున్నవి.

నిప్పు ఆర్పివేసే సాధనంనుంచి వాయు ప్రవాహం నిప్పుమీదికి విసురుకుపోయి నిప్పు ఆరిపోతున్నది. ద్రావకాలు బట్టలను, కొయ్యను, శరీరాన్ని కూడా తినివేస్తవి.

## ౧౦. శక్తిస్వరూపం మారిపోవచ్చును

శక్తిస్వరూపం మారిపోయే సందర్భాలుగాని, మార్చుటనే సందర్భాలుగాని టూకీగా ఒకటి రెండు ఆలోచిద్దాము. విద్యుచ్ఛక్తి పుట్టించడానికి జలశక్తి వలన డైనమోలను ఆడించవచ్చును. బొగ్గు కాల్చి ఆ వేడితోనూ డైనమోలు ఆడించి విద్యుచ్ఛక్తి పుట్టించవచ్చును. మొదటి పద్ధతిని జలపాతప్రపుభరినిబట్టి విద్యుచ్ఛక్తి పుడుతున్నది. రెండవ పద్ధతిని మండే బొగ్గుల వేడినిబట్టి పుడుతున్నది. ఈ విద్యుచ్ఛక్తిని తిరిగి వేడిగా మార్చవచ్చును; గమనశక్తిగా మార్చవచ్చును; దీపపుబుడ్డివల్ల వెలుతురుగా మార్చవచ్చును.

## ౧౧. శక్తి అవినాశి

ద్రవ్యాన్ని మార్చినట్లే శక్తినికూడా రూపాంతరం పొందించి మార్చవచ్చును. ద్రవ్యం శూన్యంనుంచి పుట్టుకురానట్లే శక్తిన్ని శూన్యంనుంచి రావటంలేదు. నీళ్లు ఊరకంగా ప్రవహించక పోయినా, పవర్ స్టేషన్‌లో నిప్పులు ఆరిపోయినా విద్యుచ్ఛక్తి పుట్టదు. అంతేకాక విద్యుచ్ఛక్తి పరిమాణం ఆ జలపాతపు శక్తినిబట్టి, లేదా బొగ్గులశక్తిని బట్టి ఉంటుంది.

శక్తిని వృథాచేయవచ్చును, చెదరగొట్టవచ్చును గాని నాశం చేయలేము. శక్తి ద్రవ్యం లాగానే అవినాశి. పనిచేసే ఆవిరియంత్రపు గతి-శక్తికీ, యంత్రం తిరగటానికి వేసే బొగ్గుశక్తికీ తేడా ఉండవచ్చును. బొగ్గుశక్తిలో అయిదోవంతే గతి-శక్తిగా తేలవచ్చును. కాని ఆ మిగిలిన నాలుగు వంతులూ నాశమైపోయిందనుకోరాదు-ఆ శక్తినాశనం కాదు. యంత్రగతిలోకి వచ్చి చేరేబదులు చుట్టూతా ఉన్న వస్తువులను వెచ్చజేస్తున్నది. అలాగే విద్యుద్దీపపు బుడ్డినుంచి వచ్చే వెలుతురు ఆ వెలుగుకోసమై కాల్చే బొగ్గుశక్తిలో నాలుగు వంతులు తరిగిఉండవచ్చును. మిగిలిన శక్తి చాలావరకు సెగగా మారుతుంది. శక్తిని సృజించనులేము, నాశంచేయనులేము. కాని ఒక రూపంలోనుంచి మరొక రూపం లోకి మార్చగలము. అంటే శక్తి అక్షయంగా ఉంటుం

దనవచ్చును. ద్రవ్యము, శక్తి పర్యాయంగా చెప్పుకో గలిగితే ద్రవ్యం శక్తిస్వరూప మనుకోవచ్చును.

సర్వసామాన్యమైన మూలస్థానాలు రెండు చెప్పాము. జలపాతాలు ఒకటి. రెండవది బొగ్గు. దేహబలానికి అన్న మవసరమని ఇదివరకే తెలిపాము. బొగ్గు అనగానే నిప్పు స్ఫురిస్తుంది. నూనె అంటే దీపం స్ఫురిస్తుంది. పెట్రోల్ అంటే మోటరు, విమానము స్ఫురణకువస్తవి. అన్నం అనగానే అన్నం వల్లనే ప్రాణధారణ అయి జీవించి వ్యవహరించే శక్తి కలుగుతున్నదని స్మరించవలెను.

దీర్ఘకాలం ప్రయోగపరిశీలనలు చేస్తేగాని భూమిమీదను, భూమిలోపలను శక్తి గర్భితంగా ఉన్న సంగతి తెలియలేదు. ఇంకా ప్రయోగపరీక్షణములు జరుగుతూనే ఉన్నవి. మొదట్లో యీ పరిజ్ఞానం యాదా లాభంగా కలిగి ఉంటుంది. బొగ్గును గురించి అసలు ఏమీ తెలియనేతెలియకముందు అరణ్యవాసి ఒక డేవ డేనా నల్లటి కొండరాయి చూడటం సంభవించి, దాన్ని కాల్చితే మండుతుందని తెలుసుకొని ఉండ వచ్చును. అలాగే అన్నపదార్థాలు శక్తిదాత లన్న అర్థం తెలియకముందు కొంత పరిశీలనము, ప్రయోగము జరిగి ఉండాలి.

## ౧౨. ప్రకృతిశక్తి భాండార రక్షణము

భూలోకంలోని శక్తి పరిమితపరిమాణంలో ఉన్నది. ప్రాణుల జీవశక్తికి అన్నం పరమాధారమని గ్రహించాం. పంటలుపండే సారవత్తైన భూములు నిజంగా మాన్యాలు. వాటిని వృథా పోనివ్వరాదు. వేడికి పెద్ద ఆధారాలు బొగ్గు, కలప, నూనె. గత శతాబ్దంలో యీ పదార్థాలు తరిగిపోయినంతగా ప్రకృతి ఆ లోటును భర్తీచేయలేక పోయింది. జల పాతశక్తి ప్రమాణం నీటి మొత్తాన్ని బట్టి, పడే ఎత్తును బట్టి ఉంటుంది. జలాధారమైన మూలస్థానంలోని అడ వులను నరికివేసి వనరు తీసివేస్తే ఆ గొప్ప ఆధారాన్ని కొరగాకుండా చేసివేసిన ట్లవుతుంది. జనాభా వర్ధిల్లిన కొద్దీ ప్రకృతిశక్తులు లోకనిర్వాహానికి మరింత మరింత ఖర్చు పడిపోతున్నవి కనుక ప్రకృతియొక్క సాధన సామగ్రులను రక్షించుకునే నిమిత్తం ఆయా రాజ్యాలు కట్టుదిట్టం చేయవలెను.

చైనాలో అడవులను, తద్రీత్యా నీటివనర్లను రక్షించుకోవలసిన అవసరం గ్రహించక పోయినందున ఎన్నో మండలాల్లో పేదరికమూ, కష్టాలూ దాపరించినవి.

## ౧౩. సర్వశక్తికీ ఆదిమూలం సూర్యుడు

శక్తి శూన్యంనుంచి పుట్టుకోరాదన్నమాట ఇదివరకే చెప్పాము. అయితే జలపాతం, బొగ్గు, కొయ్య, నిప్పు మొదలైనవాటి శక్తికి మరేదో ఆధారంగా ఉండవలెను. జలపాతశక్తి దాని స్థాయినిబట్టి కలుగుతున్నది. కనుక అది అంత యెత్తున ఎలా ప్రవహించిందీ తెలుసుకో గలిగితే దాని శక్తిమూలం తెలుస్తుంది. సూర్యుడు భూతలాన్నుంచి నీటిని కన్పించని ఆవిరిగా ఎత్తుకుపోతున్నాడు. అది ఘనీభవించుకొని ద్రవరూపంగానో, ఘనరూపంగానో భూమికి అవతరించి వస్తున్నది. అందులో తిరిగి చాలాభాగం జలప్రవాహాలను జేరుకొని వాటినిరతప్రవాహ వేగానికి తోడ్పడుతున్నది.

మొక్కల పెంపకానికి సూర్యకాంతి అవసరం. అన్నము, ఇంధనము యావత్తూ ఎలాగో అలాగా మొక్కలనుంచి వస్తున్నవి కనుక సూర్యుని ప్రాధాన్యం వెంటనే తెలుస్తుంది. నిజానికి ఉద్భిజ్జశక్తిని 'స్తంభిత సూర్యకాంతి' అంటే అది సత్యమే.

— 'సైన్స్ ఆఫ్ ఎవిర్ డే లైఫ్' నుంచి.





కొలువునుండి విరమించిన అనేకమంది మనుష్యులు ఇంక కొన్ని సంవత్సరములవరకు సంపాదించుటకు ప్రయత్నించుచు మనస్సునందును ముఖమునందును భయమునుకదుర . . .

## "అయ్యా, నేను బయటికి ఆగ, డుముకొను"



అని చెప్పుకొనవలసియుండును. అయితే తాను వయస్సునుబట్టి ఎంత వృద్ధుడో అంతకంటె ఎక్కువ వృద్ధుడుగా ఆయన తలచుచుండును. అట్లు ఆయన తలచుటకు కారణము వెనుక ద్రవ్యబలము లేకపోవుటయే, ఆయన ద్రవ్యమును దాచుకొనలేదు. ఆయన ఏపనియైన లభించినపుడు తనకు వలదని చెప్పజాలడు. నిరాశయొక్క దైన్య స్థితి ఆయనకు తెలియును. మీకు అట్టిది సంప్రాప్తము కావలసిన పనిలేదు. మీరిప్పుడే ఏర్పాటు చేసుకొనుయెడల గౌరవముగా నౌకరునుండి విరమించిన తర్వాత

మీకు మీ చివరి రోజులను సుఖముగా గడపుటకు చాలినంత ద్రవ్యము మీకుండగలదు. తెలివిగలవారు భావి దృష్టితో తమ అదనపు ఆదాయములను యిప్పుడు నేషనల్ సేవింగ్సు సర్టిఫికేట్లలో దాచుకొనుచున్నారు. రాబోవుకాలమును గురించి వారు ధైర్యముతోనుండగలరు. మీరును ఆవిధము నుండవచ్చును . . . .

# — నేషనల్ సేవింగ్సు సర్టిఫికెట్టులు.

కొద్దిమొత్తములను దాచుకొనకలిగెవారు రూ. 5లకు ఒకసర్టిఫికెట్టునుకొనవచ్చునులేక ఒక్కొక్కటి అ. 4. అ. 8. రూ. 1 వంతున సేవింగ్సు స్టాంపులను కొనవచ్చును. సర్టిఫికెట్టును, స్టాంపులును గవర్నమెంటువారిచే నియమింపబడిన అధికారముపొందిన ఏ ఏజెంటువద్దనైన లేక సేవింగ్సు బ్యాంకులలోను పోస్టాఫీసులలోను దొరకును

★ ప్రతి రూ. 10లు 12సంవత్సరముల తర్వాత రూ. 15లు అవును.

★ నూటికి 4½ వంతుల చొప్పున సాధారణ వడ్డిలభించును. దీనిమీద ఇన్‌కమ్ టాక్సులేదు.

★ మూడు సంవత్సరములైనతరువాత చేరినవడ్డితో డబ్బును తీసుకొనవచ్చును. (రూ. 5ల సర్టిఫికెట్టుకు 18 నెలలు.)

AAA. 128

# వేవల - క్రిప్సు కూర్పు

## భారత వర్తమాన భవిష్యత్తులు

•

= శ్రీ వేలూరి సదానందం =

౧౯౪౫ జూన్ ౧౪ రాత్రి ౭-౪౫కు వైస్రాయి లార్డ్ వేవెల్ రాజకీయప్రస్తావన చేశాడు. బ్రిటిష్ ప్రభుత్వంవారు పరాధీనభారతదేశానికి అనేకప్రస్తావనలు చేశారు. బ్రిటిష్‌రాణి విక్టోరియాప్రకటననాటినుంచి ఎప్పుడెప్పుడు ఎలాటి ప్రస్తావనలు చేస్తూవచ్చినది, ఎందుకు చేసినది, ఏహేతువుచేత భారతప్రజలను ప్రసన్నులను చేసుకోలేకపోయినదీ విచారించటం బ్రిటిష్‌వారి రాజ్యతంత్రపరిజ్ఞానానికి ఉపకరిస్తుంది కాని అది విషయాంతరం.

వేవెల్ ప్రస్తావనమంచిచెడ్డలను విచారించేముందు అసలుప్రస్తావన ఏమో తెలుసుకుందాం.

౧. ఇప్పటి రాజకీయపరిస్థితిని సుకరం చెయ్యదలచీ, పూర్ణస్వపరిపాలనాధ్యేయంకేసి భారతదేశాన్ని ముందుకునడిపనెంచినీ బ్రిటిష్‌ప్రభుత్వంవారు యీ సూచనలను భారతరాజకీయనాయకులకు నివేదించమని వైస్రాయిని నిర్దేశించారు.

౨. ఈప్రయత్నం రాజ్యాంగపరిష్కారం సాధించనెంచేది కాదు, విధించేదీ కాదు. పెద్ద అంతరాయంగా ఉన్న మతప్రశ్నను భారతపార్టీలనాయకులే కూడబలుకుకొని పరిష్కరించుకొంటారని బ్రిటిష్‌ప్రభుత్వంవారు ఆశించారు. కాని ఆ ఆశ సిద్ధించలేదు.

౩. అన్నిపక్షాల ప్రముఖులున్న గొప్ప పూనిక చూపటానికి ఇంతలో భారతదేశానికి గొప్ప అవకాశా లున్నవి. కనుక రాజకీయసంస్థలకు ఎక్కువ ప్రాతినిధ్యం వహించగలిగేలాగున కొత్త కార్యనిర్వాహకవర్గమును ఏర్పాటుచేసేనిమిత్తము వైస్రాయితో సమాలోచించగలందులకు కేంద్ర, రాష్ట్రీయరాజకీయాలకు చెందిన భారతనాయకులను ఆహ్వానించడమగును.

౪. ఈ తలపెట్టిన కొత్త కార్యవర్గంలో ముఖ్యమతకులాలకు ప్రాతినిధ్య ముండును. అందలి సవర్ణహిందువులు, ముస్లిములు సరిసమానముగ నుందురు. సదరు కార్యవర్గం ఏర్పడితే అది ఇప్పటి రాజ్యాంగం ప్రకారమే పనిచేస్తుంది. కాని యుద్ధసభ్యుడుగా ఉండే సేనాపతిని, వైస్రాయిని మినహాయిస్తే ఆ కార్యవర్గం పూర్తిగా భారతీయులమయమైఉంటుంది. ఇంతవరకు వైస్రాయి పాలిస్తున్న వైదేశికవ్యవహారశాఖ బ్రిటిషిండియాప్రమేయం ఉన్నంతవరకు భారతీయసభ్యునిపరం చేయడమగును.

౫. ఇంతేకాక గ్రేట్‌బ్రిటన్‌కు భారతదేశంలో ఉన్న వాణిజ్యాదిప్రమేయములను చూచేనిమిత్తం డొమినియన్లలోలాగా బ్రిటిష్‌ప్రభుత్వంవారు భారతదేశంలో బ్రిటిష్ హైకమీషనరును నియమిస్తారు.

౬. ఆర్థికశాఖ, స్వదేశశాఖ మొదటిసారిగా భారతీయుల పరమగును.

౭. గవర్నర్ జనరల్ రాజకీయనాయకులతో ఆలోచించి కార్యవర్గ సభ్యులను ఎన్నుకుంటాడు: అయితే వారల నియామకం బ్రిటిష్‌రాజముద్ర పొందవలసి ఉంటుంది.

౮. ఈ కార్యవర్గం ఇప్పటి రాజ్యాంగపు ఆవరణలోనే పనిచేసికొనవలసిఉంటుంది. గవర్నర్‌జనరల్‌కు రాజ్యాంగపూర్వకంగా దత్తమైన శాసనాధికారం ప్రయోగించనని ఒప్పుదల అయే ప్రశ్నే లేదు. కాని అది అసమంజసంగా ప్రయోగంకాదు.

౯. ఈ నడమంత్ర ప్రభుత్వపు ఏర్పాటు రాజ్యాంగపరిష్కారఫైసలాయితీని ఏ విధంగాను నిబంధించదనేది స్పష్టము.

౧౦. ఈ కొత్తకార్యవర్గం యీయీపనులు చేయవలసిఉంటుంది. (i) జపాన్ పూరాగా ఓడిపోయేవరకు అత్యంతపాటవంతో యుద్ధం చేయవలెను. (ii) కొత్త రాజ్యాంగవిషయమై ఏకీభవించి అమలుపరచగలిగేవరకున్నూ, యుద్ధానంతర వికాసానికి సంబంధించిన కార్యబాహుళ్యం చూపెట్టుకొని, బ్రిటిషిండియా పరిపాలనను నిర్వహించవలెను. (iii) ప్రభుత్వసభ్యులు సంభవమనుకున్నప్పుడు పైన తెల్పిన రాజ్యాంగవిషయికమైన ఏకీభావం కుదుర్చుకోగల ఉపాయాలను ఆలోచించుకోవలెను. ఇది చాలా ముఖ్యము. వైస్రాయిగాని, బ్రిటిష్‌ప్రభుత్వంగాని పరిష్కారం కుదరదని హతాశులు కాలేదు. ఇప్పటి సూచనలు దీర్ఘపర్యంతపరిష్కారాన్ని సుకరంచేయడానికే ఉద్దేశించడమైనది.

౧౧. అలాటి కార్యవర్గాన్ని ఏర్పరచే చక్కని ఉపాయం వైస్రాయి ఆలోచించాడు. ఢిల్లీలోకన్న చల్లగా ఉంటుందని సిమ్లాలో జూన్ ౨౫న యీదిగువ పేర్కొన్నవారిని సమావేశపరచడ మగును.

(అ) రాష్ట్రప్రభుత్వాల ప్రకృత ప్రధాన మంత్రులు. వీరు ౪ గురు—సరిహద్దురాష్ట్రం: (కాంగ్రెసు) డాక్టర్ ఖాన్‌సాహెబ్; పంజాబ్: (యునియనిస్ట్) ఖిజర్ హయాత్ ఖాన్ టివానా; అస్సాం: (ముస్లిం లీగ్) మహమ్మద్‌సాదుల్లా; సింధు: (ప్రస్తుతం లీగు) గులాం హుసేన్ హిదాయతుల్లా.

(ఆ) సెక్షన్ ౯౩ పరిపాలనవేళకు పూర్వం ప్రధానమంత్రులుగా ఉండినవారు. వీరు ౭ గురు—మద్రాస్: సి. రాజగోపాలాచారి (కాంగ్రెసు); మధ్యరాష్ట్రం: రవిశంకరశుక్ల (కాంగ్రెసు); బొంబయి: బి. జి. ఖేర్ (కాంగ్రెసు); సంయుక్తరాష్ట్రం: జి. బి. పంత్ (కాంగ్రెసు); బీహార్: శ్రీ కృష్ణసింహా (కాంగ్రెసు); ఒరిస్సా: పర్లాకిమిడి మహారాజా; బెంగాల్: నాజీముద్దీన్ (ముస్లింలీగు).

(ఇ) సెంట్రల్ ఎసెంబ్లీలోను, స్టేట్ కౌన్సిల్‌లోను ఉన్న కాంగ్రెస్‌పార్టీల నాయకులు (భూలాభాయి దేశాయి, రాజాబహదూర్ గోవిందశివలాల్ మోతీలాల్); స్టేట్‌కౌన్సిల్ ముస్లింలీగ్ పార్టీనాయకుడు (హుస్సేన్ ఇమాం). ఎసెంబ్లీ ముస్లింలీగ్ పార్టీ నాయకుడు (నవాబ్జాదాలియాఖతలీఖాన్); నేషనలిస్ట్ పార్టీనాయకుడు (పి. యన్. బెనర్జీ); యూరపియన్ గ్రూప్‌నాయకుడు (హెన్రీ రిచర్డ్సన్)—(వీరు౬గురు.)

(ఈ) రెండు ముఖ్యరాజకీయపార్టీలకును నాయకులుగా ప్రసిద్ధులైన గాంధీ జిన్నా గార్లు.

(ఉ) సిక్కులకు ప్రతినిధిగా మాస్టర్ తారాసింగు.

(ఊ) నిమ్నజాతులకు ప్రతినిధిగా యన్. శివరాజ్.

౧౨. సిమ్లాసభ సఫలమైతే కేంద్రంలో కొత్త కార్యవర్గం ఏర్పాటువిషయమై ఏకీభవించవచ్చును. సెక్షన్ ౯౩ పాలితంగా ఉన్న రాష్ట్రాలలో మంత్రివర్గాలు తిరిగి అధికారం దాల్చడమగును. ఇవి మిశ్రమ మంత్రివర్గాలగును.

౧౩. సిమ్లాసమావేశం విఫలమైతే, పార్టీలవారు కూడగట్టుకొనివచ్చేవరకు ఇప్పటిలాగానే నడుస్తుంది.

౧౪. ఈ సూచనలు బ్రిటిషిండియాకే వర్తించును. సంస్థానాధీశులకును, బ్రిటిష్‌రాజప్రతినిధికిన్ని ఉన్న సంబంధాలు ఇందువల్ల ఏవిధంగాను మారవు.

ఇదీ వేవెల్ చేసిన రాజకీయప్రస్తావన.

అప్పటికి నిర్బంధవాసంలో ఉన్న కాంగ్రెస్ కార్యసంఘ సభ్యులను జూన్ ౧౫ ఉదయం విడిచి

వేశారు. ఇంకా జైళ్లలో ఉన్న తదితర కాంగ్రెస్ వాదులను విడిచే విషయం కొత్త కార్యవర్గానికి, రాష్ట్ర ప్రభుత్వాలకు వదలడమైనదని వైస్రాయి తెలిపాడు.

కేంద్ర, రాష్ట్రీయశాసనసభలకు సాధారణ ఎన్నికలు పెట్టేవిషయమై సిమ్లాసభలో చర్చించడమగునని వైస్రాయి వెల్లడించాడు.

ఈ కొత్తకార్యవర్గం స్వపరిపాలనాభిముఖంగా నిశ్చయమైన సాగుదల అని వైస్రాయి అభిప్రాయము. భారతదేశం లక్ష్యస్థానము చేరేగమనములో సాయపడవలెనని బ్రిటిష్ ప్రజలు యావన్మందీ, యునైటెడ్ కింగ్డములోని బాధ్యతగల నాయకులందరున్నూ మనస్ఫూర్తిగా కోరుకుంటున్నారని వైస్రాయి నచ్చ బలికాడు. ఆ ధ్యేయం చేరడానికి ఇపుడు తలపెట్టిన కొత్తయత్నం కేవలం ఒక మెట్టేకాదు - ముందుకు వేసే పెద్ద అంగ, సరియైన దారిని వేసే అడుగు అని వైస్రాయి చెప్పాడు.

భారత నాయకుల సాయసంపత్తిని అర్థిస్తూ క్షమించవలసినది, మఱచి పోవలసినది అన్నివైపులా చాలా ఉందన్నాడు.

వైస్రాయి చేసిన యీ రేడియో శ్రవణం వింటూనే గాంధీజీ వైస్రాయికి తంతి పంపారు. అందులో తేల్చిన అంశాలు :

౧. సవర్ణ హిందువులు అన్నది తప్పుడుమాట. నిమ్న జాతులున్నూ హిందువులే. కాంగ్రెసు జాతీయ సంస్థ.

౨. రాజకీయసూచనలను గాంధీజీ సూక్ష్మంగా హర్షించారు.

3. గాంధీ తాను కాంగ్రెసుకు అధిపతిని కానని, కాంగ్రెసుసభ్యుడనైనా కానని, కాంగ్రెసు తరఫున మాట్లాడగలవాడు కాంగ్రెసు అధ్యక్షుడనీ తెలిపారు.

దీనికి వైస్రాయి సమాధానమిస్తూ సవర్ణహిందువులన్న మాట దురుద్దేశపూర్వకం కాదనీ, నిమ్న జాతుల నుంచి విచక్షణ జేసి చెప్పటానికే ఆమాట వేశాననీ చెప్పాడు.

ఇంతలో విడుదలై గాంధీజీని చేరుకున్న వల్లభాయ్‌పటేల్, శంకరరావుదేవ్‌లు సవర్ణ హిందువులన్న మాటకు ఆక్షేపిస్తూ కాంగ్రెస్‌ను జాతీయ సంస్థగా పరిగణించకపోతే సిమ్లాసభలో పాల్గొనడం జరగదన్నారు.

కాంగ్రెసుకు అధికారపూర్వకంగా ఆహ్వానం వస్తేనేగాని కాంగ్రెస్‌కార్యసంఘంవారు వేవెల్ ప్రస్తావనను వివేచించరని కాంగ్రెస్‌అధ్యక్షుడు వెల్లడిస్తూ కాంగ్రెసు జాతీయసంస్థ అన్న సంగతి ఘంటాపథంగా చెప్పారు. సిమ్లాసభ విఫలమైతే జపానుతో యుద్ధముయేపర్యంతమూ స్వాతంత్ర్యపోరాటం జరగబోదన్నారు.

గాంధీజీ, జిన్నాలు కొంత అర్థవివరణ తెలియగోరగా అదంతా సభలోనే తెలుసుకోవచ్చునని వేవెల్ బదులుచెప్పాడు.

గాంధీజీఆక్షేపణ ఒప్పుకొని వైస్రాయి (కాంగ్రెస్ అధ్యక్షుడు) రాష్ట్రపతి మౌలానాఅబుల్ కలాంఆజాద్‌ను సిమ్లాసభకు పిలిచాడు.

బొంబాయిలో జూన్ ౨౧న, ౨౨న మూడేళ్ల తరవాత కాంగ్రెస్‌కార్యసంఘం సమావేశమై వైస్రాయిఆహ్వానం అంగీకరిస్తూ రాష్ట్రపతిన్నీ, కాంగ్రెసువారైన యితరఆహూతులున్నూ సభకు పోవలెనని నిశ్చయించినారు. ఇంకా స్పష్టంకావలసిన అనేకఅంశాలనుగురించి తెలుసుకొనవలెనని వారికి అవసరమైన ఆదేశ మిచ్చారు.

జూన్ ౨౫న సిమ్లాలో వైస్రాయి సంకల్పించినట్లుగా సభ సమావేశమైనది. కాని గాంధీజీ హాజరు కాలేదు. గాంధీజీ తనకు వ్యక్తిగతమైన స్థాయితప్ప మరి యేలాటి సంస్థాప్రాతినిధ్యపుస్థాయిగాని లేదని వివరించినారట. అయినా, సభ పూర్తయేవరకు గాంధీజీ సిమ్లా విడిచిపోకుండా ఉండిపోవలెనని వేవెల్ కోరినాడు.

# భారతి - పార్థివ ఆషాఢము

ఈమధ్యలోనే లోగడ ౧౯౪౨ లో గాంధీజీ బ్రిటిష్‌ప్రధాని చర్చిల్‌కు వ్రాసియుంచిన ఉత్తరం ప్రచురణ అయింది. అందులో తన్ను బ్రిటన్, భారతదేశాల క్షేమానికి ఉపయోగించుకోవలసిందిగా గాంధీజీ చర్చిల్‌ను కోరినారు. ఇపుడున్నూ అదే వినంగా వేవెల్‌తోనూ చెప్పినారట. గాంధీజీ ఇటు కాంగ్రెస్‌కే కాక అటు వేవెల్‌కుకూడా సలహాదారుగా ఉంటున్నారు.

సిమ్లాసభ ౨౪, ౨౫, ౨౬, ౨౯ తేదీలలో సమావేశమైనది. మొదటిరోజున తాత్కాలికముగా కొంత శేలినది. ౨౬ కి కార్యవర్గసభ్యులను సూచించేవరకు వచ్చినది. ముందుగా ముస్లింలీగుతో రాజీపడవలెనని కాంగ్రెసువారు ప్రయత్నించారు. కుదరలేదు. ౨౯ వ తేదీసభలో ముఖ్యపక్షాలైన కాంగ్రెసు, ముస్లింలీగులు సమాధానపడలేక్కపోయినవి కనుక ఏపక్షానికి ఆపక్షం వారు విడివిడిగా పేర్లు సూచించవలసిందని వేవెల్ కోరినాడు. ఈ పేర్లను అతనికి జూలై ౬ కి తెలుపవలెను. ఇందునిమిత్తం కాంగ్రెసుకార్యసంఘం సిమ్లాలో ౫ న సమావేశమౌతున్నది. ముస్లింలీగుకార్య సంఘం ౬ న సమావేశమౌతుంది. సిమ్లాసభ తిరిగి ౧౪ కి సమావేశమౌతుంది.

దేశంలో అభిప్రాయము నిక్కచ్చిగా లేదు. సరిపడని సంగతులు కొన్ని వేవెల్ ప్రస్తావనలో కంటగింపుగా ఉంటున్నవన్నా సాధారణధోరణి అంగీకారసూచకంగానే ఉంటున్నది. ఉదాహరణకు కాంగ్రెసువారు వర్జించటానికి అనేక హేతువు లున్నవని భావిస్తున్నప్పటికీ ఇదొక మెట్టు కాగల దంటున్నారు. ఇంతకుముందు గాంధీజీ ఒకసారి, బ్రిటిష్ ప్రభుత్వం ఏమి తలపెట్టినా అది స్వాతంత్ర్యపరిభావలో ఉండవలె నన్నారు. వేవెల్‌కు ఇచ్చిన టెలిగ్రాములో స్వాతంత్ర్యసంధ్యాసమయాన ఈ 'సవర్ణహిందువులు' మొదలైనవి ఎందుకు అన్నారు. రాజకీయంగా హర్షించినట్లు భూలాభాయిదేశాయికి తెలిపామన్నారు. అయితే కొన్ని అనుమానాస్పదమైన అంశాలు తేల్చుకోవలసిఉంటుందనే మాట చెబుతూ సాధారణతః పైవిధంగా వెలిబుచ్చారు. కాంగ్రెసు జాతీయమనస్కమై, స్వాతంత్ర్యధ్యాసతో సిమ్లాసభలో పాల్గొంటున్నదని రాష్ట్రపతి ఆజాద్ వెల్లడిస్తున్నారు.

ముస్లింలీగుఅధ్యక్షుడు జిన్నాగారు చెప్పే మాటలనుబట్టి ఇప్పటి ప్రస్తావనవల్ల రాజకీయంగా దేశానికి ఎంతవరకు లాభిస్తుంది అన్న సంగతి వారు ఆలోచించారేమో తెలియదు కాని కనీసం మాటలవల్ల అలాటి వివేచన జరిగిఉంటుం దనుకునే ఆస్కారం ఏమీ లేదు. వారి వాదం పూర్వాపరాలు సూక్ష్మంగా ఇవి: ముస్లిములు హిందువులకు భిన్నులు. వేరేజాతి. ముస్లిములకు ముస్లింలీగే ప్రతినిధి - మరెవరూ ముస్లిముల పేరిట మాట్లాడదగరు. కేంద్రప్రభుత్వంలో సభ్యత్వస్థానాలు హిందువులకు, ముస్లిములకు సమానంగా ఉండాలి. అంటే ముస్లిములకు ప్రతినిధి లీగేకాబట్టి ఆ సామ్యత లీగుకే ఉండాలి. ఇతరమైనవారిటేలను తెచ్చి ఈ సామ్యతను చెడగొట్టగూడదు. హరిజనులుకూడా హిందువులే; వారిని వేరుచేయగూడదు.

ఈవాదనకు ఒప్పుదలలేకపోవటమేగాక తీవ్ర ప్రతిఘటన కన్పిస్తున్నది. కాంగ్రెసు మతకులవివక్షతలు లేని జాతీయసంస్థ. కాంగ్రెస్ ప్రవృత్తులైన ముస్లిము లనేకులు ఉన్నారు. అంతేకాక లీగుకు చెందనట్టిన్నీ, లీగుకు భిన్నమైనట్టిన్నీ అనేకముస్లింసంస్థ లున్నవి. సరిహద్దురాష్ట్రంలో ముస్లిముల బాహుళ్య మున్నదికాని అది కాంగ్రెసుఅధీనం; సింధురాష్ట్రంలోనూ ముస్లిములే అధికులైనా లీగు మంత్రివర్గం దాని కదిరియై నిలకడగా ఉండలేదు. పంజాబ్‌లోనూ ముస్లింప్రాబల్య మున్నప్పటికీ లీగు మైనారిటీలో పడిపోయి యూనియనిస్టుపార్టీ రాజ్యం చేస్తున్నది. బెంగాలులో ఇప్పుడు మంత్రివర్గం లేదు. అక్కడ కొంతకాలం ఉన్న లీగుమంత్రివర్గం మిశ్రమ మంత్రివర్గం. అదీగాక అది అక్రమంగా గవర్నరు

సాయితాతో ఏర్పడిందని అక్కడి ప్రతిపక్షమువారి వాదన. అస్సాంకూడా ముస్లింప్రాబల్యం కలదే అయినా అక్కడ కాంగ్రెస్ తదితరపక్షాలతో రాజీ చేసుకొంటేనేగాని లీగ్ మంత్రివర్గం నిలవలేకుండా ఉన్నది.

కేవలము దానికదిగా చూస్తే సవర్ణహిందువులకు, ముస్లిములకు సామ్యత కల్పించినందుకు సాధారణంగా అయిష్టత ఉన్నది. కాంగ్రెసువారు రాజకీయాదిహేతువులవలన సరిపెట్టుకున్నట్లు తోచినా హిందూమహాసభ మొదలైన సంస్థలవారు తీవ్రంగా ఖండిస్తూ విరుద్ధప్రచారం చేయనెంచినారు.

ఇటువంటి ఊహ వుల్లబుర్రలోగాని పుట్టదని వెనుకటికి సి.రాజగోపాలాచారిగారు చెప్పి ఉన్నారు. అదిన్నీకాక గుణకారాన్ని, లెక్కలను మోసగించడం అసంభవమన్నారు. ముస్లిముల జనసంఖ్యకు తగని హెచ్చుప్రాతినిధ్యం కల్గించి హిందువులను హీనపరచడమౌతున్నదని హిందూసభవారు గర్హిస్తున్నారు. అయితే హిందూసభవారినికూడా సిమ్లాసభకు పిలిచివుంటే ఇంతతీవ్రంగా ఖండిస్తున్నావాళ్లౌనే వారేమో! కాని కేంద్రశాసనసభలో హిందూసభపార్టీ లేదుకనుక పిలవలేదని అంటున్నారు. అయితే సిక్కులకున్ను, నిమ్నజాతులకున్ను అలాటి పార్టీలు ఉంటేనే పిలిచారా! అఖిలభారతీయమైన హిందూసభను ఉపేక్షించడ మెందుకు? కాంగ్రెసునే హిందువులకు ప్రతినిధిగా ఎంచుతారేమో! కాంగ్రెసు హిందువుల క్షేమం ఎన్నడూ ఆలోచించలేదు, పైగా ముస్లిములను సాంత్వనపరుస్తున్నదని హిందూసభవారు అంటున్నారు.

సోషలిస్టుపార్టీ వారు రాజకీయభావనలో కాంగ్రెస్ తరఫైనప్పటికీ కమ్యూనల్ ఎవార్డువిషయంలో కాంగ్రెస్‌తో భేదించారు. అవిధంగా వారు హిందూసభధోరణి సిమ్లాసభలో తెలపగలవారేనని వేరొక ఊహాయిషీ తెలుస్తున్నది.

కాంగ్రెసు - లీగుఒడంబడిక కుదుర్చుకోగలిగితే సంతోషమని, తనకు అంగీకారమౌతుందని సిక్కుల ప్రతినిధి మాస్టర్ తారాసింగు చెప్పాడు.

యూరపియన్ గ్రూపుకు సభ్యత్వం ఏమీ లేదు కనుక నిర్మమకారంగా ప్రవర్తించి సభాసాఫల్యానికి తోడ్పడతానని సర్ హెన్రీ రిచర్డ్సన్ చెప్పాడు.

నిమ్నజాతులకు కొత్త కార్యవర్గంలో ఒకటే స్థానం ఇస్తే చాలదు - హీనపక్షం రెండైనా కావాలి-నాలుగిస్తే మంచిదని సదరహీ సంఘాలవారు అపేక్షిస్తున్నారు.

కనుక ఇంతకూ సభావ్యవహారానికి వచ్చిన అంతరాయం ఏపార్టీవారు ఎందరిని, ఎవరిని నియమించవలెననే విషయమై, అదిన్నీ ముస్లింలీగు, కాంగ్రెసులకు సంబంధించి ఏర్పడినట్లు తేలుతుంది. ఈ ప్రశ్న ఎంత జటిలమనిపించినా చివరకు సానుకూలం కావచ్చునేమో!

అయితే యీ ప్రస్తావనవలన రాజకియంగా కలిగే ఉపకారం ఏమిటి?

సిమ్లాసభను ఉపక్రమిస్తూ వేవెల్ తన రేడియో ప్రసంగాన్నే ఉద్ఘాటించి ప్రకృతం తన నాయకత్వమే అంగీకరించాలన్నాడు. సభవారి తోడ్పాటు అపేక్షించాడు.

జూన్ ౧౪ న పార్లమెంటులో ఎమెరీ చేసిన ప్రకటనవల్ల వేవెల్ చెప్పిన అంశాలకు ఇవి అదనంగా చేరుతున్నవి:—

౧. బ్రిటిషిండియా వ్యవహారాలనుంచి బ్రిటిష్ వారు బుద్ధిపూర్వకంగా తప్పుకుపోతున్న సమయంలో ఇష్టంలేని భారతదేశానికి స్వపరిపాలనా సంస్థలను విధించడమనేది అసంగతము.

౨. ౧౯౪౨ మార్చినాటి క్రిప్స్‌ప్రస్తావన సంపూర్ణంగా ఎలాటి మార్పు, మరతు లేకుండా చెల్లుతుంది.

౩. కార్యవర్గంలో ముగ్గురు సభ్యులు ప[illegible] పాటు కొలువుచేసినవారుగా ఉండవలెనన్న నిబంధన సవరించడమగును.

౪. వైదేశిక వ్యవహారాలను భారతీయసభ్యుని పరం చేసినప్పుడు సరిహద్దుకు సంబంధించినవి, ట్రైబల్ వ్యవహారాలు వర్తించవు. ఈవ్యవహారాలు భారత రక్షణలోనే చేరును.

౫. ఇప్పటి రాజ్యాంగంలో ఇంతకు మించి మేలు కలగదు.

౬. సంస్థానాలు సంపూర్ణంగా పాల్గొనే అఖిలభారత సంఘాతమే (యూనియన్) మా ఆదర్శము.

౭. కార్యవర్గము శాసనసభకు పూచీపడి ఉండదు.

౮. బ్రిటిషిండియా శాంతి భద్రతా క్షేమాలు భంగపడేయెడల కార్యవర్గపు మెజారిటీ అభిప్రాయాన్ని కాదని తోసివేసే అధికారము వైస్రాయికి ఉన్నది—ఉంటుంది. దాని ప్రయోగ విషయంలో వైస్రాయి భారత రాజ్యాంగ కార్యదర్శికే ఉత్తరవాది. అయితే యీ అధికారము భారతీయుల క్షేమార్థమే ఉపయోగపడుతుంది. మైనారిటీలకు ఇది అవసరమైన రక్షణ.

౯. భారతదేశ ప్రతినిధులను కొత్తకార్యవర్గము వివిధ రాజ్యాలకున్ను పంపవచ్చును.

ఎమెరీ వివరణ చేర్చుకొని వేవెల్ ప్రస్తావనను అర్థము చేసికొనవలసిఉన్నది.

ఇది కేవలము ప్రకృతస్థితికి సంబంధించినది. భవిష్యత్తు విషయమై క్రిప్స్‌ప్రస్తావన నిలిచిఉన్నదంటున్నారు. అదేమో తెలుసుకుంటే బ్రిటిష్‌ప్రభుత్వమువారు వర్తమాన భవిష్యత్తులను ఎలా తలపెట్టినదీ వివేచించ వచ్చును.

౧౯౪౨ మార్చి ౩౦ ఉదయం అప్పటి బ్రిటిష్ రికామీమంత్రి స్టాఫర్డు క్రిప్స్ ఈదేశం వచ్చి బ్రిటిష్ ప్రభుత్వ రాజకీయ ప్రస్తావన వెల్లడించాడు.

అప్పటి పరిస్థితిలో వెంటనే అగత్యమైనవి ఉపేక్షించి దూరభవిష్యత్తును గురించి మాత్రమే అందులో ప్రస్తావించినా కాంగ్రెసుతో చర్చలకు దిగాడు. చర్చలు చాలావరకు అనుకూలంగానే సాగి చివరకు దేశరక్షణవిషయమై అసలు ప్రస్తావన నెరవేరక భగ్నపడింది. ఆసమయంలో దేశరక్షణాధికారం లేని జాతీయప్రభుత్వం అప్రయోజకమవుతుందని, అప్పట్లో ఏది పరమార్థమో ఆ వర్తమాన వ్యవస్థనే బ్రిటిష్ ప్రభుత్వవారు వదిలేశారని కాంగ్రెసున్నూ, కాంగ్రెసుతోబాటు దేశమూ భావించినవి

క్రిప్స్ ప్రస్తావనలోని ముఖ్యాంశాలు ఇవి:

౧. భారతదేశంలో వీలైనంత తొందరగా స్వపరిపాలన సిద్ధించాలని బ్రిటిష్ ప్రభుత్వంవారు తలపెట్టిన చర్యలను స్ఫుటంగా ఈ ప్రస్తావనలో వ్యక్తం చేశారు. బ్రిటిష్ సామ్రాట్టుకు ఇతర డొమినియన్లతోబాటు సామంతమైయుండే కొత్త భారతసంఘాతమును కూడ డొమినియన్‌గా ఏర్పాటుచేయవలెనని ఉద్దేశించారు. ఈ డొమినియన్ ఇతర డొమినియన్లతో అన్నిందాలా సరితూగి ఉంటుంది. స్వదేశ విదేశ వ్యవహారాధికారాలలో అది లేశమైనా ఏ సాటి డొమినియనుకూ తీసిపోదు.

౨. అందునిమిత్తం ఇలా ప్రకటన చేశారు:

(అ) వైరశాంతి కాగానే భారతదేశానికి కొత్త రాజ్యాంగము నిబంధించే నిమిత్తము జననియుక్త సంఘాన్ని ఏర్పరచడానికి పూనుకోవడమగును. ఆ సంఘపు ఏర్పాటును గురించి యీ దిగువ తెలుపడమగును.

(ఆ) రాజ్యాంగ రచనా సభలో సంస్థానాలు పాల్గొనటానికి దిగువ వివరించిన ఏర్పాట్లు చేయడమగును.

(ఇ) అలా విరచితమయే రాజ్యాంగమును కొన్ని షరతులకు లోబడి బ్రిటిష్ ప్రభుత్వమువారు వెంటనే అంగీకరించి ఆచరించటానికి ఒప్పుందమూతున్నారు; ఆ షరతు లేవనగా :

(i) కొత్త రాజ్యాంగం అంగీకరించని ఏ రాష్ట్రమైనా యిప్పటి రాజ్యాంగ స్థాయిలోనే ఉండిపోవచ్చును. ఆతర్వాత ఇష్టపడితే కొత్త రాజ్యాంగంలో చేరవచ్చును. ఇలా కొత్త రాజ్యాంగం అంగీకరించని రాష్ట్రాలు ఇష్టపడితే దిగువ వివరించిన మాదిరి రాజ్యాంగం ఏర్పరచుకుంటే బ్రిటిష్ ప్రభుత్వంవారు

సదరహీ రాజ్యాంగానికి భారత సంఘాతంతో సమానఫాయా కల్పిస్తూ ఒప్పుకుంటారు.

(ii) బ్రిటిష్ ప్రభుత్వంవారు రాజ్యబాధ్యతను సంపూర్ణంగా భారతీయుల పరం చేస్తున్నందున అవసరపడే విషయాలన్నీ బ్రిటిష్‌ప్రభుత్వమువారున్నూ, రాజ్యాంగ రచనా సంఘమువారున్నూ సంప్రదించుకొని ఖరారునామా వ్రాసుకుంటారు. జాతి - మత - అల్పవర్గాల రక్షణకై బ్రిటిషు ప్రభుత్వంవారిచ్చిన హామీలకు అనుగుణంగా యీ ఖరారు ఉంటుంది. అయితే బ్రిటిష్ సామ్రాజ్యంలోని సాటి రాజ్యాలతో సంబంధాన్ని మున్ముందు నిశ్చయించుకునే భారత సంఘాతపు అధికారానికి ఎలాటి ప్రతిబంధకమూ ఉండబోదు.

స్వదేశసంస్థానాలు రాజ్యాంగానికి కట్టుబడినా లేకపోయినా కొత్త పరిస్థితిలో అవసరపడినంతవరకు సంధిఏర్పాట్లను పునరాలోచించుకొనే నిమిత్తం సంప్రదింపులు అవసరమగును.

(ఈ) వైరశాంతిలోగా ప్రధానశాఖల నాయకులు మరొక పద్ధతికి అంగీకరిస్తేతప్ప రాజ్యాంగ రచనాసంఘం ఇలా ఏర్పడుతుంది

వైరాలు శాంతించినతర్వాత జరిగే రాష్ట్రాల ఎన్నిక ఫలితాలు తెలియగానే రాష్ట్రశాసనసభ (ఎసెంబ్లీ) సభ్యులు యావన్మందీ ఎన్నికకు ఏకఖత్తుగా ఏర్పడి ప్రపోర్షనల్ రిప్రజెంటేషన్ పద్ధతిని తమలో నుంచి పదవవంతు సభ్యులను ఎన్నుకొని రాజ్యాంగ రచనా సంఘాన్ని ఏర్పరుస్తారు.

బ్రిటిషిండియా మొత్తం ప్రతినిధులు లాగానే జనాభా మొత్తానికి అదే దామాషాన సంస్థానాలు ప్రతినిధులను నియమించవలసినదిగా కోరడమగును. సదరు సభ్యులకు బ్రిటిషిండియా సభ్యులకుండే అధికారాలుండును.

(ఉ) ఇప్పుడు భారతదేశానికి వాటిల్లిన విపద్దశలో కొత్త రాజ్యాంగం ఏర్పడే వరకున్నూ బ్రిటిష్ ప్రభుత్వంవారు తమ జగద్వ్యాప్త యుద్ధకృషిలో అంతర్భాగంగా భారతదేశ రక్షణానియమ నిర్దేశములను విధిగా పూచీపడవలసినవారైయున్నారు. కాని భారతదేశ సైనికబలాన్ని, మనోబలాన్ని, అర్థబలాన్ని నిండుగా సంఘటించే బాధ్యత భారతప్రజల సహకారంతో భారత ప్రభుత్వమే వహించవలెను. స్వదేశ మంత్రాంగంలోను, సామ్రాజ్య సమాలోచనలలోను, ఐక్యజాతుల మంతనాలలోను వెంటనే ఫలవంతంగా పాల్గొనవలసిన దని భారతప్రజా ప్రధానశాఖల నాయకులను బ్రిటిష్‌ప్రభుత్వం ఆహ్వానిస్తున్నది. ఇలా చేస్తే ఆనాయకులు భారతభవిష్యత్ స్వాతంత్ర్యానికి అగత్యము ప్రాణపదము అయిన కార్యనిర్వహణకు సాయితా చేయగలవారు అవుతారు.

ఇదీ 1942 మార్చినాటి క్రిప్స్‌ప్రసావన. ఇప్పుడు యుద్ధం అవసానదశలో ఉండి ఉపద్రవం దూరగిలి భవితవ్యం తేలవలసిన సమయంలో అదంతా క్రిప్స్‌ప్రస్తావనలోనే ఇమిడిఉన్నదని చెప్పి ప్రకృతము అగత్యమైనదానికని బ్రిటిష్‌ప్రభుత్వంవారు పూనుకున్నారు.

ఇప్పటి వేవెల్ ప్ర: క్రిప్స్ ప్రస్తావనలోని (ఊ) భాగానికి క్రియాస్వరూపమని అంటున్నారు. కనుక మొత్తంమీద రెండూ కలిసి భారత వర్తమాన భవిష్యత్తులను నిరూపిస్తున్నవి. క్రిప్స్‌ప్రస్తావనలోని భవిష్యద్విషయాన్ని కాంగ్రెసు హర్షించకపోయినా అప్పటికి ప్రకృతమైన విచారణ చేసి యోగ్యం కాదని నిరాకరించింది. ఇప్పటి ప్రస్తావనలో సవర్ణహిందూ-ముస్లింసామ్య మనే ఏవగింపు ఉన్నప్పటికీ రాజకీయభాగాన్ని హర్షించకపోతే దని పిస్తున్నది.

అప్పటికీ యిప్పటికీ భేద మేమిటి? అప్పటికి జపాను యుద్ధంలో దిగి మూడు నాలుగు నెలలే అయింది. భారతదేశానికి ఉపద్రవ మనిపించింది. కనుక భారతదేశ రక్షణవిషయం ప్రధానమైనది. ఇప్పుడు బ్రి ...ం జపానును ఓడించవలసిఉన్నది. జపాన్ ఉపద్రవం ఇక లేదు.

భారత లో దేశరక్షణ విషయమై సమాధానం కుదిరితే కాంగ్రెసు రాజ్యంచేసి యుద్ధంలో పాల్గొనేదే. కనుక యుద్ధఆశయాలు తెలపమన్న కాంగ్రెసు మాట ఏమైంది అనే ప్రశ్న అప్పుడే బాధించనిది ఇప్పుడు బాధించదు. పైగా కాంగ్రెసు పాల్గొన్నందున ప్రాచ్యదేశాల పునర్జయం తిరిగి దాస్యభూయిష్ఠం కాకుండా వారించేందుకు పాటుబడవచ్చును.

ఇవి అలా ఉంచి రాజకీయాధికారం ఎంతవరకు ఇప్పుడు లభిస్తుం దనేది చూస్తే స్వదేశవ్యవహా

రాల్లో సంస్థానాలపై ఏమీ అధికారం లేకపోవడము, వైదేశిక వ్యవహారాల్లో కలగబోయే అధికారము స్వదేశ సరిహద్దు వ్యవహారాలకు వర్తించకపోవడము లోటుగా ఉన్నవి.

వైస్రాయి స్వాధికార ప్రయోగం అసమంజసంగా జరగదన్నమాట ౧౯౩౭ లో గవర్నర్ల రాష్ట్ర ప్రభుత్వాలకు ఇచ్చిన హామీని జ్ఞప్తికి తెస్తున్నది. ఇది కొంత సుగుణము.

క్రిప్సు ప్రస్తావన సందర్భంలో ఈ మాట రాలేదు కాని జాతీయప్రభుత్వమని, మంత్రివర్గమని క్రిప్సు భ్రమపెట్టినందున యీ విషయం తర్కించ నవసరం లేకపోయింది.

బ్రిటిష్‌వారు బుద్ధిపూర్వకంగా భారత దేశం నుంచి తప్పుకో పోతున్నారని, అంతకుముందు రాజ్యాంగ బద్ధమైన ప్రభుత్వమంటూ ఒకటి ఉండవలెనని ఎమెరీ అంటున్నాడు.

క్రిప్సు ప్రస్తావనలో సూచించిన భవిష్యద్విషయము ఇపుడు సన్నిహిత మౌతున్నది.

వేవెల్ ప్రస్తావనవల్ల సైన్యశాఖ అంటే రక్షణ విషయంతప్ప పైన తెలిపిన ముఖ్యమినహాయింపులతో రాజ్యాధికారం చాలావరకూ భారతీయులపర మౌతున్నది. ఇది విశేషము.

అయితే ఏర్పడబోయే కొత్త కార్యవర్గం జాతీయ ప్రభుత్వమూ కాదు, మంత్రులంటూ ఉండరు. కనుక ప్రధానమంత్రి లేడు. వైస్రాయి మహానాయకుడు.

కాంగ్రెసు రాజకీయ ధోరణి కిది చాలా వెగటైనప్పటికీ స్వాతంత్ర్యసిద్ధికి యిది ఒక మెట్టుగా ఉపకరిస్తుం దనిపిస్తున్నది.

రాజకీయంగా జాతి యావత్తు క్షేమం విచారించేది కాంగ్రెస్ తప్ప మరేదీ కన్పించటంలేదు కనుక కాంగ్రెస్ విషయమే హెచ్చుగా తలచవలసివచ్చినది.

కాంగ్రెసు కొన్ని ముఖ్యోద్దేశాలతో ప్రవర్తిస్తున్నట్లు తోస్తున్నది.

౧. కార్యవర్గం ఏర్పరచిన వెంటనే రాజకీయ ఖైదీల నందరను విడిచివేసి రాజకీయ ప్రతిబంధకాలను తీసివేయడము.

౨. త్వరలో కేంద్రరాష్ట్రీయ శాసనసభలకు ఎన్నికలు జరపడము.

౩. ఇంతలో కాంగ్రెసు సంస్థను బలిష్ఠంచేసుకొని సంసిద్ధమవడము.

౪. ఇప్పటి బహుదీన స్థితిలో లభించే రాజ్యాధికారమును దేశశ్రేయస్సుకోసం వినియోగించి ముందు ముందు దేశం మరీ అధోగతిపాలై పోకుండా అరికట్టడము.

౫. భవిష్యద్రాజ్యాంగ రచన సంకల్పించడం.

వెనక ౧౯౩౭ లో కాంగ్రెసు రాష్ట్రాలలో మంత్రివర్గాలు ఏర్పరచి కొంత ప్రయోజనం సాధించినదానికన్న కేంద్రంలో ఎక్కువ ప్రయోజనమే సాధించవచ్చును.

సవర్ణ హిందూ-ముస్లిం సామ్యత తాత్కాలిక ఏర్పాటే నని, భవిష్యత్ స్థితిని ఏ విధంగాను బాధించదని అన్నప్పటికి అది అంత సబబుకాదు. ప్రత్యేక నియోజకవర్గాలు, కమ్యూనల్ ఎవార్డు ఎలా పాతుకుపోయిందీ చూస్తూనే ఉన్నాము. ఒకసారి పెటకమంటూ పెడితే అది పాతుకుపోయి మరింత అధ్వాన్నపు స్థితికి దారితీస్తున్నది. కనుక యీ విషయం భయావహం కాకపోదు.

ఇందుకు బ్రిటిషు వారిని శంకించిగాని, నిందించిగాని ప్రయోజనం లేదు. అదే ఆజాతినీతి.

సిమ్లా సభలో ఆయా విషయాలన్నీ స్థూలంగా ఒప్పుదల అయినట్లే ఉన్నది. దేశరక్షణవిషయం యుద్ధకాలంలో పరమార్థమే. మిగిలిన వ్యవహారం యావత్తూ అందుకు లోబడిపోతుంది. వీటినిగూర్చి రాష్ట్రపతి ఆజాద్ తర్కించినట్లు తెలుస్తుంది.

సిమ్లా సభాఫలితం ఎలా ఉండేదీ చెప్పలేము. గాలిలో దీపమూ అనిపించకపోదు. తిరిగి సమావేశమైనప్పుడు ఎక్కువ కాలహరణం లేకుండానే తేలిపోతుందనుకోవచ్చును.

ఇది బ్రిటిష్‌ప్రభుత్వంవారు ఎన్నికల ఎత్తుగా తలపెట్టేదకేది నిశ్చయము. ఎత్తు కవసరము ఎన్నికలే కానక్కరలేదు. (30-6-45)

# కీర్తిశేషులు కృష్ణరాయులు

= శ్రీ భావరాజు నరసింహారావు =

అవి సత్యాగ్రహమూ, శాంతిసమరమూ మంచి ఘుమ్మురంగా ఉన్న రోజులు. ఆసేతుహిమాచలపర్యంతమూ గాంధీమహాత్ముని శంఖారావం విని వేలకువేల దేశభక్తులు జైళ్లు నింపుతూన్న రోజు లవి. అటు వేసవిఎండలతోనూ, యిటు ఉప్పుసత్యాగ్రహోద్యమంతోనూ దేశం అట్టుడికినట్లు ఉడుకుతున్న రోజులు.

అది సాయంకాలం. ఆరుగంటలవేళ, రోడ్డు ప్రక్కన ఉన్న ఒక పల్లెటూరు. ఒక పెద్ద రావిచెట్టు. దాని చుట్టూ నాలుగుగజాలవరకూ సిమెంటుచపటా. చెట్టుమొదట్లో ఒక వయసుమళ్లిన వ్యక్తి గంభీరమైన గళంతో ఏదో చదువుతున్నాడు. చపటామీద కూర్చున్నవారు కూర్చోగా, చుట్టూ సుమారు ఒక వందమంది నిల్చుని వింటున్నారు. ఆ చదువుతున్న వ్యక్తివంక చూడకుండా వింటుంటే, ఎవరో మహానాయకుడు ఉచ్చైస్స్వనంతో ఉపన్యసిస్తున్నట్టు భావిస్తాం. శ్రోతలంతా ఏకాగ్రచిత్తంతో ఆ అమృతవాక్కుల్ని గ్రోలుతున్నారు. ఎవరి కళ్లల్లోకి చూచినా ఉత్తేజం, ఉత్సాహం తొణికిసలాడుతున్నాయి.

కాగా, త్రోవన పోతున్న ప్రతిమనిషీ—విజ్ఞాని అయినా, నిరక్షరాస్యుడైనా—ఆ పలుకులు వింట్టూ అలా నిల్చునిపోతున్నాడు. ఏమిటి ఆపురాణపఠనం అని విచారిస్తే తేలింది—అది "కృష్ణాపత్రిక"సంపాదకీయవ్యాసం అని. ఆ రోజునేకాదు, ప్రతిఆదివారంసాయంకాలమూ కొన్ని ఏళ్ల నుంచి అలా జరుగుతోంది.

పర్యవసానః -మూడోనాడు పత్రికలలో చూడగా పైన చెప్పిన ఆ పల్లెటూరినుంచి పదిమందికి పైగా ఆ రెండు రోజులలోనూ సత్యాగ్రహసమరంలోకి దూకినట్లు వార్త!

ఇది ఆ ఒక్కగ్రామంవిషయంలోనే కాదు. బరంపురంమొదలు బళ్లారివరకూ ఉన్న పన్నెండు తెలుగుజిల్లాలలోనూ, తెలంగాణాలోనూ అనేకవందలగ్రామాలలో జరిగిన, జరుగుతూన్న విషయం. ఆంధ్రదేశంలో "కృష్ణాపత్రిక"కు గల పూజ్యస్థానమూ, పలుకుబడీ అసాధారణం, అనితరలభ్యం అని చెప్పటానికి యిది ఒక మచ్చుతునక.



శ్రీ ముట్నూరి కృష్ణారావుగారు

(సుమారు నెలదినములు జలోదరవ్యాధిచే బాధపడి, మొన్న జూను ౨౩-వ తేదీ సాయంకాలము, మద్రాసులో, తమ ౬౮-వ యేట కాలధర్మమునొందిరి)

అక్కడ వంగదేశంలో తన గీతాలవల్ల ప్రజలలో జాతీయభావాన్ని రేకెత్తించి దిగంతవిశాలకీర్తిని ఆర్జించాడు రవీంద్రుడు.

ఇక్కడ ఆంధ్రదేశంలో స్వరాజ్యోద్యమానికి నామ రూపాలు కల్పించి, పల్లెపల్లెలా, వాడవాడలా తన పత్రికా ముఖాన ఆ ఉద్యమానికి అపారమైన సేవ చేసి ఆంధ్రులనూ, కాంగ్రెసుసంస్థనూ తన ఋణంలో ఉంచుకుని కీర్తిశేషులైనారు ముట్నూరి కృష్ణారావుగారు.

* * *

ఇది మా బందరు చేసుకున్న పుణ్యఫలం. ఆంధ్ర దేశంలో జాతీయోద్యమానికి మూలపురుషులైనవారిలో ముగ్గురికి—కోపల్లె హనుమంతరావుగారు, ముట్నూరి కృష్ణారావుగారు, భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు—మా పట్టణం ఆటపట్టు! ఆంధ్రదేశంలో జాతీయవిద్యకు బీజములు నాటి, అవి వృక్షదశను పొందకముందే స్వర్గస్థుడైనాడు హనుమంతరాయడు. జాతిమత వివక్షత లేని విశాలజాతీయభావాన్ని తన పత్రికద్వారా సాధించదలచిన కృష్ణారావుగారు తన ఆశయం పూర్తిగా కొనసాగకముందే దివంగతులైనారు. బందరుపట్టణాన్ని ఆదర్శవ్యాపారసంస్థలకు కేంద్రం చేసి బందరుకు శాశ్వతమైన గౌరవస్థానాన్ని చేకూర్చి, తదభివృద్ధికి యింకా కృషిచేస్తున్నారు శ్రీ పట్టాభి సీతారామయ్యగారు. ఈ ఉద్దండులు ముగ్గురూ ఒక ఊరికి, ఒక కాలానికి చెందినవారవటమే కాకుండా హృదయాలు కలిసిన ప్రాణమిత్రులు కావటం గొప్ప విశేషం.

* * *

కృష్ణారావుగారు బందరునోబుల్ కళాశాలలో ఎఫ్. ఏ. చదువుతూ "వందేమాతరం" ఉద్యమంలో విద్యాభ్యాసానికి స్వస్తిచెప్పి, వంగదేశం వెళ్లి బిపిన్‌చంద్రపాలు గారి సాహచర్యంతో కొంతకాలం అక్కడ గడిపి, తర్వాత బందరు చేరి "కృష్ణాపత్రిక"ను చేపట్టారు. ఆ పత్రిక అప్పటికి "కృష్ణాజిల్లా అసోసియేషన్" తరఫున "దేశభక్త" వెంకటప్పయ్య, కెడింబి హనుమంతరావుగార్లచే నడపబడుతూ, కేవలం ఒక స్థానికపత్రికగా సాగిపోతూండేది. అప్పటినుంచీ కృష్ణారావుగారు తన యావచ్ఛక్తినీ వినియోగించి "కృష్ణాపత్రిక"కు అసమానఖ్యాతిని గడించిపెట్టారు.

ఆ తర్వాత దేశదారిద్ర్యాన్ని రూపుమాపటానికి జాతీయపరిశ్రమల్ని ఉద్ధరించాలనే ఉద్దేశంతో ఒక సబ్బుబిళ్లల ఫాక్టరీని నెలకొల్పారు. కాని అది అప్పటికాలం మనలేదు.

౧౯౩౦ ఉప్పుసత్యాగ్రహోద్యమంలో రెండుసంవత్సరాలూ, ౧౯౪౧ వ్యక్తిసత్యాగ్రహంలో ఆరునెలలూ వీరు శ్రీకృష్ణజన్మస్థానాన్ని అలంకరించారు.

* * *

అసలు కృష్ణారావుగారు "మౌనముద్రాలంకారులు". వేదికలెక్కి ఉపన్యాసాలివ్వటం ఆయనకు యిష్టం లేని పనుల్లో ఒకటి. అంచేత ఆయన యిచ్చిన ఉపన్యాసాలు లెక్కకు బహుకొద్ది—పదిపదిహేనుకు మించవు!

కాని "కృష్ణాపత్రిక"లోని వారి సంపాదకీయాలూ, యితరరచనలూ అన్నీ అన్ని ఉపన్యాసాలుగా లెక్కవేయవచ్చును. అవి ఆయన ఎదురుగుండా నిల్చుని మాట్లాడుతున్నట్లు ఉండేవి. అంత ఉద్రేకాన్ని కలిగించేవి.

ఆయన ఉపన్యాసపుముచ్చట్లు ఒకటి రెండు మనవి చేస్తాను. దండిసత్యాగ్రహపు రోజుల్లో ప్రచారానికి చెరుకు

వాడ నరసింహం ప్రభృతులతో కృష్ణారావుగారు బలవంతం మీద వెళ్లటం సంభవించింది. కృష్ణారావుగారు ఉపన్యాసా లివ్వరుగా, కేవలం అధ్యక్షపీఠం అలంకరించే షరతుమీద మాత్రమే బయలుదేరేవారు. ఆయన ఉపన్యసిస్తే ఎల్లా ఉంటుందో వినాలనే కుతూహలంతో చుట్టుప్రక్కల ఊళ్ల నుంచి జనం విరుచుకుపడేవాళ్లు. వీరిని ముందు అధ్యక్ష పీఠంలో కూర్చోబెట్టి, పుష్పమాలాలంకృతుల్ని చేసేవారు. తనాటి సభ పూర్తి అయ్యేవరకూ జరగవలసిన వనంతా కేవలం మూగసంజ్ఞలతో కానిచ్చి, సభను "జయప్రదంగా" నిర్వహించేవారు కృష్ణారావు.

ఇటీవల ఒకసారి ఒక విద్యాసంస్థవారు నిర్మించిన నూతనభవనం వీరిచేత ప్రారంభోత్సవం జరిపించాలని ఆ సంస్థతరఫున పెద్దలు వచ్చి వీరిని కోరారు. కృష్ణారావుగారు మొదట అంగీకరించలేదు—అక్కడ ఏదైనా మాట్లాడవలసి వస్తుందని. చివరికి "భవనపు తాళం తెరుస్తానుగాని, నా నోరుమాత్రం తెరవను"అనే షరతుమీద ఒప్పుకున్నారు. తాళం తెరిచినతర్వాత సభవారి బలవంతంమీద నోరుకూడా తెరిచారు. మాట్లాడినా, వ్రాసినా తన అంతరాత్మకు తోచిన సత్యాన్ని ఉన్నదున్నట్లుగా చెప్పకతప్పదుకదా. ఆసందర్భంలోకూడా మన విద్యావిధానాన్ని, మనవిద్యాసంస్థలు—ముఖ్యంగా ఆ సంస్థ—నడుపుతున్న బోధనీయపద్ధతినీ అతితీవ్రంగా విమర్శించారు. చివరికి అన్నారు ఆయన—"ఇప్పుడు యీసంస్థవారు విచారిస్తున్నారు నన్ను
నివ్వకుండా చెయ్యిమాత్రంచేసుకుని వెళ్లనిస్తే బాగుండేదని!"

అయితే, ప్రపంచానికంతకూ "మౌనముద్రాలంకారు"లైన కృష్ణారావుగారు మిత్రులకూ, "దర్బారీయు"లకూ సాక్షాత్తు ఒక ప్రఖ్యాతకళాశాలఉపన్యాసకుడు. కళనుగురించి కాని, కవిత్వాన్నిగురించిగాని, వేదాంతంగాని, సైన్సుగాని—దేనినిగురించిఅయినాసరే"........యీవిషయాన్ని కాస్త విపులీకరించిచెప్పండి"అని అడగటం తరవాయిగా అనర్గళమైన ధారతో (ఆంగ్లమో, ఆంధ్రమో ఆరోజుధోరణినిబట్టి) అరటిపండు ఒలిచిపెట్టినట్లు చక్కగా విమర్శించి చెప్పేవారు.

ప్రతిరోజూ ఏదోవిషయం ఎవరో అడగటం, దాన్ని కృష్ణారావుగారు విమర్శించి చెప్పటం నిత్యకృత్యంగా జరిగేవి. ఆ ఉపన్యాసాల నన్నిటినీ ఏమహాదేవదేశాయో ఉండి జాగ్రత్తగా వ్రాసిపెట్టినట్లయితే కొన్ని ఉద్గ్రంథాలు తయారై ఉండేవి. భూగర్భశాస్త్రంమొదలు భరతనాట్యంవరకూ,



ఆయుర్వేదంమొదలు ఆధునిక "అల్ట్రావయొలెట్‌రేస్" వరకూ, అటు షేక్స్పియరూ యిటు కాళిదాసూ, అటు గాంధీజమూ యిటు కమ్యూనిజమూ—ఒకటేమిటి? సర్వవిషయాలతోనూ, సర్వశాస్త్రాలలోనూ సామాన్యజ్ఞానంతో కాక, కూలంకషపరిజ్ఞానంతో విమర్శించేవారు. గిరీశం చెప్పినట్లు కృష్ణారావుగారితో మాట్లాడటమే, వారి సాహచర్యమే ఒక "ఎడ్యుకేషన్"

* * *

దర్బారు!

నిజంగా "దర్బారే" అది! శిలావేదికలతో కూడిన "జుమ్మామశీదు" (కృష్ణాపత్రికాకార్యాలయంలోని చక్కటి తోట)లో సింహద్వారానికి ఎదురుగా "సింహాసనం"(సినిమా హాల్లో ఉండే యినపకుర్చీ!)మీద "శ్రీగురుగ్రంథసాహెబ్బువారు" (కృష్ణారావుగారికి దర్బారీయులు పెట్టుకున్న పేరు అది) ఆసీనులై ఉండ, యిరుప్రక్కలా "దర్బారుశాయరు", "వంగవాసివటురాయలు" మున్నగు పరివారమంతా సభను

అలంకరించిఉండగా—ఏప్రాంతంనుంచో ఒక కవికుమారుడు తన కృతులను చదివి వినిపించి, కృష్ణారావుగారి ఆశీర్వచనం కోసం ఎదురుచూస్తూంటాడు. ఒక చిత్రకారుడు తన చిత్రాలను వారికి చూపించి వెన్నుచరిపించుకుంటాడు. ఒక వేదాంతి తన సందేహాలను ఆయనకు నివేదించి కృష్ణారావుగారి అమృతవాక్కుల్నిగ్రోలి "తృప్తోస్మి"అనుకుంటాడు. ఒక రాజకీయవేత్త తన అభిప్రాయాల్ని కృష్ణారావుగారివద్ద బయటపెట్టి, వారి విమర్శన అయినతర్వాత తన దృక్పథాన్ని మార్చుకుని వెళ్తుంటాడు. ఒక నటకుడు తన నటనా కౌశలం కృష్ణారావుగారి గీటురాయిమీద ఎలా ఉన్నదో చూచుకుని మురిసిపోతూంటాడు. ఒక కాంగ్రెసుభక్తుడు జీవితంమీద నిస్పృహచెంది కృష్ణారావుగారితో కొన్నిగడియలు గడిపిన తర్వాత ద్విగుణితోత్సాహంతో మళ్లీ స్వాతంత్ర్య సమరంలోకి దూకుతుంటాడు.

ఒకరేమిటి? కాంగ్రెసువలంటీరు మొదలు కళోపాసకుడివరకూ, లంబాడీ నాట్యకత్తెలు మొదలు మళయాళ స్వాములవరకూ ఎవరైనా బందరు వచ్చినప్పుడు కృష్ణారావుగారి దర్శనం "దర్బారు"లో చేసుకోకుండావెళ్లేవారు కారనడంలో అతిశయోక్తి ఏమీ లేదు.

"రాష్ట్రిముల పాలన మొనర్చు రాజు కాడు; రాజై యాతడు నిజమనోరాష్ట్రిమునకు"—బృందావనపురాన్ని పాలించే "దర్బారు" అది కాకపోయినా, ఆ పట్టణకళాభిరుచుల్ని ప్రతిబింబించే "దర్బారు" అది! ఆ "దర్బారు"కు కిరీటంలేని "కృష్ణరాయలు" కృష్ణారావుగారు!

జీవితంలో వేదాంతమూ, హాస్యమూ, కళాభిరుచీ, కాంగ్రెసుభక్తీ, భాషానురక్తీ, దైవభక్తీ అన్నిటికీ సమానస్థాన మిచ్చి తన జీవితనౌకకు వెన్నెలబాటను కల్పించుకున్నారు కృష్ణారావుగారు. "దర్బారు"లో చెప్పిన వీరి హాస్యపుగాథలు మరపురానివి ఎన్నో ఉన్నాయి.

కృష్ణారావుగారు కలకత్తాలో ఉంటున్న రోజుల్లో ఒకసారి "షేవింగ్ సెలూన్"కి వెళ్లారు. వీరి వేషాన్నీ, శిఖనీ చూసి ఆ మంగలి "క్రాపుచేసి కనీసం ఒక రూపాయిదబ్బులన్నా సంపాయించవచ్చు" ననే గంపెడాశతో సామాను సర్దుతున్నాడట. వాడి సన్నాహం అంతా కానిచ్చి మెల్లిగా తన తలగుడ్డ తీసి బల్లమీద పెట్టారట కృష్ణారావుగారు. కొండంత ఆశతో ఉన్న ఆ మంగలి, పాపం, నిలువునా కూలబడిపోయాడట—పాదరసపు బుడ్డిలాగ నిగనిగలాడుతున్న కృష్ణారావుగారి బట్టతలను చూసి! "నా జీవితంలో నే నెవ్వరికీ ఆశాభంగం చేయలేదు—ఒక్క ఆ కలకత్తా మంగలికి తప్ప!"అని అంటూండేవారు కృష్ణారావుగారు.

ఒకసారి కృష్ణారావుగారిని బళ్లారిజైలుకు తీసుకుపోతున్నారు యిద్దరు పోలీసులు వెంటబెట్టుకుని. దోవలో ఒక స్టేషనుదగ్గర ఆ పోలీసులకు ఆకలివేసి "కాస్త కాఫీ తాగివస్తాము. తమరు ఈపెట్టెలోనే ఉండండి"అని కృష్ణారావుగారిని రైలుపెట్టెలో కూర్చోపెట్టి వెళ్లారు. వాళ్లు తిరిగి వచ్చేసరికి కృష్ణారావుగారు తన తలపాగా తీసి చేతిసంచీలో దాచి ఏదో ఉత్తరీయం కప్పుకుని ఆ పెట్టెలోనే యింకొకచోట కూర్చున్నారు. మన పోలీసుసోదరులు తిరిగివచ్చేసరికి "తలగుడ్డపెద్దమనిషి" కనబడలేదు. వాళ్లు ఖంగారుపడి పెట్టెలోనివాళ్లందర్నీ అడిగారు ఆ మనిషినిగురించి—కృష్ణారావుగారిని కూడా! మాకు తెలియదని చెప్పారు—కృష్ణారావుగారుకూడా! పాపం! వాళ్లు చాలా గాబరాతో రైలుబండీ అంతా గాలిస్తున్నారు. ఇంతలోకే కృష్ణారావుగారు తలపాగా ధరించి ఏమీ ఎరగనట్లు తన స్థానంలో యథాప్రకారంగా కూర్చున్నారు. పోలీసులు ఎల్లాగైతేనేం ఆయన తిరిగి కనబడినందుకు తమను తాము అభినందించుకుని, తమ ఉద్యోగాలు దక్కినందుకు ఎంతో సంతోషించారు!

చివరికి—తనకు వ్యాధి ముదిరిన తర్వాత ఆ దిగులుతో క్రుంగిపోతున్న తన యిల్లాలిని, ఎవరైనా తనను చూడవచ్చినప్పుడు "ఇదుగో, గంగాభాగీరథీసమానురాలూ! వీరికి కాసిని మంచినీళ్లిప్పిస్తావా?" అని మేలమాడితే, ఆ మహాసాధ్వి "అబ్బా! నన్ను నవ్వించకండి: నేను నవ్వలేను" అనేవారు. వెంటనే కృష్ణారావుగారు "అల్లాగా? పాపం! అయితే ఆ రెండోపని (రోదనం!) కానియ్యి. 'రిహార్సు'లన్నా అవుతుంది" అని కొసరి నవ్వించేవారు.

* * *

ఎల్లాచూసినా కృష్ణారావుగారి అస్తమయం ఆంధ్రులకు తీరని నష్టాన్ని కలిగించింది. ఆయనస్థానాన్ని ఆక్రమించగల వ్యక్తి నేడు ఆంధ్రదేశంలో కనబడడు. కొంతకాలంవరకూ కనీసం కనబడే సూచనలన్నా లేవు.

కృష్ణారావుగారిపట్ల ఆంధ్రుల కున్న గౌరవానికి చిహ్నంగా వారి అమూల్యరచనల్ని అన్నిటినీ సేకరించి గ్రంథాలుగా ప్రచురించినట్లయితే ఆంధ్రభాషకు అసమాన సేవ చేసినవా రవుతారు. ఇంతకన్నా వేరేవిధంగా యిప్పట్లో ఆంధ్రులు కృష్ణారావుగారి ఆత్మకు శాంతి చేకూర్చలేరు.



# విమర్శనము



## రేడియో

గ్రంథకర్త: వేపా వెంకటలక్ష్మణరావుగారు. అనువాదకులు: సత్తిరాజు సాంబశివరావు, చింతా సూర్యనారాయణమూర్తిగార్లు. ప్రకాశకులు: రిషైసాన్సు ప్రింటర్సు లిమిటెడ్, త్యాగరాయనగరము, మదరాసు. వెల 3 రూపాయలు.

రేడియో సర్వవ్యాప్తముగా విజృంభించుచున్న ఈరోజులలో రేడియోవిజ్ఞానము చాల అవసరమైయున్నదనుట నిర్వివాదము. రేడియోలలో మనకు వినబడు శబ్దము ఎట్లు, ఎక్కడ పుట్టుచున్నదో, అది ఎట్లు గాలిలో ప్రసారము చేయబడి రేడియో పెట్టెలలోనుండి మనకు ఎట్లు వినబడుచున్నదో, రేడియోల మంచిచెడ్డలను తెలిసికొనుట ఎట్లో, వాని నిర్మాణ విధానరహస్యములేవో, అవి పాడయినప్పుడు బాగుచేయుట ఎట్లో, ఇత్యాది రేడియో విజ్ఞానమంతయు ఈగ్రంథములో శాస్త్రీయముగా నిరూపింపబడియున్నది. వివరణకు అవసరమైనచోట్ల చిత్రములు కూడ జతగూర్పబడియున్నవి. తెలుగులో ఇంతవరకు ఈ రేడియోనుగురించిన సాంకేతిక గ్రంథము లేని లోటును దీనిమూలముగా తీర్చినందుకు గ్రంథకర్తయు, అనువాదకులును, ప్రకాశకులును అభినందనార్హులు.

## గ్రంథ స్వీకారము

### పరివర్తనం

రచయిత: గోపీచంద్ గారు. ప్రకాశకులు: జాతీయ పబ్లిషర్సు, తెనాలి. వెల ౧ రూపాయ.

### కల్యాణకళ

ప్రకాశకులు: మణిమేఖల, పల్లిపాలెము, కాకినాడ తాలూకా.

### శ్రీ

రచయిత: విద్వాన్ రా. సీ. ఆంజనేయశాస్త్రి గారు, బి. ఏ. ప్రకాశకులు: దేశికవితామండలి, ఘంటసాల, కృష్ణాజిల్లా. వెల పావలా.

### ఆముక్తమాల్యదపర్యాలోకనము

రచయిత: వెల్లండ ప్రభాకరరావుగారు. ప్రకాశకులు: సాధనసమితి, సికింద్రాబాదు. వెల ౧రూపాయ.

Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., G. T., Madras. Editor—S. Sambhu Prasad.




చక్కని రుచి, ఘుమ ఘుమలా
సువాసన, నేత్ర పర్వంగావుండే
రంగు తక్కువధర, వీటి అన్నింటి
నిబట్టి లిప్టన్స్ వైట్ లేబుల్
మిగతా వాటిని తలదన్ని అత్య
ధిక గౌరవాన్ని తెచ్చుకున్నది




# లిప్టన్
# వైట్ లేబుల్

మృదు మధురమైన ఇండియన్ లీఫ్ టీ

LTK 84 WTG

Regd. No. M. 1856 7th JULY 1945.











